

'చేపల వేట'

ఫోటో: ఎ. వి. రామమూర్తి—మయూరం.

ఆంధ్ర ప్రజానీకానికి మా ఉగాది శుభాకాంక్షలు

జి. కె. మంగరాజుగారిచే 1931 సం॥ లో స్థాపింపబడిన

# ★ పూర్ణ యాత్రా సర్వీస్ ★

## గ్యారంటీ

1. విడిబోగీలు కాకుండా పూర్తి ట్రయిను.
2. మూడవతరగతివారికి కూడా నిద్రించుటకు చాలినంత స్థలం.
3. ప్రచురించిన తేదీకి తప్పక బయలు దేరుట.
4. బండి బయలు దేరుటకువారంరోజులుముందుగా ప్రయాణంవిరమించుకొన్నచో పూర్తిసొమ్మువాపసు.
5. భోజనమునకు సన్నబియ్యం, వెన్నకాచిన నెయ్యి, రెండుకూరలు, పప్పు, పులుసు, చారు, మజ్జిగ, ఆవకాయ, గోంగూర, ఉసిరికాయ, చింతకాయ, పండుమిర్చి మొదలగు పచ్చళ్ళున్ను, కందిపొడి, ధనియాలపొడి, కారంపొడి మొదలగునవి ఉపయోగించబడును.

## 1958 సం॥ ఏప్రిల్ 26 వ తేదీ ఉదయం గం॥ 5 లకు
## అనగా తెల్లవారితే శనివారం

విజయవాడనుండి బయలుదేరి సింహాచలం, పూరీ, భువనేశ్వరం, కలకత్తా, గయ, కాశీ ప్రయాగ, అయోధ్య, లక్నో, హరిద్వారం, ఋషికేశం, బదరీనాథ్, బ్రకానంగల్ డాం, శ్రీనగరు (కాశ్మీరు), అమృతసర్, ఢిల్లీ, మధురాబృందావన్, ఆగ్రా, కోటా, ఉజ్జయిని, జాంనగర్, ద్వారక, లంకద్వారక, అహ్మదాబాద్, సూరత్, బొంబాయి, నాసిక్, కోపరగాం (శిర్డీసాయిబాబా), పండరీపురం, హైదరాబాదుమీదుగా 64 రోజులలో విజయవాడ చేరును. విజయవాడ-బరంపురం మధ్య చేరువారికి ఆయాస్టేషనులలో రైలు ఆపబడును.

## రైలు చార్జీలు వగైరాలు

రోజూ రెండుపూటలా భోజనం, బదరీ, శ్రీనగరులకు రానుపోను బస్సుచార్జీలతో సహా

ఏర్ కండిషన్డు .... రూ. **1500/-**

**1** వ తరగతి రూ. **690/-** .... **3** వ తరగతి రూ. **450/-**

3 సం॥ ల లోపువారికి ఉచితము .... 3 మొ॥ 12 సం॥ వారికి అర్థచార్జీలు

నేటికి 27 సం॥ముల అనుభవము గడించిన జి. కె. మంగరాజుగారి ఆధ్వర్యమున అన్ని ఏర్పాట్లు గావింపబడును. నూటయాభై మంది యాత్రీకులకు మాత్రమే యేర్పాటుగాన టికెటు 1కి రూ. 50/- అడ్వాన్సుగా వెంటనే యీ క్రింది అడ్రసుకు పంపి మీ సీటు రిజర్వు చేసుకోవలెను. అడ్వాన్సు పోను మిగతా సొమ్ము బయలుదేరు రోజున చెల్లించవలెను. సాధారణంగా ప్రజలకు అవకాశంలేని పశ్చిమ సముద్రతీరమున వున్న ద్వారక మొదలైన యాత్రలు చేర్చబడెను.

వివరములకు:

## పూర్ణ యాత్రా ట్రావెల్ సర్వీసు,

పూర్ణా బిల్డింగ్సు, విశాఖపట్టణం-2.

టెలిగ్రామ్: "విశ్వనాథ్" టెలిఫోన్ నెం: 374 & 575.

FLOOD LIGHT.

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 31
26-3-58

Founder : K. NAGESWARA RAO

విలంబి చైత్ర శు షష్ఠి బుధవారం



## విషయానుక్రమణిక



★

ముఖచిత్రం :
అశోక్ పిక్చర్స్‌వారి
'రాగిణి' లో జబీన్‌జలీల్

★

# "యాదగిరి"

ఆంధ్ర రాజధానీ నగరానికి 45 మైళ్లలో ఉన్నది యాదగిరి శ్రీ లక్ష్మీనరసింహస్వామి క్షేత్రం. ఆంధ్ర తెలంగాణా ప్రజకు ఈ స్థలం అభిమానయాత్రాస్థలం. తెలంగాణాలో ముఖ్యంగా ఏ గ్రామానికి పోయినా ఇంటింటా యాదయ్య, యాదగిరి, యాదమ్మలు, నరసింగరావులు ప్రత్యక్షమవుతూ ఉంటారు. ఈ క్షేత్రదైవం మహిమ చాలా ప్రసిద్ధం. అనుభవైక వేద్యము. రాజధానినుంచి రెండుంబావలా చెల్లిస్తే బస్సులో సరాసరి యాదగిరి వెళ్ళవచ్చు. రైల్లో వెడితే ఇంకా ఎక్కువ. అయితే రాయగిరి స్టేషనునుంచి నాల్గు మైళ్లు బండిలోనో, కాలినడకనో పోవచ్చు.

శ్రీ యాదమహర్షి ఋష్యశృంగుని కుమారుడు. అనేక సంవత్సరాలు యాదగిరి కొండపై శ్రీ నరసింహస్వామిని గూర్చి తపస్సు చేశాడు. భగవంతుడు సాక్షాత్కరించేసరికి తనకోసమే గాక జగత్కల్యాణంకోసం భక్తులనిమిత్తం ఈ కొండపై సర్వదా నిలచి పొమ్మని ప్రార్థించాడు. భగవంతుడు జ్వాలా నరసింహస్వామి, యోగానంద నరసింహస్వామి, గండభేరుండ నరసింహస్వామి—మూడు రూపాల్లోను కొండగుహలో వెలిశాడు. తనను దర్శించిన భక్తుల ఈప్సితాలను ఈడేరుస్తూ వారిపాలిట కల్పవృక్షంగా ఉన్నాడు.

కొన్ని ఏండ్ల క్రిందట కొండక్రింద ఉన్న గ్రామంలో స్వామి ఒక భక్తునికి కనిపించి 'నేను కొండమీదే ఉన్నాను. నాకు నిత్యార్చనకు ఏర్పాటుచెయ్యి' అని అన్నాడు. గ్రామస్థుల సహాయంతో కొండపైకి ఆ భక్తుడు వెళ్ళి స్వామిని కనుక్కొని అర్చనాదులు ఏర్పరచారు. వారి కుటుంబీకులే ఇప్పుడూ ఆలయం అంటే ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నారు. ఆ మూడురూపాలు అంత విస్పష్టంగా కనిపించనందున భక్తులకు శ్రీ లక్ష్మీనరసింహస్వామి వెండి విగ్రహాలు ప్రక్కనే అమర్చారు. శ్రీకృష్ణదేవరాయల వంశీకులు పూర్వము, ఇప్పుడు పన్నాలాల్ పిటీ వంశీకులు ఆలయ పునరుద్ధరణకు కృషి చేశారు.

## శ్రీ నరసింహక్షేత్రాలు

కర్నూలు జిల్లా అహోబిలంలో ఫాల్గుణ పౌర్ణమికి నరసింహస్వామి ఉత్సవాలు జరుగుతాయి. అది మంచి శ్రీవైష్ణవక్షేత్రం. నవ నరసింహులు అక్కడ వున్నారు. పంచలింగాకారంలో ఉన్న నరసింహస్వామికి నిత్యార్చనలు జరుగుతూ ఉంటాయి. కరీంనగర్ జిల్లా ధర్మపురి గోదావరీతీరాన వుంది. ధర్మాంగదుడి కథాప్రసక్తికి సంబంధించిందీ గ్రామం. ఇక్కడ కూడా శ్రీ లక్ష్మీనరసింహస్వామి చిరకాలంక్రితం వెలసినాడు. కృష్ణాజిల్లా కృష్ణానదీ తీరాన వేదాద్రిలో కూడా నరసింహస్వామి ఆలయము వున్నది. గుంటూరు జిల్లాలో పానకాల నరసింహస్వామి మంగళాద్రిపై వెలకొన్నాడు. ప్రహ్లాదుడు ప్రతిష్ఠించాడని ప్రసిద్ధి ఉన్న సింహాచలంలో వరాహనరసింహస్వామి కూడా ఆంధ్రులందరికీ అభిమానదైవంగా ఆరాధింపబడుతున్నాడు.

అహోబిలానికి ఆళ్లగడ్డ నుంచి 14 మైళ్లు రస్తా పడాలి. రెండో పంచవర్ష ప్రణాళికలో లక్షా 40 వేలు కేటాయించారు గాని పనిమట్టుకు ఇంకా జరగడం లేదు. 14లక్షలు ఈ రస్తాకు ఖర్చు అని అంచనా. జగయ్యపేట నుంచి వేదాద్రికికూడా మంచి రస్తా పడాలి. ఇప్పుడు ఒక కచ్చారస్తా ఉంది. సింహాచలంలో యాత్రికులకు చక్కని విశ్రాంతి మందిరాన్ని నిర్మిస్తున్నారు. మంగళగిరిలో స్టేషను పెద్దది కట్టారుగాని, యాత్రికులకు కూడా సౌకర్యాలు వృద్ధిచేయాలి. యాదగిరి దగ్గర ఉన్న రాయగిరి స్టేషను చిన్నది. రాయగిరినుంచి యాదగిరి గుట్టకు వున్న రస్తా ఇప్పుడిప్పుడే బాగుచేస్తున్నారు. కొండపైకి రోడ్డుకూడా ఉన్నది. కొత్త పోశాయిగాని రస్తా అంత భద్రమైనది గాదు.

## యాదగిరి మాహాత్మ్యం

కొండక్రిందనుంచి కొండపైకి 875 మెట్లు ఉన్నాయి. పసిపిల్ల బాలాది పదిహేనునిముషాల్లో కొండపైకి తేలిగ్గా ఎక్కిపోవచ్చు. కొండమీదకు పాత మెట్లదారి, పాతాళదారి, వైకుంఠద్వారం దారి, మోటారు రోడ్డు నాల్గుదార్లు ఉన్నాయి. కొండపైన యాత్రికులకు వందపైగా సత్రాలు ఉన్నాయి. కొండమీద మహిమగల పుష్కరిణి ఉన్నది. స్వామి ఆలయంలో ప్రదక్షిణాలతోను, పుష్కరిణిలో స్నానంతోను దీర్ఘరోగాలు, పిశాచాది బాధలు ఎందరో పోగొట్టుకుంటూ ఉంటారు.

కొండమీదకు చక్కని ఆరోగ్యప్రదమైన గాలి వస్తుంది. చుట్టూ ఉండే అడవి, చిన్న చిన్న గుట్టలు చూడటానికి మనోహరంగా ఉంటాయి. కొండమీద కావలసిన వస్తుసామగ్రి దొరుకుతుంది. భోజన వసతి గృహం ఉన్నది. సంస్కృతపాఠశాల నడుపుతున్నారు దేవస్థానంవారు. కొండమీద కేశఖండనలు, ఉపనయనాలు, కల్యాణాలు, ప్రత్యేక జపాలు, అర్చనలు వందలాదిమంది వచ్చి చేసుకుంటూ ఉంటారు.

భక్తులు కోడెల మొక్కుబళ్లు ఘంటల మొక్కుబడి, విలువ దోపిళ్లు, గడప మొక్కుబళ్ళు, కొబ్బరికాయల మొక్కుబళ్ళు, పుట్టువెంట్రుకల మొక్కుబళ్లు, చెల్లించుకుంటూ స్వామి దర్శనంతో మనశ్శాంతి పొంది వెళ్లుతూ ఉంటారు. ప్రదక్షిణాలు మండలంరోజులు చేస్తారు. పిల్లలులేనివాళ్ళు, సంపదకోరేవాళ్ళు, ఉద్యోగంకోరేవాళ్లు, పరీక్షల్లో ఉత్తీర్ణులు కావాలని కోరేవాళ్లు, ఎందరెందరో తమ మనోరథాలు ఫలించగా స్వామి మొక్కులు చెల్లించుకుపోతూ ఉంటారు.

కొండమీద చిన్న పట్టణం ఒకటి వెలసినది. ఇంకా ఇళ్ళు కట్టించడానికి సిద్ధంగాఉన్న భక్తులు ఉన్నారు. ఇంటిమీదనే ఇల్లు కట్టాలిగాని ఇక కొండపై ఇళ్ళు విస్తరించడానికి తగినంత స్థలం లేదు. సింహద్వారం దగ్గర శ్రీ సీతారామలక్ష్మణాది దైవతముల విగ్రహాలు అలంకరించి గోపురం భక్తులను ఆకర్షిస్తుంది. ఆ ప్రక్కనే దేవస్థానం కార్యాలయం. సింహద్వారంకి రెండుమెట్లు దిగేసరికి కుడివైపునే ఆంజనేయులి గుడి. హనుమాన్



కొండపైన ఆలయ గోపురం.

ఆలయానికి సమీపాన రాతిపై గండభేరుం డనృసింహస్వామిలోమ్మ ఉన్నది.

## గర్భగుడి

మరి కొన్ని అడుగులు క్రిందికు వస్తే నరసింహస్వామి ఆలయం ముఖమండపంలోకి ప్రవేశిస్తాము. దేవాలయం ఎదురుగా ధ్వజస్తంభం ఉన్నది. దేవాలయం ద్వారందాటి లోపలకు వెడితే ఒక గుహలో ప్రవేశిస్తాము. కొంచెం పొడుగుపాటివాళ్ళు తలవంచుకొని పోవలసినదే. ఎడమవైపున స్వామి గర్భాలయంలో భక్తులు కొన్నలు అర్పిస్తారు. ఎడమవైపున ఎత్తుగా ఉన్న రాతిపై కూర్చొని భక్తులు పూజలు, అర్చనలు చేస్తూఉంటారు. ఆ రాతికటు చివర ప్రక్కనే రెండురాళ్లు దగిరదగిరగా ఉంటాయి. ఒకదానిపై సర్పాకారం కనిపిస్తుంది. ఇది శ్రీ జ్వాలా నరసింహస్వామి విగ్రహం. ఈ చుట్టు ప్రక్కల ఒక సర్పం తిరుగుతూ ఉంటుందని చెబుతారు. ప్రక్క రాతిపై యోగానంద నరసింహస్వామివారి ఆకారం కనిపిస్తుంది. అంతటితో భక్తునికి తృప్తికలుగదు. అందుకోసం లక్ష్మీ నరసింహస్వామివారి వెండి విగ్రహాలు అమర్చారు. వాటిని చూసి భగవంతునితో తాదాత్మ్యము పొందుతారు భక్తులు.

బయటకువచ్చి అమ్మవారిగుడిలో కుంకుమ పూజ చేసుకుంటారు. ప్రక్కన గదుల లోని ఆళ్వారులకు నమోవాకా లర్పిస్తారు. ఆలయం చుట్టూఉన్న ప్రదక్షిణపు దారిలోను, ముఖమండపంలోను దశావతారాది బొమ్మలను భక్తులు కన్నులపండువుగా చూసి దణ్ణాలు పెడతారు. స్వామివారి ఆలయానికి అమ్మవారి ఆలయానికిగూడా వెండితలుపులు ఏర్పాటు చేశారు.

స్వామివారికి పెద్దరథము ఇతర వాహనాలు కొండపైన ఉన్నవి. ఆలయానికి కొద్ది దూరంలోనే పుష్కరిణి ఉంది. దానిగట్టున హనుమంతుడి విగ్రహాన్ని స్థాపించారు. అద్దాలమహాలు చూడదగ్గినది. అక్కడే సభామండపం ఉన్నది. సభామండపం దగిర మరో రథంగూడా ఉన్నది. కొండ క్రింద ఒక ఎకరంమేర తులసీవనం, కదళీవనం ఉన్నాయి. కొండపైన కొంచెం దిగువన శివాలయం ఉన్నది. దానికి దగ్గరలోనే సంస్కృత పాఠశాల.

## భోగాలు - అర్చనలు

ప్రతిరోజు ఉదయం మేల్కొల్పు, బాల భోగం, క్షీరాభిషేకం, అర్చన, పగటి భోగం, సాయం సేవ స్వామికి జరుగుతూ ఉంటాయి. నిత్యమూ కుంకుమార్చన చేస్తూఉంటారు. శుక్రవారం అమ్మవారి పూజ విశేషంగా జరుగుతుంది. తెలుగు ఉగాది, నృసింహ జయంతి, (వైశాఖ శుద్ధ పౌర్ణమికి) నవరాత్రి ఉత్సవాలు, కృష్ణ జన్మాష్టమి, ఆండాళ్ నక్షత్రం శరన్నవ రాత్రులు, దీపావళి, ధనుర్మాసం, వైకుంఠ ఏకాదశి, మార్గశిర శుద్ధ ఏకాదశి, మంచి ఉత్సవాలరోజులు. ఆలయంలో ఒకప్పుడు అద్వైతులే అర్చనచేసేవారు, గాని ప్రస్తుతం విశిష్టాద్వైతపద్ధతి నే అర్చనాదులు జరుగుతున్నవి. ఏటా స్వామి కళ్యాణానికి పండిత పరిషత్తులు, హరికథా కాలక్షేపాలు, పాట కచేరీలు జరుగుతూ ఉంటాయి. ఈ క్షేత్రంలో ఇంకా ఇప్పటికన్న యాత్రికులకు మంచినీటి వసతిసౌకర్యాలు, రాకపోకల వసతిసౌకర్యాలు, విద్యుద్దీపసౌకర్యాలు వృద్ధి చేయడానికి ప్రభుత్వం ఇంకా శ్రద్ధవహించి కృషి చెయ్యాలి."



—పి. వి. ఆర్. శర్మ]



యాదగిరి దృశ్యం.




# ప్రమోషన్లలోకూడా కులప్రసక్తి

**శ్రీ కృష్ణ**
[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

పార్లమెంటుకు గడచినవారమంతా రైల్వే బడ్జెట్, సాధారణ బడ్జెట్ చర్చలతోనే సరిపోయింది. విద్యామంత్రి మరణం, ఆర్థిక మంత్రి రాజీనామా ఫలితంగా అనేక విధాలుగా ఊహాగానాలు జరిగినతర్వాత కేంద్ర మంత్రి మండలిలో మార్పులు జరిగాయి. శ్రీమతి తారకేశ్వరి సిన్హా తారాజువ్వలాగా తారాపథం చేరుకోవటం ఈ సందర్భంలో ముఖ్యంగా గమనించదగింది. క్రితం పార్లమెంటులో ఈమె అందర్నీ ఆకర్షించింది గాని ఏమీ జరగలేదు. తెలివైన ఆవిడ గనక, అప్పట్నించీ ఆమె ఆర్థిక విషయాలలో ప్రత్యేక పరిశ్రమచేసి, అన్నీ క్షుణ్ణంగా నేర్చుకుంది. ఈమెకు మంచి వాగ్ధాటి ఉంది. అందుచేత ధోకాలేకుండా నెగ్గుకు రాగలదు. కాని ఈమెకిచ్చిన కొత్త పదవి అగ్నిపరీక్షలాంటిది. లోక్ సభలో సభ్యురాలుగా ఈమె అందరికీ తలలో నాలుకలా మెలగింది. ఈమెకు చాలెడుమంది స్నేహితులున్నారు. కొత మంత్రులకు చెప్పే పాత నీతి ఒకటుంది: "లోపల అనుకున్నవాటిని బైటికి పొక్కనివ్వవద్దు"అని. మరి శ్రీమతి తారకేశ్వరిసిన్హా ఇప్పటి పదవిలోనే ఉండిపోతుందో, ఇంకా పైకిపోతుందో అంతా శ్రద్ధగా వేచిచూస్తారు. ఆవిడ పదవిలో ప్రగతి అనేది, ఆవిడ నోట్లో ప్రభుత్వ రహస్యాల నువ్వుగింజలు నానతాయో లేదో అనే దానిమీద ఆధారపడిఉంటుంది. వెనకటికి బ్రిటిష్ ఆర్థికమంత్రిగా పనిచేసిన డాల్టన్ మహాశయుడు ఒక జర్నలిస్టుతో మాట్లాడుతూ జాగ్రత్తపడకపోవటంమూలాన పదవి నుంచి తప్పుకోవాల్సివచ్చింది.

ప్రధానమంత్రిని సందు దొరికితే చాలు ముఖస్తుతిచేసే సభ్యురాళ్ళు కనీసం మరి ఇద్దరు పార్లమెంటులో ఉన్నారు. శ్రీమతి తారకేశ్వరిసిన్హా నియామకంతో వీరి జోరు తగ్గుతుందని ఆశించవచ్చును. ప్రధానమంత్రి ముఖస్తుతులకు ఉబ్బి తబ్బిబ్బులయ్యే బాపతు కాదని శ్రీమతి సిన్హా నియామకంతో స్పష్టమైంది ఆయన తొలివలపు దేశంమీద; తరవాతే మిగతా వాటిమీద.

లోక్ సభ రైల్వేబడ్జెట్ ను ఆమోదించింది. ఇది రైల్వేమంత్రి ప్రతాపం కానేకాదు. లోక్ సభలో చక్కగా సంఘటితమైన ప్రతిపక్షప్రాతికూల్యంఅంటూ లేకపోవటంవల్లా, కాంగ్రెసుపార్టీకి ఉక్కిరిబిక్కిరిగా సంఖ్యాబలం ఉండటంవల్లా రైల్వేబడ్జెట్ నెగ్గింది. కాంగ్రెసుపార్టీ సంఖ్యాబలంవల్ల దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అభివృద్ధి కావటం మానేసింది. దానిబదులు కొందరు మంత్రుల్లో అహంకారం అభివృద్ధి అవుతోంది. ఇందుకు శ్రీ జగ్జీవన్‌రాం మంచి ఉదాహరణ.

బడ్జెట్ చర్చలో ఆంగ్లో ఇండియన్ వర్గ నాయకుడు శ్రీ ఫ్రాంక్ ఆంతోనీ రైల్వే మంత్రి అనుసరిస్తున్న కార్మికవిధానాన్ని విమర్శించారు. రైల్వే కార్మికులకు కాంగ్రెసు ముద్రపడిన ట్రేడ్ యూనియన్ నాయకులను అంటగడుతున్నారని ఆయన ముఖ్యవిమర్శ. ఈవిమర్శకు కొన్ని కారణాలు లేకపోలేదు. బ్రిటిష్ పరిపాలకులు రైల్వే, కస్టమ్స్, టెలిగ్రాఫ్ శాఖలలో కొన్ని ఉద్యోగాలను ఆంగ్లో ఇండియనకు కేటాయించేవారని, ఆంగ్లో ఇండియన్లకు ఈ శాఖలమీదవున్న అభిరుచినిబట్టే అలా కేటాయించారనీ పాఠకులకు తెలిసినదే. ఇటీవల ప్రకటించిన అంకెలుచూస్తే, ఈశాఖలలో కొత్తగా చేర్చుకునే ఆంగ్లో ఇండియన్ల సంఖ్య ఎంత తగ్గిపోయిందో తెలుస్తుంది. ఈ అల్పసంఖ్యాక వర్గాలలో కొన్నివర్గాలు తమకు కాంగ్రెసు నాయకులలోనూ, ముఖ్యంగా ప్రధాన మంత్రిలోను ఉన్న పరిపూర్ణ విశ్వాసంవల్ల, తమకువిడిగా ప్రత్యేకంగా కేటాయింపులు అనవసరమని రాజ్యాంగ నిర్మాణంరోజుల్లో వాటిని వదులుకున్నారు. ప్రత్యేక నియోజకవరాలు తమ కక్కరలేదనిచెప్పి దేశభక్తిని ప్రదర్శించినందుకుగాను శ్రీ ఫ్రాంక్ ఆంతోనీని లోక్ సభసభ్యునిగా నామినేట్ చేశారు. 'ఇదుగో నిన్ను నామినేట్ చేశాం' అని ఆయనమొహానే అనటం ఆయనకిగాని, ఆయన ప్రాతినిధ్యం వహించే గొప్ప వర్గానికిగాని న్యాయం చేయటం కాదు.

స్వాతంత్ర్యానికి ముందురోజుల్లో కార్మికులకుకూడా ప్రాతినిధ్యంఇప్పించేందుకోసం వారి ప్రతినిధులను నామినేట్ చేయవలసి వచ్చేది. కీ॥ శే॥ జోషి కార్మిక ప్రతినిధిగా ఉంటూ, ఎప్పుడూ పొరబాటుగానైనా ప్రభుత్వానికి అనుకూలంగా ఓటుచేయలేదు. ఎప్పుడూ ప్రతిపక్షంతో పాటే ఓటు చేసేవారు. అయినా బ్రిటిష్‌వారు "ఇదుగో, భారత గవర్నరుజనరలే మీ నియోజకవరం" అని ఆయన్ని ఎప్పుడూ హెచ్చరించలేదు.

శ్రీ ఆంతోనీ "భవానీ జంక్షన్" డైలాగులు మాట్లాడుతున్నారని ఎవరో అన్నారు. మరి ఆయన్ని విమర్శించేవారు మాట్లాడేది మహాత్మాగాంధీ సూక్తులా? కాదు. వారు మాట్లాడేది భారతదేశ విభజనకు దారితీసిన భాష. ఈభాష మొదటగా మాట్లాడింది అల్ప సంఖ్యాకవర్గానికి చెందిన వ్యక్తి. రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొన్న అల్ప సంఖ్యాక వర్గం మూలంగానే నేటి షెడ్యూల్డు కులాలు షెడ్యూల్డు కులాలుఅయ్యాయి. రెండవ రౌండ్ టేబుల్ సమావేశంలో మహాత్మాగాంధీ తానే భారతదేశానికి ప్రతినిధినని చెప్పారు. కీ॥ శే॥ డా॥ భీమ్‌రావ్ అంబేద్కర్ అది అబద్ధ

 

# న్యూఢిల్లీ లేఖ



అన్నారు. అప్పుడు షెడ్యూల్డు కులస్థులకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఇచ్చే కమ్యూనల్ అవార్డు రావటం, మహాత్మాజీ ఉపవాసం చేయటం, మహాత్మాజీకి, డా॥ అంబేద్కరకు పూనాలో ఒప్పందం కుదరటం వగైరాలు జరిగాయి. రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినా, రాజ్యాంగ రక్షణలిచ్చినా షెడ్యూల్డు కులస్థులకింకా ఆర్థిక, సాంఘిక స్వాతంత్ర్యం మాత్రం రాలేదు. ఆంగ్లో ఇండియన్లు కూడా ఒకరకం షెడ్యూల్డు కులస్థులే. రాజ్యాంగపు షెడ్యూళ్లలో వీరిని ఆంగ్లో ఇండియన్లు అని అన్నారు.

పరిశ్రమలకు గాని, వర్గాలకుగాని రక్షణ ఇవ్వటమంటూ ఒకసారి జరిగితే, రక్షితుల సమ్మతి తీసుకుని రక్షణను ఉపసంహరించటమంటూ సాధారణంగా జరగదు. షెడ్యూల్డు కులస్థులకు ఉన్న రాజ్యాంగ రక్షణను పొడిగించాలని ఒత్తిడి జరుగుతోంది. అంతేకాదు. ప్రమోషన్లను కూడా కులాలనుబట్టే నిర్ణయించే పద్ధతి అమలు జరపాలని శ్రీ జగ్జీవన్ రాం భావిస్తున్నారు. భారత విభజనకు ముందు ముస్లింలీగ్ లేవదీసినవాదంకూడా సరిగా ఇదే. బ్రిటిష్ వారు కులప్రాతినిధ్యాన్ని సిద్ధాంతరీత్యా అంగీకరించి ఉద్యోగాలివ్వటంలో ఆయా కులాలకు ఎన్నెన్ని ఉద్యోగాలివ్వాలీ అని కూడా కేటాయింపులు చేశారు. ఒకసారి ఉద్యోగంలో ప్రవేశించటమంటూ జరిగాక, ప్రమోషన్లు సమర్థతనుబట్టి, సీనియారిటీనిబట్టి జరిగేవి. అంతేగాని కులమతరీత్యా ప్రమోషన్లు చేసేవారుకాదు. కులమతరీత్యా చేసినట్లయితే పరిపాలన దెబ్బతిని పోతుందనీ, అసమర్థమై పోతుందనీ వారికి తెలుసు. అయితే మన శ్రీ జగ్జీవన్‌రాం ప్రమోషన్లుకూడా కులరీత్యా అమలు జరపాలని భావిస్తున్నారు.

ఐక్యభారత కేంద్ర శాసనసభలో కీ॥ శే॥ సర్ అబ్దుల్ హలీం ఘజ్నవీ సభ్యుడుగా ఉండేవారు. ఆయనకి రైల్వే విషయాలమీద మహాశ్రద్ధ. అప్పుడు రైల్వే ప్రమాదాలు బహుతరుచుగా జరిగేవి. ఒకసారి ఆయన ఇలా అన్నారు:

"రాయల్ ఇండియన్ విమానదళంలో సైనికుల్ని చేర్చుకోటానికి 'విమానదళంలో చేరి లోకంచూడండి' అనే నినాదాన్ని ప్రచారం చేస్తున్నారు. బాగానే ఉంది. 'ఇండియన్ రైల్వేలలో ప్రయాణం చేసి పరలోకం చూడండి' అని నేను మరోక నినాదం సూచిస్తున్నాను."

ఈ నాటి రైలు ప్రయాణాల్ని గూర్చి శ్రీ ఎ. బి. వాజ్పాయీ సరిగ్గా ఇలాంటి విమర్శే చేశారు. తదితరులు, ముఖ్యంగా సభ్యురాళ్ళు, రైళ్ళ పరిస్థితిమీద బాగా రాళ్ళురువ్వారు. ఆ క్లాసూ, ఈ క్లాసూ అనిలేకుండా ఏ క్లాసులో ప్రయాణం చేయబోయినా ప్రాణాంతకంగా ఉంటోందనీ, కిటికీ తలుపులు ఎత్తితేదిగవనీ, దింపితే ఎత్తటానికి వీల్లేదనీ, మరుగుగదులు మురుగుగదులుగా తయారయ్యాయనీ, ప్లాటుఫారాలు ఛండాలంగా ఉంటున్నాయనీ, ఏ రైలూ రావలసిన టైముకి వచ్చి, పోవలసిన టైముకు పోదని అనేకవిధాలుగా విమర్శించారు. మంత్రులు ఎప్పుడూ, రైల్వేబోర్డు సభ్యులు తరుచూ విమానాల్లోనే విహారిస్తూ ఉంటారు గనుక, భారతీయ రైల్వేల ప్రమాణాలూ, ప్రయాణాలూ కూడా ఏవిధంగా పాడైపోయుందీ వారికి తెలియదు.

భారతదేశం బ్రిటిష్ పాలననుంచి విముక్తి పొందింది గాని, బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన "యోగ్యతాపత్రాల మనస్తత్వం" నుంచి భారతీయులకు మాత్రం విముక్తి కలగలేదు. ప్రమాణాలు పడిపోతున్నాయని ఎవరు ఏ విమర్శ చేసినా, సమాధానంగా ప్రపంచ బాంకువారి నివేదిక చూపిస్తున్నారు. బహుశా ఏనుగకి రెండు రకాల దంతా లున్నట్టుగా, ప్రపంచ బాంకు ప్రతినిధివర్గం రెండురకాల నివేదికలు—ఒకటి ప్రపంచంకోసం, ఇంకోటి బాంకుకోసం – తయారుచేస్తుందేమో. ఎందుకంటే భారతీయ రైల్వేల్ని గూర్చి ప్రపంచ బాంకు ప్రతినిధులు తమ రహస్యనివేదికలో ఏమి అభిప్రాయం ప్రకటించారో తెలియదు గదా. ఒకవేళ ప్రపంచబాంకు ప్రతినిధులకు భారతీయ రైల్వేలలో మంచి మంచివాటిని ఏరి మరీ చూపించారేమో. ఇదీ కాకపోతే, బహుశా ప్రపంచబాంకువారుచూసిన ప్రపంచం చాలా చిన్నదై ఉంటుంది; ఆ చిన్న ప్రపంచంలో భారతీయ రైల్వేలకంటె మంచి రైల్వేలు కనిపించే ఉండవు.

ఏమైనా తెగడటానికిగాని, పొగడటానికి గాని అర్హులు రైల్వే ప్రయాణికులే. రైళ్లలో రద్దీని చూసీ, రైలు చార్జీలు పెంచటాన్ని చూసీ భారతీయ రైల్వేల ప్రమాణాలను నిర్ణయించటానికి పూనుకోరాదు. ప్రయాణాలు చేసే ప్రజల అభిప్రాయాలే సరియైన అభిప్రాయాలు. ఒక చిన్న వింత ఏమిటంటే— రైల్వేమంత్రి ఈ విమర్శలను ఖండించనూ లేదు. వాటిని పరిశీలిస్తానని మాట ఇవ్వనూ లేదు. 'ఏనుగు పోతుంటే అవేవో మొరుగుతూ ఉంటా'యని అనుకుని ఊరుకున్నారాయన.



# విలంబ సంవత్సర  గోచార ఫలితాలు

బి. ఎన్. ఆర్.

## [21-3-1958 నుండి 8-4-1959 వరకు]

ఈ సంవత్సరమునకు రాజు శుక్రుడు, మంత్రి సూర్యుడు, సేనాధిపతి శని, సస్యాధిపతి బుధుడు, ధాన్యాధిపతి చంద్రుడు, అర్ఘాధిపతి రవి, మేఘాధిపతి రవి, రసాధిపతి శుక్రుడు, నీరసాధిపతి బుధుడు, పురోహితుడు బుధుడు, పరీక్షకుడు కుజుడు, గణకుడు గురుడు, గ్రామపాలకుడు రవి, దైవజ్ఞుడు శని. శ్రీకృష్ణుడు పశుపాలకుడు. 4 కుంచముల వర్షము. సర్వసస్య సముదాయము 16 విసములలో 9 విసములు పంట ఫలించును.

ఈ సంవత్సరం చైత్ర బ॥ అమావాస్యా శనివారము అరాధిక్యగ్రాస సూర్యగ్రహణమున్నూ, ఫాల్గుణ శు॥ పూర్ణిమా, మంగళవారము పాదగ్రాస చంద్రగ్రహణమున్నూ సంభవించును.

అధిక శ్రావణ శుక్ల పంచమీ సోమవారమున కావేరీనదియందు పార్థ్రతికోటితీర్థ సహిత పుష్కరప్రవేశము.

### రాజు శుక్రుడు

సస్యసమృద్ధియు, అతివృష్టి కలిగివుండును. గోవులు పుష్కలముగ పాల నొసగును. దంపతులు అన్యోన్యముగ సంతోషచిత్తులై వుండును.

### మంత్రి రవి

ప్రభులకు పరస్పర విరోధము, అనావృష్టి, యుద్ధభయము, జనులకు అధర్మమందు ఆసక్తి కలుగును.

### సేనాధిపతి శని

ప్రభుత్వమునకు సేవలకు అంతఃకలహములు. ప్రజలు అధర్మనిరతులగుదురు. నువ్వులు, మినుములు మొదలగు నల్లధాన్యములు ఫలించును.

### సస్యాధిపతి బుధుడు

సాధారణ వృష్టి, సాధారణ సస్యవృద్ధి కలుగును. మేఘములు వాయుపీడితములు అగును. ప్రజలు నిత్యము భయపడుచుందురు.

### ధాన్యాధిపతి చంద్రుడు

గోవులు క్షీరసమృద్ధిగలవి అగును. అందరునూ వ్యాధివిముక్తులగుదురు. సుభిక్షము. మంచివర్షములు కలుగును.

### అర్ఘాధిపతి రవి

అధికముగు ధరలు, అల్పవృష్టి, దుర్భిక్షము, ప్రభువులకు పరస్పర విరోధము కలుగును.

### మేఘాధిపతి రవి

అధికమైన భయము, స్వల్పముగు పంట, ఖండవృష్టి కలుగును. కందులు మొదలగు ఎర్రధాన్యములు బాగుగా ఫలించును.

### రసాధిపతి శుక్రుడు

నువ్వులు, నూనె, బెల్లము, తేనె, పాలు, పెరుగు, పంచదార మొదలగు రసవస్తువులు సమృద్ధిగా కలుగును.

### నీరసాధిపతి బుధుడు

ఇంద్రనీలము మొదలగు రత్నములు, వివిధములైన ధాన్యములు అధికముగా ఫలించును.

### పురోహితుడు బుధుడు

ప్రజలకు మేలు కలుగును.

ఈ సంవత్సరము ఆశ్వయుజ శు. తృతీయా బుధవారము (15-10-1958) మొదలు మార్గశిర శు॥ ద్వితీయా శుక్రవారం (12-12 58) వరకూ శుక్రమౌఢ్యమి. ఆశ్వయుజ శు అష్టమీ సోమవారము (20-10-58) మొదలు కార్తీక శు. సప్తమీ సోమవారం (17-11-58) వరకూ గురుమౌఢ్యమి. మిగిన నెలలు శుద్ధములు.

### సంక్రాంతి పురుషుడు

ఈ సంక్రాంతి పురుషునకు మందుడని పేరు—ప్రభువుల కరిష్టము. కుంకుమోదకముచే స్నానము—స్త్రీల కరిష్టము. నగల నక్షతలుగా ధరించును—నగల నాశనము. చిత్రవర్ణముగల వస్త్రమును ధరించును—శుభము కలుగును. కుంకుమ గంధము—యుద్ధభయము. వకుళపుష్పము—కీర్తివృద్ధి. రజతాభరణం—రజత నాశనం. రాగిపాత్రలో పాలుత్రాగును-లోహములు మొదలగువానికి నష్టదాయకము; స్ఫోటకభయం. మామిడి పండు—ప్రజలకు సుఖము.

వరాహవాహనము-వాటి నాశనం. పసుపుపచ్చని గొడుగు—పసుపు వస్తువుల నాశనం. కత్తి ఆయుధము—స్వల్పయుద్ధము. తెల్లని పద్మమును ధరించును—శుభము కలుగును. ఉత్తర దిక్కునకు ప్రయాణం—ఉత్తరదేశ రీతము. సిగ్గుచేష—ప్రజలకు శుభము. నిలబడియుండును—ప్రభువులకు శుభము.

మకరసంక్రాంతి శుక్లపక్షమున నగుట చేతను ప్రజలకు వ్యాధి పీడ, ప్రభువులకు యుద్ధములు కలుగును.

[ఈసంవత్సర గోచారఫలములు కుజ, గురు, శని, రాహు, కేతువుల స్థితిని బట్టి వ్రాయడమైనది. ప్రతి నక్షత్రమునకు జనన కాల చంద్రలగ్నమును బట్టిగాని, నామ నక్షత్రమునకైన రాశినిబట్టిగాని ఫలితాలు చూచుకొననగును. కాని జన్మపత్రిక (జాతకము)నుబట్టికూడా చూచి రెండింటికీ అగు ఫలములను కలిపి గ్రహించుట యుక్తము.]

### మేషం

[అశ్విని 1-2-3-4 పా॥ చూ చే చో లా
భరణి 1-2-3-4 పా॥ కృత్తిక-1పా]
లీ లూ లే లో అ

ఈ రాశివారికి 23-9-58 వరకు సప్తమమందు రాహువు, జన్మమందు కేతువున్నూ, కుజుడు 16-4-58 వరకు దశమమందు, 28-5-58 నుండి 9-7-58 వరకు మీనమందు,

## పాఠకులకు, రచయితలకు
## రచయిత్రులకు, అభిమానులకు,
## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## ఉగాది అభినందనలు

28-3-59 వరకూ, మేష వృషభములలోనూ, 28-12-58 మొదలు గురుడు వృశ్చికములోనూ దోషప్రదులగుటచేత ఆయా కాలములలో యత్నకార్యవిఘ్నము, మనోభీతి, కలహము, ద్రవ్యనష్టము, ధనాభావము, అనారోగ్యమువంటి అవయోగములు కలుగును. సప్తమంలో గురుడున్న కాలములో 16-5-58 వరకున్నూ తిరిగీ 21-7-58 మొదలు 28-12-58 వరకున్నూ ధనలాభం, యత్నకార్యసిద్ధి మొదలగు శుభయోగములు కలవు. షష్టమంలో రాహువు, సప్తమంలో గురుడు వున్న కాలములో విద్యార్థులకు మేలు కలుగును. వర్తకులకు, వ్యవసాయదారులకు, శ్రమాధిక్యమున్ననూ ఫలితముకూడా కలుగుతుంది. మొత్తముమీద ఈ రాశివారికి ఈ సంవత్సరము యోగావయోగములు సమానము.

### వృషభం

[కృత్తిక 2, 3, 4 రోహిణి-1-2-3-4 పా॥
ఈ, ఊ, ఏ ఓ, వా, వి, వు
మృగశిర 1-2 పా]
వే, వో

ఈ రాశివారికి 17-5-58 మొదలు 21-7-58 వరకూ పంచమమున గురుడు, సంవత్సరాది నుండి 24-9-58 వరకూ షష్ఠరాహువు, 28-5-58 మొదలు 9-7-58 వరకు లాభములో కుజుడూ శుభులు. ఈ కాలములలో శని అష్టమశని అగుటచేతను, యత్నకార్యసిద్ధి, మానసికోత్సాహము, శుభవార్తాశ్రవణము కలిగిననూ మనోవ్యాకులత, వృథా కలహములు, శరీర అనారోగ్యమువంటి అవయోగములు కలుగును. 28-12-58 మొదలు సంవత్సరాంతమువరకూ సప్తమమున గురుడు శుభుడగుటచేతను విశ్రాంతి, ధనలాభము, కార్యసిద్ధివంటి శుభయోగములు, మధ్యమధ్య అనారోగ్యము, తిరుచు ప్రయాణములు చేయవలసివచ్చుట, శ్రమ వంటి అవయోగములుకూడా వుంటవి. వర్తకులకు వ్యాపారంలోనూ, కర్షకులకు వ్యవసాయములోనూ మొదట్లో విశేషలాభ ముండకపోయిననూ ఉత్తరార్థమందు కొంత మేలుగా వుంటుంది. ఈ రాశి ఉద్యోగులకుకూడా జనవరి మొదలు కొంత మెరుగుగా వుంటుంది. విద్యార్థులకు వ్యాకులతవల్ల చదువు సరిగా జరగదు.

### మిధునం

[మృగశిర-3, 4 కా, కి ఆరుద్ర-1, 2, 3, 4
కూ, ఖం, జ, ఛ
పునర్వసు- 1, 2, 3, కే, కో, హా,]

ఈ రాశివారికి సంవత్సరాదినుండి సప్తములో శని, 10-7-58 వరకూ అష్టమ, నవమ, దశమములోనూ 1-9-58 మొదలు 16-11-58వరకు 24-1-59 మొదలు 29-3-59 వరకు వ్యయమందున్నూ కుజుడు సంచారం, రాహువు తులాకన్యలలో వుండుటయున్నూ దోషము. 17-5-58 మొదలు 20-7-58 వరకు కన్యలోనూ 28-12-58 లగాయతు సంవత్సరాంతమువరకూ వృశ్చికములోనూ గురుడు వుండుటకూడా దోషము. ఈ కారణములచే ప్రయాణములవల్ల శ్రమ, ధనవ్యయము, ధనాభావము, అనారోగ్యమువంటి అవయోగము లున్ననూ మిగిలిన కాలములో శుభుడగుటచేతను యత్నకార్యసిద్ధి, ధనలాభము కలుగును. ఉద్యోగస్థులకు హోదా ఆదాయము పెరుగుతవి. వర్తకులకు లాభము. వ్యవసాయదారులకు పంట బాగుంటుంది. విద్యార్థులకు సెప్టెంబర్ నుండి డిసెంబర్ ఆఖరువరకూ మంచికాలము. మొత్తముమీద ఈ రాశివారికి ఆదాయముకన్న వ్యయమున్నూ, సుఖముకన్న కష్టమున్నూ, రాజపూజ్యముకన్న అవమానమున్నూ కొంచెము తక్కువగుటచేత లాభము ఎక్కువ అని ఊహించవలెను.

### కర్కాటకం

[పునర్వసు - 4-పా॥
హి
[పుష్యమి - 1, 2, 3, 4
హు, హే, హో, డా]
[ఆశ్లేష - 1, 2, 3, 4 డీ, డూ, డే, డో]

ఈ రాశివారికి షష్ఠమందు శని 28-12-58 మొదలు సంవత్సరాంతమువరకూ పంచమమునను, గురుడు 29-9-58 తృతీయమున రాహువున్నూ శుభప్రదులగుటచేత మొదటిభాగములో సామాన్యముగావున్ననూ రెండవభాగములో కార్యసిద్ధి, కళత్రసౌఖ్యము, ధనలాభము, శత్రుజయము, సంతానమునకు సుఖమువంటి శుభయోగములు కలుగుతవి. నూతన గృహనిర్మాణప్రయత్నం జరుగుతుంది. ఉద్యోగస్థులకు చాలా యోగకాలము, వర్తకులకు లాభము, వ్యవసాయదారులకు పంట బాగుంటుంది. డిసెంబరు తరువాత నుండి విద్యార్థులకు మేలుకాలము

### సింహం

(మఖ - 1, 2, 3, 4 మా, మి, మూ మే)
(పుబ్బ - 1, 2, 3, 4 మో, టా, టి, టో)
(ఉత్తర - 1 టే)

ఈ రాశివారికి సంవత్సరాదినుండి 24-9-58 వరకు తృతీయమున రాహువు, 17-5-58 నుండి 20-7-58 వరకూ ద్వితీయమున గురుడు, 17-4-58 వరకూ షష్ఠమున 29-3-59 నుండి సంవత్సరాంతము వరకు లాభమందున కుజుడు 24-9-58 నుండి ద్వితీయరాహు, కుంభ, మీన, మేష, వృషభములలో కుజుడు, పంచమమున శని అశుభులు అగుటచేత పూర్వార్ధములో యత్నకార్యసిద్ధి, ధనలాభము, గౌరవము, కీర్తివంటి శుభయోగములు కలుగును. రెండవభాగమందు అధిక ధనవ్యయము మనఃక్లేశము, స్వల్ప సుఖము కలుగును వర్తకులకు వ్యాపార లాభము. వ్యవసాయదారులకు పంటలు బాగుండును. ఉద్యోగస్తులకు సామాన్యముగా వుండును. విద్యార్థులకు కష్టపడితేగాని లాభముండదు.

### కన్య

[ఉత్తర 2, 3, 4 టో, పా, పి
హస్త 1-2-3-4 పూ, ష, ణ, ఠ
చిత్త 1-2 పే, పో 3]

ఈ రాశివారికి సంవత్సరాదినుండి 16-5-58 వరకున్నూ తిరిగి 21-7-58 నుండి 27-12-58 వరకూ ద్వితీయము గురుడును, 17-4-58 నుండి 28-5-58 వరకూ షష్ఠమములో కుజుడును శుభులు. ద్వితీయ జన్మలలో రాహువున్నూ, అర్ధాష్టమ శని అశుభులు ఈ కారణములచేతను మనస్సు చంచలముగావుండుట, కళత్ర

మునకు గాని తదితరులకు గాని అనారోగ్యము కలుగుట, కళత్రసుఖము తగ్గుట, అప్పుడప్పుడు ధనాభావము కలుగుటవంటి అవయోగములున్ననూ మనోధైర్యము కలుగుట, ధనలాభము, అయాచితముగా మిత్ర సహాయము, అప్రయత్నముగా కార్యసిద్ధి, శుభ పుణ్యకార్యములచే ఆనందము, తీర్థయాత్రలవల్ల ధనవ్యయము, శరీరమునకు శ్రమ మొదలగు ఫలములు కలుగును. మొత్తం మీద ఈ సంవత్సరము మిశ్రమంగావుండును. ఉద్యోగస్తులకు అధికారము వృద్ధి అయే సూచనలున్నవి వర్తకులకు మొదట్లో లాభము ఎక్కువగావుండి రాను రాను తగ్గుతుంది. భూస్వాములకు, వ్యవసాయదారులకు ఎంత కష్టపడిన అంతలాభము కలుగుతుంది. విద్యార్థులు శ్రద్ధ చూపినయెడల ఫలము వుంటుంది.

## తుల

[ చిత్త 3-4 రా, రీ
స్వాతి 1-2-3-4 రూ, రే, రో, తా
విశాఖ 1-2 3 ] తి, తూ, తే.

ఈ రాశివారికి 27-12-58 వరకూ జన్మలో వ్యయమందున గురుడునూ, రాహువు సంవత్సర మంతయును వుండుటచేత అశుభులు. 28-5-58 నుండి 29-7-58 వరకూ మీనములో కుజుడున్నూ సంవత్సరమంతా తృతీయమున శని శుభులు. 28-12 58 నుండి వత్సరాంతమువరకూ ద్వితీయమున గురుడు శుభుడు. మొదటి సగముకన్న రెండవ సగములో శుభయోగములు ఎక్కువ. మొదట్లో కార్యాటంకములు, శ్రమ, ధనవ్యయము అనారోగ్యమువంటి అవయోగములు కలిగిననూ, రెండవభాగములో, విద్యార్థులకు విద్యాభివృద్ధి, ఉద్యోగస్తులకు అధికారము, ఆదాయము పెరుగుట, గౌరవము కలుగుట, శుభకార్యములు చేయుట, యత్నకార్య సిద్ధి, నూతన గృహారంభము, కళత్రసౌఖ్యము, సంతాన ప్రాప్తి వంటి శుభయోగములు కలుగును. వర్తకులకు పూర్వార్థములోకంటే ఉత్తరార్థములో లాభము విశేషముగా వుండును. భూస్వాములకు, వ్యవసాయదాయలకు పంటలు బాగుండును.

## వృశ్చికం

[విశాఖ 4 వ తో
అనూరాధ 1-2-3-4 నా, నీ, నూ, నే
జేష్ఠ 1-2-3-4 నో, యా, యి, యూ

ఈ రాశివారికి ద్వితీయమున శనివుండుట దోషము, సంవత్సరాదినుండి 16-5-58 వరకు, తిరిగి 21-7-58 నుండి 27-12-58 వరకూ వ్యయంలోను పైనిజన్మలోనుగురుడు పాపుడు. 17-5-58నుండి20-7-58వరకు ఏకాదశమందు గురుడున్నూ 24-9-58నుండి వత్సరాంతమువరకూ ఏకాదశమందు రాహువు శుభుడు. మేషములో సంచరించుకాలమందు కుజుడు శుభుడు. ఈ కారణముచేతను ఫలితాలు శుభాశుభ మిశ్రమముగా వుండును. యత్నకార్యములకు విఘ్నములు, శరీరశ్రమ, మనోవ్యసన, ధనవ్యయము, అనారోగ్యము మొదలగు అవయోగములున్ననూ. 24 9-58 నుండి కార్యసిద్ధి ధనలాభము, మిత్రదర్శనము, విదేశీయులతో పరిచయము, విచిత్ర వస్తు సంపాదన కలుగును. విద్యార్థులు బాగా కష్టపడి చదివినమీదట ఫలప్రాప్తి కలుగును. ఉద్యోగస్తులకు అంత ప్రోత్సాహకరముగా వుండకపోయిననూ, అప్పుడప్పుడు మేలు కలుగుచుండును. వర్తకులకులాభముతక్కువ. వ్యవసాయదారులకు అధికకష్టముపైని అర్థ పంట కలుగును. శరీరశ్రమ ఎక్కువ.

## ధనుస్సు

మూల 1-2-3-4 యే, యో, బా, బి
పూర్వాషాఢ 1-2-3 4 బూ, ధ, ఫ, ఢ
ఉత్తరాషాఢ 1 బే

ఈ రాశివారికి జన్మలో శని పాపుడు. సంవత్సరాదినుండి 23-9-58 వరకు ఏకాదశ మందున్నూ రాహువు 16-5-58 వరకున్నూ తిరిగి 21-7-58 నుండి 27-12-58 వరకు లాభమందున గురుడున్నూ శుభులు, వృషభములో కుజుడు సంచారముచేసిన కాలము 1-9 58 నుండి 17-17-58 వరకున్నూ తిరిగి 24-1-59 నుండి 29-3-59 వరకున్నూ శుభప్రదుడు. 28 21-58 నుండి వత్సరాంతము వరకు వ్యయమందు గురుడు పాపుడు. ఈ కారణములచేత దూరదేశప్రయాణము వల్ల గాని, తీర్థయాత్రలు చేయుటవల్లగాని శ్రమ అధికమగుట, ఎక్కువ ధనవ్యయము కలుగును. మనోవ్యసన కలుగును. నిలకడలేనిస్థితి ఏర్పడును. ఉత్తరార్థముకన్నా పూర్వార్థము మెరుగుగావుండును. ఈ కాలములో కార్యసిద్ధి, శత్రుజయము, ధనలాభము, కళత్రసౌఖ్యము కలుగును. విద్యార్థులకు మంచికాలము. రెండవభాగమునకూడా బాగా కష్టపడి చదివినమీదట ఫలప్రాప్తి పొందవచ్చును. ఉద్యోగస్తులకు అంత మంచి కాలముగాదు. అనవసరకలహములుబసాయి. క్రమేణా మేలుపొందుతారు. వర్తకులకు మొదట్లో నిరుత్సాహముగా వున్ననూ క్రమేణా ధనదాయము బాగుంటుంది. వ్యవసాయదారులకు ఎక్కువకష్టముపైని మూడు వంతులు పంట కలుగుతుంది.

## మకరం

ఉ॥ షా 2-3-4 బో, జా, జి
శ్రవణం 1-2-3-4 జూ, జే, జో, ఘా
ధనిష్ఠ 1-2 గా, గి

ఈ రాశివారికి వ్యయమందు శని పాపుడు. 17-5-58 నుండి 30-7-58 వరకూ భాగ్యమందున్నూ 28-12-58 నుండి వత్సరాంతము వరకూ లాభమందున్నూ గురు డుండుటచేతను ఈ క్రిందిఫలములు కలుగును. పండిత గోష్టి వల్లను, ఉత్తమ గ్రంథపఠనవల్ల విజ్ఞానాభివృద్ధియగును. శ్రమ యెక్కువగా వున్ననూ ధనలాభము, సంతానమునకు శుభయోగములు కలుగును. సత్కార్యాచరణ యెక్కువగా వుండును. విద్యార్థులకు పూర్వార్థముకన్నా ఉత్తరార్థము మేలు. వ్యవసాయదార్లు ఎక్కువకష్టపడిననూ ఫలము బాగా వుంటుంది. వర్తకులకు అనవసరముగా లావాదేవీ లున్నను మొత్తముమీద లాభము కలుగుతుంది. ఉద్యోగస్తులకు మేలుగా వున్నను అధికశ్రమ. బాధ్యత ఎక్కువవుతుంది. మొత్తముమీద ఈ సంవత్సరము లాభము అధికముగా వుంటుంది.

## కుంభం

ధనిష్ఠ 3-4 పా॥ గూ, గే,
శతభిషం 1-2-3-4 పా॥ గో, సా, సీ, సూ.
పూ॥ భా॥ 1-2-3 పా॥ సే, సో, దా.

ఈ రాశివారికి లాభమందు శని శుభుడు. సంవత్సరాదినుండి 16-5-58 వరకు తిరిగీ 21-7-58 నుండి 28-12-58 వరకూ భాగ్యమందు గురుడుయోగప్రదుడు. అప్పుడప్పుడు అనారోగ్యము, ప్రయాణమువల్లశ్రమ, మనోవ్యసన, ధనవ్యయము కలిగినా, యత్న కార్యసిద్ధి, ధర్మకార్యాచరణ, తీర్థయాత్రలు సేవించుట, భాగ్యవృద్ధి మొదలగు మంచిఫలములు కలుగును. విద్యార్థులకు పూర్వార్థము మేలుగా వుండును. ఉత్తరార్థములో కష్టపడి చదివిన ఎడల ఫలితముండును. వర్తకులకు లాభయోగము. వ్యవసాయదారులకు కష్టము ఎక్కువైననూ పంట అధికముగా వుండును. ఉద్యోగస్తులకు అధికారము,హోదా ఎక్కువవుతాయి; కీర్తి ప్రతిష్టలు సంపాదించుతారు.

## మీనం

పూ॥ భా॥ 4 వ పా॥ దీ
ఉ॥ భా॥ 1-2-3-4 దూ, శం, , ఝా, దా.
రేవతి 1-2-3-4 పా॥ దే, దో, చా, చీ

ఈ రాశివారికి 17-5-58 నుండి 20-7-58 వరకు సప్తమమున, 28-12 58 నుండి వత్సరాంతము వరకూ భాగ్యమందున గురుని సంచారము శుభప్రదము. మిగిలినగ్రహములు అనుకూలురు కారు. అందుచేత మొదట్లో అపవాదము, మనోవ్యసన, కార్యభంగము, ధనవ్యయము, అనారోగ్యమువంటి అవయోగములు కలిగిననూ 1959 జనవరి నుండి మంచి యోగ ముండుటచే అప్పటినుండి వత్సరాంతమువరకూ ధర్మకార్యాసక్తి, భాగ్యాభివృద్ధి సంతానమునకు శుభయోగములు కలుగును. ఉద్యోగస్తులకు మొదట్లో ఒత్తిడి కలిగిననూ ఉత్తరార్థమందు కుదుటబడతారు. వర్తకులకు 1959 జనవరినుండి లాభము ఎక్కువ. వ్యవసాయదారులకు యెక్కువకష్టము పైని అర్థపంటకు ఎక్కువగా లాభము కలుగును. విద్యార్థులకు కష్టపడి చదివినగాని ఫలము కలగదు. పరీక్షలకాలము యోగప్రద మగుట చేత అనుకూలముగా వుంటుంది. ★

# 'కోప్-ఫాబ్రిక్స్'

★ అందమునకు

★ తక్కువ ధరలకు

★ ఎక్కువ మన్నికకు

★ ప్రసిద్ధిగాంచినవి



అందాలు చిందే పుల్లంపేట, వెంకటగిరి, గుంటూరు జరీ చీరెలు.
అందమైన పెడన, పొందూరు, మంగళగిరి, చీరాల రంగు చీరెలు.
కన్నుల పండుగచేయు ఉప్పాడ బుటా చీరెలు.
నాణ్యమైన నారాయణవనం మోరీ ధోవతులు.
మన్నికయిన ఎమ్మిగనూరు, ఏలూరు దుప్పట్లు, కోరాతాన్లు.
కీర్తి గాంచిన ధర్మవరం, పెద్దాపురం పట్టు చీరెలు.



ఆంధ్ర ప్రదేశమంతటాయున్న మా విక్రయశాలల అన్నింటిలోను
మరియు మద్రాసు, బెంగుళూరు, కటక్ నగరములలోను అమ్మబడును.

## ఆంధ్రదేశ చేనేత సహకార సంఘము, లిమిటెడ్,
## గవర్నరుపేట, విజయవాడ-2.






కొలంబసూ, రాజా హోటల్లోంచి ఇవతలకు వచ్చి నాలుగుఅడుగులు వేసేవరకు, వారిని తరుముకుంటూ వచ్చి ఓ పెద్ద పాత కారు ఆగింది.

'బ్బబబ...బ్బాబ' అన్నాడు కొకొక్కొలంబస్.

'య్యొయ్యొ య్యొక్క' అన్నాడు కక క్కారులోని బబబబ్బాబ,

కొలంబస్ మారుమాట లేకుండా కారులోకి భయపడ్డాడు. కారుదారిమీద కారు జారిపోయింది.

రాజుకి ఒక నిముషందాకా ఏమీ తెలియలేదు. ఒక ఫిలిములో కారెక్టరు ఇంకో ఫిలిం సెట్లోకి వస్తే, దానితాలూకు డైరెక్టరు చివాట్లేసి మళ్లీ అసలు కథలోకి లాక్కుపోయినంత మామూలుగా, కొలంబస్ వెళిపోయాడు. ఇలాటి ప్రమాదాలు మామూలే ననడానికి ఏ సినిమాచూసినా నిదర్శనం కనిపిస్తుందిగదా.

* * *

హారైజన్లోకి వెళిపోతున్న హీరోకి మల్లె, భారంగా అడుగులు వేసుకుంటూ, తలవంచుకు వెళిపోసాగాడు రాజు; నేపథ్య గీతం పాడుకుంటూ. అలా పోగా పోగా మెడనొప్పెట్టి తలఎత్తాడు. ఎదురుగా ఓ పెదగేటు కనబడింది. ఆ గేటు బార్లా తీసి ఉంది. దగ్గరకు వెళ్ళేసరికి దానిమీద ఓ చిన్న బోర్డొకటి ఉంది. అందు మీద 'Please keep the gate closed' అని రాసిఉంది.

(గేటు మూసి మరీ వెళ్ళండి అని తాత్పర్యం)

రాజా అది చదివేశాడు, తక్షణం ఆపని చేయబోయాడు.

'స్వాతంత్ర్యము నా జన్మహక్కు' అనేపాట గుర్తుకువచ్చింది.

ఎంత డబ్బుంటే మాత్రం, వీడెవడో చెబితే నేను చెయ్యడంఏమిటి అనుకున్నాడు ఆగిపోయి. దారంట పోయేవాళ్ళకి ఇలా పనులు చెప్పడం తప్పుకాదూ?

ఇంకో క్షణం తరవాత బయల్దేరబోయి మళ్ళీ ఆగిపోయాడు. వెయ్యకపోతే అదేం ముప్పు!...అసలు బాగుండదేమో...మానర్స్ లేవు అంటారు. కల్చర్ సున్న అనుకుంటారు. మెడ్రాసు వచ్చినపుడు మొవ్వారం వాడిలా ఉండడం బాగుండదు.

వేసేద్దాం అనుకున్నాడు గేటు తలుపు మీద చెయ్యి వేసి.

వద్దుస్మీ అంది మనసు.

ఫరవాలేదులే అన్నాడు రాజు.

* * *

“వాడెవడో ఇడియట్లా వున్నాడే... కాని వాట్ గ్రేట్ యాక్టర్! సందిగ్ధావస్థని గ్రాండ్‌గా పోర్ట్రె చేస్తున్నాడు” అన్నాడు ఆ యింటి పోర్టికోలో నిల్చున్న ప్రొడ్యూసరు.

ఆయనకి ఎడాపెడా నిల్చున్న సినీవందిమాగధులు నవ్వారు.

“హామ్లెట్ వేసిన లారెన్స్ ఒలీవియర్ 'టుబి ఆర్ నాటుబీ' సీనులో వీడికన్న ఏం పొడిచేశాడు ... ఈ మహానటుణ్ణి 'ది ఒలీవియర్ ఆఫ్ ఇండియా' అంటే తప్పేముంది. ఆహా...ఆ నటన ఎంత కొత్తగా ఉంది. నాకు బాగా నచ్చింది సార్ ... నేను మీకు ఎపుడూ చెపుతూ ఉంటాను. కొత్త నటులలో ట్యాలెంట్లుంటాయని. నా మాటే రైటైంది. నేనే నెగ్గాను” అన్నాడు వందిమాగధులు.

“యాటదీ? ... యవుడనుకున్నారు ఆ యబ్బాయి. మీయిట్టం వచ్చినట్టు కూత్తన్నారు పాస్ కోసంతో” అంది ఆ వెనకనే నిల్చున్న లక్ష్మి వరసు కోపంగా.

“నో నో. మిస్ వరసూ. అతను మంచి యాక్టరని చెబుతున్నాను వారికి. అంతే” అన్నాడు వందిమాగధులు.

'నివ్వేం సెప్పనక్కర్లే...అదంతా నా యవ్వారం.' అంది వరసు.

'అతన్నిట్టా పిలవ్వయ్యా' అన్నాడు—ప్రొడ్యూసరు.

వందిమాగధులు పిలిచాడు.

రాజు కొంచెం కంగారుపడ్డాడు. జంకుతూనే దగరికి వచ్చాడు.

“అబ్బే... నే నేం చెయ్యలేదండి అయామ్ గేట్ ఈజే బోర్డు...ఊరికే నే బోర్డుని గేటేస్తున్నా” అన్నాడు.

'ఏమిటీ?' అన్నాడు ప్రొడ్యూసరు.

“గార్డుని బేటేస్తున్నానండి...అదికాదు మాటిన గేసేస్తున్నా” అన్నాడు రాజా తన అభిప్రాయాన్ని సాధ్యమైనంత స్పష్టంగా వివరిస్తూ.

'కంగారు గొద్దు' అన్నాడు ప్రొడ్యూసరు జాలిగానవ్వుతూ.

'యస్సార్. హేస్టీయానిమల్' అన్నాయి వందిమాగధులు.

ఈలోగా రాజా స్థిమితపడ్డాడు. ఇందాకటికన్న మంచివాక్యాలు ఆలోచించాడు.

“సారీ సార్!...అయామ్ గేసింగ్ ది గ్లోట్” అనేశాడు ధైర్యంగా నవ్వి.

ప్రొడ్యూసరుకి అభిమానం పెల్లుబికింది. 'వెరీ గుడ్. వండ్రఫుల్ ఎక్స్‌ప్రెషన్... నువ్వు డైలాగులు రాయొచ్చు. నీఅయిడియా నేను పసిగట్టేశాననుకో. గేటుమూసేస్తున్నానూ అంటావు. అంతేగా?'

రాజా హృదయంలో కృతజ్ఞత పరవళ్లు తొక్కింది.

“యస్సార్. మరేండి - అదేండి. మూసు గేటే—అవూ, గేసు మూసేటుతున్నాను..”

హఠాత్తుగా ఆగిపోయాడు రాజా - అంద

# ★ విక్రమార్కుడి మార్కు సింహాసనం ★

రూ తనవంకే చిత్రంగా చూస్తున్నారని గమనించి.

అంతవరకు అతనికి కనబడకుండా ఆలావు పాటి ప్రొడ్యూసరు చాటున ఉండి, నవ్వాపుకుంటున్న లక్ష్మీనరసుకి జాలేసింది.

"రాజా నువ్వింక మాటాడకు. నూచో చెప్తా..." అని, "బాబాయ్, ఈతే నా మొగోడు. నేను చెప్పినోడు" అంటూ ప్రొడ్యూసరుకి రహస్యం చెప్పింది.

నాగేశ్వరరావుని పిక్చరుకి బుక్ చేయగలిగినంత సంతోషం వేసింది ఆయనకి.

'నువ్వేమిటి నేను చెప్పినవాడు ఫేమ్' అన్నాడు ఎంతో సంతోషంతో. రాజా, నరసుని చూడగానే, సిగ్గుపడిపోయాడు.

'నువ్విక్కడికెలా వచ్చావు' అన్నాడు, సిసేరియో జీర్ణంకాక. డైరెక్టరు పప్పులో కాలేశాడు అని పాఠకులు చివాట్లేసే ఘట్టాలు ఇలాటివే.

అయినా, లక్ష్మీనరసు తను అక్కడికెందుకు వచ్చిందో, తనకి డబ్బుగల బాబాయి ఎలా దొరికాడో చెప్పదలచుకోలేదు. చెప్పేందుకు ఏమీ లేదు. అందుకని నవ్వేసింది.

బాబాయి ఉరఫ్ ప్రొడ్యూసరుగారు ఓహోహో అన్నారు హుషారుగా. 'పరవా లేదు గట్టివాడే...అమ్మాయి! నామాట విని రాత్రికి బొంబాయి మెయిలు ఎక్కెయ్యండి తెల్లారేసరికి కొండెక్కి పెళ్లాడేసి, రేపుసాయంత్రానికి దక్కారావచ్చు' ఓరెండొందలకి చెక్కు రాసిస్తానుండు' అంటూ లోపలికెళ్లాడు.

'అక్కర్లేదయ్యా. నా కాడ కావా డబ్బుందాదిలే' అంది నరసు.

* * *

'వాట్! వాటీస్ దిస్' అన్నాడు రాజు; గదిలోంచి మిగతా పాత్రలు ఫేడౌట్ అయిపోయి, తనూ నరసూ మిగలగానే.

'వాటూ లేదు వీటూ లేదు బాబాయి సెప్పింది ఇనుకోనేదేటి. మనిద్దరం పెళ్ళి చేసుకుందారి. ఆనక సినిమాలో ఈకో యీరోయిను ఏసాలేద్దారిలే. మీ బామ్మకి ఉత్తరం ఆనకరాద్దారిలే" అంది నరసు.

"నోనో నరసూ నోనో. త్రీటైమ్స్‌నోనో. నేను ఈవూరుకొచ్చి రెండ్రోజులైంది. రెండ్రోజుల్లోనూ బోల్డుమంది బోల్డు కథలు చెప్పారు. నేను యూస్‌లెస్ పనికి రావని కూడా చెప్పారు. ఇక్కడన్నీ టోకరాలు. నేను మావూరు వెళ్ళిపోతా. మాబామ్మకోసం బెంగెట్టుకున్నా. మాకు నాన్నావాళ్లు లేరుగదా. ఒక తైఉంటుందిపాపం. అందుకని వెళ్ళిపోతాను" అన్నాడు సోఫాలోంచి లేవబోయి.

నరసు విరగబడి నవ్వి అతన్ని మళ్ళీ కూలేసింది.

"చూడు రాజా నువ్వు ఏ మూర్తాన నా కంటబడ్డావో, నీమీద నాకు మనసైంది. నా కోసం సావుదెబ్బలుకూడా తిన్నావు. ఇంత మంచోడివి నిన్ను ఒగ్గనే ఒగ్గను. ఒకటే మాట." అంది.

"బట్. అయామ్ యూస్‌లెస్—"

"అయ్యో సిన్నా నాకాడ సదవమాక. ఊళ్లోకొచ్చినకాణ్ణించి నివ్వు దగుల్బాజీల ఎంట తిరిగి, అంతా అంతేననుకుంటున్నావు కాని, ఈడ ఎంతెంత కథలున్నాయో నీకు తెల్దు. ఇప్పుడే వత్తానుండు" అంటూ నరసు లేచి, అవతలగది గుమ్మందగ్గరకెళ్లి 'బాబోయ్! ఈ బుల్లోడు మనువూ గినువూ వొద్దని ఎల్లిపోతన్నాడు నూడు' అంది.

బాబయిగర్జిస్తూ హాల్లోకొచ్చాడు. 'ఏవిటీ వెళ్తావూ. ఎక్కడికిట. అవటూ ఎల్లుండి షూటింగ్ ఉంది. ఎల్లుండి రిహార్సలు. మీ యిద్దరికీ వేసాలున్నాయి. వేళకి రాపోతే ఎలాగ? నువ్వేం హీరోవనుకున్నావా లేటుగా రాడానికి ఎగెయ్యటానికీను, కొత్తవాడివి. టైముకి రాపోతే యావజ్జీవ ఖైదు వేసేస్తారు," అన్నాడు.

రాజు బిక్కచచ్చిపోయి, నోరావలించి గుడ్లప్పగించి చూస్తూ కూర్చుండిపోయాడు.

"తెలిసిందా. ఇంకా వెళ్ళిపోతానంటావా?" అందినరసు.

"వెళ్లిపోతానంటే యావజ్జీవ ఖైదు అయిపోయాక వదిలేస్తారా పోనీ" అన్నాడు రాజు ఆశవదలక.

ప్రొడ్యూసరుగారు హిందీ సినీ విలన్‌లా నవ్వి చుట్టముట్టించాడు.

"ఫూల్! నీకు తెలితేటలున్నాయి గదా. అవి కొంచెం వాడిచూడు. నువ్వుచేసే నేరానికి నిజంగా ఏంచేస్తారో ఆలోచించి నువ్వే చెప్పు. యావజ్జీవ ఖైదు పూర్తి అయ్యాక వదలిపెడతారంటావా?" అన్నాడాయన.

ఇష్టంలేకపోయినా ఆలోచించాడు రాజు.

"వదల్రండి...ఛవుకా ఉరితీసి వేస్తారు. నాకు తెలుసనుకోండి. అఫ్‌కోర్సు నేను ఓ షార్ట్-'ప్రేమపిట్టలు' అనేదాంట్లో ఇల్లాగే ఎండింగు రాశాను" అన్నాడు కొంచెం ధైర్యం తెచ్చుకుని.

ప్రొడ్యూసరుగారు ఆనందంతో ఉప్పొంగిపోయి, చప్పట్లుకొట్టాడు.

"శభాష్ బేటా శెభాస్...నీకు కొంత బుర్ర ఉందనుకున్నాను గాని బొత్తిగా ఇంత బుర్రుందనుకోలేదు. నువ్వసలు డైరెక్టరు కావలసినవాడివి. ఈ ఐడియా ఎవరికీ చెప్పక. నెక్స్టు పిక్చరులో వాడేదాం. ఇంకేం క్వాలిఫికేషను లేకపోయినా ఇదొక్కటే చాలు సినిమాకి. మిగతావి చప్పునే వంటబడతాయిలే. ఈలోగా మా నరసుని పెళ్లాడి చిన్న వేషాలేస్తూ ఉండు. మా పిక్చరులోనే ఉన్నాయి రెండు. ఎల్లుండే స్టుడియోకి రండి. ముందు తిరుపతెళ్ళండి" అంటూ ఆయన గదిలోకి వెళ్లిపోయాడు.

రాజుకి, హఠాత్తుగా ఓకొత్త అయిడియా తట్టింది. తనకి నిజంగానే సినిమాల్లో వేషం దొరుకుతుందన్నమాట. ఎల్లుండే షూటింగుట ఓరి బాబోయ్ వండ్రఫుల్ కోయ్! అనుకున్నాడు.

అనుకుని ఎగరబోయాడు. నరసుదగ్గరగా జరిగి అతని స్థిమితపరచింది.

"నిజమే కదూ?" అన్నాడు నరసు మొహాన్ని క్లోజప్‌లో చూస్తూ.

'కాదూ?' అంది నరసు.

'ఔను' అన్నాడు రాజు.

చెంపమీద చెంప సూపరింపోజు అవుతున్న మత్తులో, 'ఇది కలా ఇలా'అన్నాడు రాజు.

'వల' అంది నరసు అతని మెడచుట్టూ చేతులు వేస్తూ.

---

పి. ఎస్:

ఐదారు పేరాలపైన నరసు, రాజుని సముదాయించే సీనులో 'మన పెళ్లయాక మీ బామ్మకు ఉత్తరం రాదాము' అంది. రాజుకి నాన్న లేడనీ, బామ్మే ఉందనీ నరసుకు ఎలా తెలుసు? రాజుకి ఈ సంగతి తెలిస్తే, పాసార్థిగాడు పప్పులో కాలేశాడు అని సినిమా పేపర్లో ఏకేసేవాడా? కాదు. అయినా రాజు పుటుపూర్వాలూ అతని డబ్బు లక్షున్నరకీ కాపలాగా ఒక్క బామ్మ మటుకే బతికుందన్న కిటుకూ లక్ష్మీనరుసుకి తెలుసని (వాళ్ళ బాబాయి ద్వారా) పాసార్థికి తెలుసు.

(అయిపోలేదు)

# సంక్రాంతి సంకెళ్లు




## వేదుల మీనాక్షీదేవి

"మ. స. అక్కయ్యకు నమోవాకములు.

నీవు వ్రాసిన వుత్తరం అందింది. శ్రీను, రూర్మా నిన్ను తలచుకోని క్షణం లేదు.

నేను ఇన్నాళ్ళూ దూరాన వుండడంచేత ఏ పండుగలకూ మనం అంతా ఒకచోట చేరి ఆనందించటానికి వీలు కలుగ లేదు. ఈ సంక్రాంతి పండుగకు బావగారు, నువ్వు, పిల్లలు ఇక్కడికి రావలసింది. బావగారు ఎప్పుడూ తీరిక లేదంటారు. ఎలాగో తీరిక చేసుకురమ్మని చెప్పవలెను. పండుగనాడు కూడా ఏంపని వుంటుంది బాబూ ఆయనకు! ఒకవేళ ఆయనకు వీలులేకపోతే ఒక్కర్తెవైనా నువ్వూ, పిల్లలూ వచ్చి నాకు విందు చేసి వెళ్ళవలెనని కోరుతున్నాను.

ఢిల్లీనుండి పెద్దన్నయ్య వచ్చాడు. తమ్ముడికి సెలవు దొరకదేమో అని వ్రాశాడు.

సంక్రాంతి పండుగకు సంకెళ్లలోని వాళ్ళూ వస్తారన్నప్పుడు నీకే సంకెళ్లూ లేవు గనుక తప్పక రావలసింది. బావగారితో మరీ మరీ చెప్పవలెను.

......రావు."

మా తమ్ముడు రావు పండగ పిలుపు వుత్తరం వచ్చింది. నా మనస్సు ఆనందంతో నిండిపోయింది. ఎంత పెద్దవాళ్లయినా, ఎంత కుటుంబీకురాలైనా పుట్టింటివారు వచ్చినా, పుట్టింటివారు రమ్మన్నా ఏ స్త్రీ మనసువ్విళ్ళూరకుండా వుంటుంది? ఒక్కచోట పుట్టి జ్ఞానం వచ్చేదాకా ఒక్కచోట పెరిగి ప్రాణానికి ప్రాణంగా వుంటే ఏకోదరులు కొంత కాలానికి చెట్టుకో పిట్ట అన్నట్లు విడిపోతారు. ఆడపిల్లలు పెళ్ళిళ్ళయి అత్తవారిళ్లకు పోతారు. మగపిల్లలు మొదట చదువులకని యింట్లోంచి వెడతారు. తరువాత ఉద్యోగాలకు సరేసరి; ఈ రోజులలో విసిరేసినట్లే వెడుతున్నారు దేశంలో ఏ మూలకో.

మా పెద్ద తమ్ముడు ఢిల్లీలో ఉద్యోగం చేస్తున్నాడు. రెండవ తమ్ముడు రావు దూరపువూళ్ళు తిరిగి తిరిగి చివరకి యీ మధ్యనాలుగైదు మాసాలైంది, యీ ప్రాంతాలకి వచ్చాడు. మూడవతమ్ముడు బొంబాయిలో పనిచేస్తున్నాడు. వాడికి సెలవులేని వుద్యోగం. సంకెళ్ళలోని వాళ్ళకైనా విడుదల వుంటుంది కాని, వాడికి విడుదలలేదు. పండగకు ఒకటి, రెండురోజులు సెలవు వచ్చినా యింటికి వచ్చి వెళ్ళడానికి అధమం వారంరోజులైనా వ్యవధి వుండాలి. ఈ విధంగా అంతా తలోకచోటా విసిరేసినట్లున్నాం. ఒకళ్ళం, యిద్దరం కలుసుకున్నా తృప్తిగా వుండడం లేదు. అంతా ఒక్కమారైనా ఒక్కచోటవుంటే పరిస్థితి తటస్థించటంలేదని బాధగా వుంటోంది మా అందరికీ కూడా. చిన్నప్పటిలాగ అమ్మా, తమ్ముళ్లూ, నేను అంతా కలిసి వుండాలనిపిస్తూంటుంది. కాని ఎలా సాధ్యం అవుతుంది? నా కోరిక

# ★ సంక్రాంతి...సంకెళ్లు ★

కోరికగానే నిలిచిపోయింది.

ఇదే సృష్టి చిత్రం అంటారు పెద్దలు. భగవంతుని కిదంతా ఒక క్రీడ అని కూడా అంటారు.

పండగకు వెళ్ళాలనైతే వుందిగాని, చటుక్కున యింటికి తాళంపెట్టి వెళ్ళే చిన్న సంసారం కాదు నాది. అమ్మాయీ, అల్లుడూ పండగకివచ్చారు. పెద్దబ్బాయిపండగకంటూ ముందేవచ్చాడు. చిన్నవాడు "పెద్ద పండగనాటికి యింట్లో వుంటాను" అని వ్రాశాడు. అందరినీ పండగకి రమ్మని నేను మా పుట్టింటికంటూ యెలా వెళ్ళను? నేను వడితే నా కోసం గానూ? అమ్మాయి వక్కర్తి చెయ్యగలదా? రాక రాక వచ్చిన పిల్లకు పండగపూట నుప్పెడన్నం విస్తట్లో పెట్టకుండా వంటగిన్నె చేతికివ్వనా? అన్నివిధాల ప్రాధేయపడుతూ "ఒక్కరోజైనా పండగకు వచ్చి మాకు నిండు చెయ్య"మని వ్రాసిన రావు మనస్సు క్షోభపడుతుంది నేను వెళ్ళకపోతే. అదీ నాకు బాధే.

"రావు రమ్మని వ్రాశాడు పండగకి" అంటూ మావారికి నా తమ్ముడు వ్రాసిన వుత్తరం యిచ్చాను.

ఉత్తరం చదువుకుని నవ్వుకున్నారు. "మహారాజులాగ నువ్వు వెళ్ళవచ్చు. నిన్ను పంపడానికి యిదివరకు అభ్యంతర పెట లేదు. ఇప్పు డభ్యంతరపెటడంలేదు. ఇక ముందు అభ్యంతర పెట్టబోను," అని నన్ను పంపడానికి తమకుగల నిరభ్యంతరాన్ని భూతభవిష్యద్వర్తమానాలలో సెలవిచ్చారు శ్రీవారు. (ఈ వాక్యాని కీయనకి గుడ్ కాన్డక్ట్ ప్రైజ్ యివ్వవచ్చు.)

"మిమ్మల్ని మరీ మరీ రమ్మని వ్రాశాడు. పిల్లల్ని కూడా తీసుకురమ్మన్నాడు. పండగపూటా యిల్లు తాళంవేసి అంతా వెళ్ళడం యెలాగ? సంవత్సరానికోమారు వచ్చే పెద్ద పండగ యిది. ఎంతమందో యిల్లు కనిపెట్టుకున్నవాళ్ళుంటారు. పండగనాడు వాళ్ళ చేతులలో తలాకాస్తా యేదైనా వేసి పడెయ్యకుండా, దేవుడికి ధూపదీప నైవేద్యాలు లేకుండా చెయ్యడం నామనస్సుకేమీ బాగాలేదు. పోనీ నేను వుండదా మంటే పిల్లల్ని మిమ్మల్ని యిబ్బందిపెట్టాలి. నాకేమీ కర్తవ్యం తోచడంలేదు" అన్నాను.

"అంతా వెళ్ళడం కుదరదు. ఒక్కరోజు నువ్వు వెళ్ళి వచ్చెయ్యి. నేను, అమ్మాయి యెలాగో తంటాలు పడుతాము. మిగిలిన రెండురోజుల పండగకీ నీకు తోచినన్ని పిండివంటలు కూతురికీ, అల్లుడికీ, మాకూ చేసి పెడుదువు గాని. అలాగయినట్లయితే మీ తమ్ముడికీ తృప్తిగా వుంటుంది. మా కూ లోటుండదు. తెల్లవారి మొదటి బస్సులో వెళ్ళి యెల్లుండి మొదటి బస్సులో వచ్చెయి. ఈ సంసార జంజాటన యెప్పుడూ వుండేదేను. హాయిగా వెళ్ళిరా" అంటూ నా ప్రయాణం నిశ్చయించారు. మా పిల్లలుకూడా 'వెళ్ళ'మని వాళ్ళ నాన్నగారి సూచనను సమర్థించారు.

"సరే" అన్నానే కాని నా మనస్సు మనస్సులో లేదు. వెళ్లాలనీ ఉంది; మానాలనీ వుంది.

"నా ప్రయాణం సంగతి ఏం చెయ్యమంటావే" అన్నాను మా పనిమనిషి అచ్చితో.

అది మామూలు పనిమనిషి లాంటిది కాదు. అదీ మా కుటుంబంలో ఒక సభ్యురాలుగానే భావిస్తాం మేము. పదిహేనేళ్ళ నుండి మా యింట్లో పనిచేస్తోంది. మా పిల్లల్నందరినీ యించుమించుగా అదే పెంచింది. వాళ్ళ నేమీ మేము అనడానికి వీలులేదు. ఎప్పుడయినా వాళ్ళ అల్లరి పడలేక కేకలేస్తే "నేను బతికుండగానే వాళ్ళని తిడతావా!" అంటూ ఏడిచేది. నన్నూ, మావారినీ కూడా ఏకవచన ప్రయోగమే చేస్తుంది. "అమ్మాయీ", "అబ్బాయీ" అని పిలుస్తుంది. మమ్మల్ని కంటికి రెప్పలా కాపాడుతోంది. అవసర మయినప్పుడు అది సలహా యివ్వటం కూడా కద్దు. అందుకే దాన్ని సలహా అడిగా ప్రయాణం గురించి.

"అమ్మాయీ, నేను ఇవతల పను లన్నీ చూస్తాను తలంటి నీళ్లుపోస్తాను చక్కగా నువ్వు వెళ్ళి నీ తమ్ముడు దగ్గిర ఒకరోజు వుండిరా. పిల్లల కేలోటూ రానివ్వను," అంటూ వెళ్ళడానికి నన్ను ప్రోత్సహించింది.

రాత్రిభోజనా లయాయి. తెల్లవారి మొదటిబస్సు ఆరుగంటలకే బయలుదేరుతుంది. మా చిన్నపిల్ల నన్ను విడిచివుండలేదు. దానినికూడా తీసుకుని వెళ్ళడానికి నిశ్చయించుకున్నాను.

"తెల్లవారుజామున లేవవలసి వుంటుంది. పెందరాడే నిద్రలేకపోతే తల తిరుగుతుందంటావు నువ్వు" అని మావారు హెచ్చరిక చేశారు.

రాత్రి యెనిమిది గంటలయింది. చెప్పవలసిన వన్నీ చెప్పి అచ్చిని యింటికి పంపేశాను. తరవాత ఓ రెండుగంటలు యింటి సవరింపులతో సరిపోయింది.

* * *

సరిగ్గా ఆరుగంటలకు బస్సు బయలుదేరింది. శీతాకాలం అవడంవల్ల యింకా నాలుగుప్రక్కలా వెలుగే రాలేదు చలిగా వుంది. పైగా కారువేగానికి మరీ యెక్కువైంది చలి. బస్సుస్టాండులో నే జనం చాలా మంది రావడంవల్ల బస్సు నిండుగా బయలుదేరింది. అక్కడక్కడ ఆగవలసిన అవసరం

లేకపోవడంవల్ల చాలా వేగంగా వెళుతోంది. ఆనందంతో పుట్టింటికి వెళ్ళే ఆడబడుచుల తోను, అత్తవారిళ్ళకు వెళ్ళే అల్లుళ్ళతోనూ ఆ బస్సు కలకలలాడుతోంది.

బస్సు బయలుదేరి సుమారు గంట కావస్తోంది.

"ఎక్కడికమ్మా వెడుతున్నావు?" అంది ఒక ముసలమ్మ

"మా పుట్టింటికి" అన్నాను.

"పండగకా?" అంది.

"ఊఁ" అన్నాను.

"ఎంతమంది పిల్లలు" అంది మా చిన్న పిల్లనిచూస్తూ. చెప్పాను. వాళ్ళంతా యింటి దగ్గరవున్నారనీ నే వెడుతున్నాననీ చెప్పే సరికి ఆవిడ ముఖం చూసి తీరవలసిందేగాని వర్ణించలేము. ఎందుకో అంత ఆశ్చర్యం, నాకు అర్థం కాదు.

"ఇంత మంది పిల్లలున్నా రంటున్నావు. అల్లుడు వచ్చాడంటున్నావు. అందరినీ వదలి పండగ పూటా యేమని వెడుతున్నారు? నీ ప్రాణం యెలా గ వొప్పిందమ్మా. నీ ఆనందమే కాని వాళ్ళ ఆనందం గొడవ నీ కక్కర్లేదల్లేవుంది! వెళ్ళిదలచుకుంటే పండుగ అయాక వెళ్ళలేక పోయావు?" అంది గబగబా.

ఈమె నెవరడిగారు సలహా? ఏదో పోనీ కదా పెద్దది అని వూరుకున్నాను. నా కంటె మంచీ చెడా తెలియదా? ఎంత ఆలోచించి బయలుదేరడం జరిగింది! నాపిల్లలమీద నా కన్న ఎక్కువ ప్రేమవుందా యీ విడకు? ఈమధ్య వాళ్ళంతా నా పిల్లల్ని సుఖపెడ తారా? అని అనుకుని నామనస్సు సమాధాన పరచుకున్నాను.

ఎనిమిదిన్నరకు వెంకటనగరం చేరుకున్నాం. అవూరు క్రొత్తదే అయినా రావు అక్కడికి వచ్చాక అమధ్య నొకమారు వెళ్ళడంచేత యిల్లు తెలుసుకోగలిగాను. అక్కడ బళ్ళేగాని, రిక్షాలు లేవు. మా బండీ సందు మలుపులో వుండగానే శ్రీను, పూర్ణా గుర్తుపట్టి, యెదురువచ్చారు. నేను మా చిన్నమ్మాయీ బండీ దిగగానే పూర్ణా, శ్రీను నా చెరో చెయ్యీ చెరోకట్టా పట్టుకుని మా మీద ధ్రువోపాఖ్యానం యెందుకు వ్రాశావు చెప్పు" అని నిలదీశారు.

రావు అప్పుడే గుమ్మం దిగబోతున్న వాడల్లా నన్ను చూసి "అదేమిటి! బస్సు అప్పుడే వచ్చిందా. బస్సుదగ్గరికి వద్దామనే బయలుదేరుతున్నాను" అంటూ మా పిల్లను చేతో పట్టుకుని లోపలికి తీసుకెళ్ళాడు. నేను లోపల గుమ్మంలో అడుగు పెట్టేసరికి మా మరదలు గొంతు వినిపించింది. "వదిన వచ్చేసిందే. ఎవరినా వెళ్ళారా లేదా కారుదగ్గరకి" అంటూ.

పిల్లలతోనూ,పసుపుకుంకాలతోనూ పెళ్ళి కళ వచ్చింది యింటికి. మామిడాకు తోరణాలు, మధ్య మధ్య పచ్చని ముద్దబంతి పువ్వులతో చాలా అందంగా వున్నాయి గుమ్మాలకి. వీధి అరుగులు మొదలు పెరటివరకూ సున్నంతో ముగ్గులు తీర్చినట్టుంది మరదలు. చూడ ముచ్చటగా వుంది.

హాలిట్లో మా పెద్దతమ్ముడు, మూడవ తమ్ముడూ రావు పెద్దకొడుకు రఘు, పెద్ద పిల్ల కళ తలంటి నీళ్ళుపోసుకుని రెండవమారు కాఫీతాగుతున్నారు. చిన్నతమ్ముడు వస్తాడనుకోలేదు. తమ్ముళ్ళిద్దరూ నన్ను చూడగానే "అక్కా వచ్చావా" అంటూ యెదురువచ్చి ఆప్యాయంగా చెరో భుజంమీద చెయ్యి వేసి దగ్గరగా నిలబడ్డారు. ఇంతలో "అక్క వచ్చిందట్రా?" అంటూ అమ్మ వచ్చి ముగ్గురు కొడుకుల మధ్య వున్న నన్ను చూసింది. ఆమె కళ్ళల్లో నీరు గిర్రున తిరిగింది. ఆనందాశ్రువులవి "ఎన్నాళ్ళయిందే అమ్మా నా బిడ్డ లందరూ ఒక చోట చేరి" అంటూ కళ్ళు వొత్తుకుంది మాకూ కంఠ పూర్తి అయింది. రెండేళ్ళయింది వాళ్ళని చూసి, అమ్మకూడా కొడుకుల దగ్గర వుండడంచేత నాకు చూడ్డంపడలేదు మా అందరి గొంతులూ పూడిపోయి మాట రాలేదు. అమ్మను వళ్ళి కాగలించుకోవాలనిపించింది. కాని, ఆమె మడికట్టుకుంది

ఇన్నాళ్ళకి అంతా ఒక చోట సమావేశమయాం, అనుకోని సన్నివేశం. నే నెక్కడికి వెడితే అక్కడికి వస్తున్నారు తమ్ముళ్లూ, పిల్లలూ, వాళ్ళ బావగారినీ, పిల్లల్ని తీసుకు రాలేదనీ, మా అల్లుణ్ణి దూరానవున్న తమ్ముళ్ళిద్దరూ చూడలేదనీ, మే మంతా వస్తాం అనుకున్నారనీ ఏవేవో అంటున్నారు తమ్ముళ్లు. నాకవేమీ వినబడ్డంలేదు. మనస్సులో చెప్పలేని ఆనందం. హృదయం, తేలిక అయినట్లనిపించింది వాళ్ళందరినీ చూసేటప్పటికి, పిల్లలు నా చుట్టూ తిరిగి ఆడుతున్నారు.

మా చిన్నపిల్ల, నేను తలనీళ్ళు పోసుకున్నాం. నేనూ మా మరదలు పులిహోర, బొబ్బట్లు చేశాం. అమ్మ వంట వండింది.

రావడం, అందరినీ చూడడం అయింది. చాలా ఆనందంగానే వుంది. అయితే యేమి? మనస్సు ఇంటివేపేవుంది. పిల్లలేం తింటాలు పడుతున్నారో పెదవాడికి అప్పుడప్పుడు జొన్న, జొన్న చొప్పున భోజనం అయేలోగా నాలుగుమాట్లు కాఫీ త్రాగడం అలవాటు. ఈ రాత్రికి చిన్నవాడు వస్తాడు. రాగానే "అమ్మేదీ" అంటాడు నేను కనబడకపోయేసరికి, మూడవ పిల్లాడు ఎవరిచేతా తలంటిపోయించుకోడు. ఎవరు పోసినా కుంకుడుకాయ పులుసు కంట్లో పడుతుంది. కళ్ళు యెర్రబడి నానా బాధా పడతాడు పాపం. నేను పోస్తే తలపైకి యెత్తి, పులుసు ముఖం మీదికి రాకుండా జాగ్రత్తగా రుద్దుతాను. నేనూరికి వెడుతున్నానని తలనీళ్లు యివాళ మాని రేపు నేను వచ్చాక పోసుకుంటానన్నాడు. అంటే నేను "నాబాబు కదూ. పండగనాడు అందులో భోగినాడు తప్పకుండా తలంటి పోసుకోవాలి. లచ్చి జాగ్రత్తగా పోస్తుంది" అని ఒప్పించాను. పాపం, కళ్లలోగాని

# ★ సంక్రాంతి...సంకెళ్లు ★

ఘుటుకు పడిందో యేమో. ఏం తంటాలు పడుతున్నారో యింట్లోవాళ్లు. పిల్లకి వంట అట్టే చేతగాదు, ఏదో కాలక్షేపం చేస్తుంది అవసరం వస్తే. అంతే ప్పా, అన్నం వండుకుని తింటారు. అల్లాగే ఏ టిఫిండి వంటా లేకుండా మామూలు భోజనమే యివ్వాళ. అందరికీ వండి, వడించేసరికి అమ్మాయి కేమి నీరసం వచ్చిందో. పాపం అచ్చి పెద్దదై పోయింది. అంద - నీళ్ళు పోస్తానంది పోయ్యేనూ పోస్తుంది, కాని, ఓపిక యేదీ? నన్ను పంపాలి కదా అని బహుశా పని తనమీద వేసుకుంది. ఓ కాఫీ చుక్కైనా అమ్మాయి వసిగి త్రాగిందో లేదో, అమ్మాయితో చెప్పడం మరచిపోయా నా సంగతి. అచ్చి నోరు తెరిచి ఏదీ అడగదు. మనం పెడితే పుచ్చుకుంటుంది.

ఈ విధమైన ఆలోచనలతో నా బుర్ర వేడెక్కి పోయింది. మనస్సు చాలా బాధ పడుతోంది. ఇన్నాళ్ళకి మా అమ్మ సంతానం అంతా కలుసుకున్నాం అనే ఆనందం ఒకవైపున, ఇంట్లోవాళ్ళ గురించిన బాధ మరోవైపున వుంది నాకు.

భోజనాలయేసరికి పన్నెండయింది. ఇంట్లోవాళ్లం యెవరైనా ఒకచోట వుంటే అంతా అక్కడ పోగైపోవడం, మాకు అలవాటు. నేనూ, మా మరదలూ కూర్చుని తాంబూలం వేసుకుంటున్నాం. మా అమ్మవచ్చి నా దగిరగా కూర్చుని నామీద చెయ్యివేసి నిమురుతోంది. ఎంత పెద్దవాళ్ళయినా పిల్లలు తల్లులదృష్టిలో చిన్నవాళ్లలాగే కనిపిస్తారు గదా అని నవ్వొచ్చింది నాకు. మా తమ్ముళ్ళు ముగ్గురూ వచ్చారు. రఘు, శశి నావళ్ళో పడుకున్నారు. శ్రీను నావీపుమీద వాల్లి పడ్డాడు. పూర్ణ నా కుడిప్రక్కని కూర్చుంది. వీళ్ళంతా నాదగ్గిర కూర్చోవడం దూరాన నిలబడి విస్తుపోయి చూస్తోంది మా చిన్నపిల్ల. అదే చిన్నపిల్ల అవటంచేత అదే నా దగ్గిర వుండాలిగాని యెవరూ నా దగ్గరకు రాకూడదు. పైగా వీళ్ళ సంగతి అది అట్టే యెరుగదు. అందుచేత బొత్తిగా నన్ను వదలడం లేదు. పిల్లలతో మాత్రం ఆడుతోంది. ఒకటి రెండుమార్లు యిదీ, శ్రీను, పూర్ణా తగాదా పడ్డంకూడా అయిపోయింది. నామీద వాళ్ళకిగల ప్రేమ చేత దానిని కనికరించారు.

బిక్కమొహం వేసి "నాకొత్త పరికిణీ నాకు తీసియ్యి పెట్టిలోంచి. నువ్వే లేచివచ్చి యియ్యాలి" అంది. ఎలాగైనా వాళ్ళమధ్య నుండి నన్ను యివతలకు తీసుకు వచ్చెయ్యాలని దానిప్లాను, "అలాగే యిస్తాలే" అని దాని దగ్గరగా కూర్చోపెట్టుకున్నాను.

"అత్తా యిలాచూడు!" అని నా ముఖం తనవైపునకు తిప్పుకుంది పూర్ణ.

"ఎందుకు?" అన్నాను.

"మీవూరు సంకెళ్లా" అంది.

"అదేమిటే" అన్నాను అర్థంగాక.

"కాదులే మరి నాన్నెమో నీకు ఉత్తరం వ్రాసి అమ్మకు చదివి వినిపించాడు. అప్పుడు సంకెళ్లలో వాళ్లు వస్తారు" అని చదివాడులే అందుకని అంది పూర్ణ.

"అదా సంగతి! ఔను, "సంకెళ్లలో వాళ్ళుకూడా వస్తారీ పండగనాడు. నీకు సంకెళ్ళు యేమీ లేవుకనుక తప్పక రావాలి" అని మీ నాన్న వ్రాశాడు. అది నీవు వూరు పేరు అనుకున్నావా అమ్మా" అన్నాను నవ్వుతూను. అంతా నవ్వుకున్నారు. దానికి కోపం వచ్చింది. ఏడుపు ముఖం రాబోయింది

"వాళ్ళంతేనమ్మా. పండగనాడు ఏడవరాదు. వాళ్ళు వట్టి అల్లరివాళ్ళు" అని దాన్ని వూరుకోబెట్టాను.

(46-వ పేజీ చూడండి)




(గతసంచిక తరువాయి)

## 18

దాసుడు వెళ్ళాక పుల్లయ్య మల్లుతో వచ్చాడు. నీలి యింకా దాసుని గురించే ఆలోచించుతూ కూర్చుంది. పెళ్ళం యే నాడో చచ్చిపోయింది. ఉన్న ఒక్క కొడుకూ త్రాగుబోతు - పిల్లలు! కోడలేమో గయ్యాళి. ఆస్తి పాస్తీ ఆ మంగలి పాదే. దానిని పూర్తిగా నమ్ముకుంటే బ్రతికేవాళ్ళే! పాపం యీ ముసలికాలంలో దాసుడికి ఎంతకష్టం వచ్చిపడిందో నని నీలి విచారించింది.

మల్లు తల్లియెదురుగా గెంతులేస్తూ 'చినక్ చినక్ పో!' అంటున్నాడు. నీళ్ళాడివున్న నీలి ముసిముసినవ్వు నవ్వుకుంది. పుల్లయ్య చాలకాలానికి గూటాలు త్రిప్పాడేమో ఆకలివల్ల, వేసినమట్టుకు లేదనిపించి పెళ్ళం వేపు చూశాడు. కొడుకుకూడా ఖాళీ అయిన కంచు కంచంవేపు తల్లి చూడలేదేమో నని కామోసు చూపిస్తున్నాడు. పుల్లయ్య నీలి వేపు దొంగా దిగా చూసి లేచిపోయాడు. మల్లు కూడా తండ్రిని అనుసరించాడు.

మనుమడిని మంచంమీదవేసి పాటతో నోరు కదుపుతోంది ముసలమ్మ. కొంతసేపటికి తండ్రి దగ్గరవుండి మీద చెయ్యివేయటం చేత మల్లు నిద్రపోయాడు. ఒక కంట భార్య యేంచేస్తున్నదో నని కనిపెట్టుకునే వున్నాడు.

నీలి వంటయింటి పనులు పూర్తిచేసి గదిలోకి వచ్చింది. ముసలమ్మ ఒకమూల దొర్లుతోంది. దొర్లుతూ యేదో "నాయుడోరి బొట్టాట నారాయణమ్మ" అంటూ పదం రాగాలు తీసుకుంటూ పాడుకుంటోంది. పుల్లయ్య పోతులకు గడ్డివెయ్యడానికి వెళ్ళాడు. నీలి పెరటిలోకి వెళ్ళి నిల్చుంది. చీకటి రాత్రులు. ఆకాశమంతా చుక్కలతో నిండిపోయుంది.

పోతులు నిల్చొని గడ్డి నములుతున్నయ్. ఈరాత్రికి సంతోషంగా పస్తున్న పెళ్ళం వేపు పుల్లయ్య చూశాడు. తను అంత యెక్కువ యెందుకు తిన్నానా అని బాధపడ్డాడు. దానితోపాటు ధాన్యం అఖరైందనే తలపు కూడా వచ్చింది. ఆ భూమిమీద యింకా అప్పుతెచ్చితింటే అది ఈ సంవత్సరమే మునిగిపోతుంది. తరవాత...?

పుల్లయ్యవచ్చి పెళ్ళందగ్గరనిల్చున్నాడు. ఆమెను చూస్తుంటే చూడాలని సంతోషం, గర్వం, అయ్యో యిద్దరు పస్తున్నారే అని జాలీవేసింది. ఎందుకు తినలేరని అడగడానికి సిగ్గువేసింది. కానీ యేదోవిధంగా ఈ ప్రశ్న వేస్తేగాని మనసు కుదుటబడలేదు. ఆమె భుజంమీద చెయ్యివేసి వెనుక నిల్చున్నాడు. నీలి కన్నెత్తిచూసింది. మెల్లగా బుగ్గనిమురుతూ...

"కొట్టు కాళీ అయిపోనాదా?" అన్నాడు.

"ఈ వేళతో సరి" అంది.

"నాకేమీ మనసు బాగులేదు. కాలమానం చూస్తుంటే భయం వేస్తుంది. ముందు ముందుకి బుక్కెడు గంజైనా దొరుకుతాదో లేదో!" అన్నాడు.

నీలి నెమ్మదిగా అంది: "ఎందుకలాగ చెడే అనుకోవాల! ఒళ్ళు గట్టిగావుంటే ఒకరికింద చాకిరీచేసినా కడుపు జరిగి పోతాది!"

ఈ చాకిరీ అన్నపదం పుల్లయ్యకు నచ్చలేదు. తన తాతలదగ్గరనుంచీవున్న హోషు, మంచీ మర్యాదలు తనరక్తంలో యింకిపోయిన్నయ్, అవే బాధపెడుతున్నాయ్.

"రేపటినుంచీ మళ్ళీ అరాజీగానే నాగతి?" అన్నాడు.

భర్త గొంతుకలో నిరాశ స్పష్టంగా కనిపించడంతో నీలి చిరునవ్వునవ్వి భర్తవేపు తిరిగింది. ఆ గిరజాలను మెల్లగా నిమురుతూ గుండెమీద తలఆన్చి "సూడు! ధయిరమే లచ్చిందేవి అంటారు. పెసలు అమ్మిన డబ్బు పెట్టి ధాన్యం కొంటాము. దంచినబియ్యం వేపారం పెడదాం. మిగిలిన తవుడుపోతులకీ,

# ★ దగాపడిన తమ్ముడు ★

పూటలు జావకే! ఏమైనా బియ్యంవుంటే అన్నం వండుకుందాం!"

"మన యింటలేదు యీపని", అన్నాడు

'మనం బిచ్చమెత్తుకోలేదుకదా! వేసవిలో పోడిపంట కలిసొస్తాది. కోమటి రొయ్యి బీర విత్తనాలు తీసుకరా. గుడిమీద పాదు లేద్దాం. బీరకాయలు పంటకి తీసికెళ్తే డబ్బు రాదా?"

పుల్లయ్యకి యీ మాటలన్నీ కొత్త కొత్తగా అనిపిస్తున్నాయ్. తనకుటుంబ తాహతుకు హోదాకు తగపనులు ఇవేవీ కావనిపించాయ్.

"నాకేదీ—మనసు బాగునేదే..." అన్నాడు.

నీలి తలెత్తి భర్తకళ్ళల్లోకి చూసింది. పుల్లయ్య అన్నాడు "ఈరాజిగాడు మన భూమి మింగేద్దామని చూస్తున్నాడు. పిల్లలు పుట్టున్నారా? వాళ్ళకి యేం వుస్తాం? ఊరు పూరంతా అన్యాయంతో అట్టుడికి పోతోంది. ఈ పెద్దోలందర్నీ గవుర్న మెంటోడు కైదులో పెట్టేసే!"

నీలి చప్పున అందుకుంది. ఒకరిమీద అనుకొనే బగులు మన సెడేంటో తెలుసుకుంటే మంచిది. అలాగ పండితే మనకూ డబ్బుమీద ఆశవుంటాది ఈశుపావు, అడికెగు ఎంగుకో కోరాల! పాపం వస్తాది. నాబతుకు నేను కష్టపడి బతుకుతానంటే యీలంతా యేం సెయ్యగలరు?"

"సెయ్యరా? బతకనిస్తారా?"

"ఎవరిపాపం వాళ్ళనే తింటాది. నివ్వూ నేనూ వాళ్ళని తింటామని పాపిష్ఠోల మవుతామా? కాళ్ళూ సేతులూ వుండగా బతకలేమంటా వేమిటి? కాళ్ళుసేతులు ఆ జబ్బుతినిస్తే అకుషూర్గోగ బతికిపోతున్నాడు. అందరూ మనుసులే—అందరూ బతకడానికి యీ మున్నున్నాది. ఒక్కసెట్టు కాయలే ఒకలాగుండవు. అంతా నీ సేతులో వున్నాదనుకోని, అన్నిటికి నివ్వే పెద్ద గొప్పవాడివి అనుకోని ఉండబట్టే యీలాగై పోతున్నావ్, ఒకరిమీద మనసులో సెడ్డ పెట్టుకోని యేం తీసుకపోతాం! మనుసులంతా మంచోలే! నీబట్టె నామంచి—నా బట్టె నీమంచీ వుంటాది. ఒకరికి సెడ అనుకోని నూస్తే వాళ్ళమంచేం నూస్తావు?"

ఇంతసేపు మెల్లమెల్లగా నీలి అంటుంటే ఒక్కమాటా మొగుడు ఆడలేకపోయాడు—ఆమెను తాకి అలా ఆకాశంవేపు చూస్తుంటే ఆ చుక్కలు... వెలుగులూ... యింకా అవేవో అనుభూతులు... ఓక్షణం ఈ ప్రాపంచిక విషయాలూ వాటిపై ఆసక్తి... అన్నీ మరచిపోయాడు. తనలోవున్న ద్వేషాలు పటాపంచలయిపోయిన ట్లనిపించింది తలవంచేసరికి భార్య మోము ఆ వెలుగులో వెలిగినట్లయింది. ఆమెను గట్టిగా హృదయానికి హత్తుకుని ఆ తలను మనస్ఫూర్తిగా నిమురుతూ కళ్లల్లో అభిమానం అంతా నింపేశాడు!

తెలివి తెచ్చుకున్న మల్లు ప్రక్కన అయ్యలేకపోవటంతో 'అయ్యా' అని మూలుగుతూ కేకవేశాడు. చెయ్యవేసి ప్రక్కన పడుకుంటేగానీ మళ్ళీ నిద్దర పట్టలేదు. నీలి క్రింద కోక వేసుకొని పడుకుంది. పుల్లయ్యకు నిద్దర పట్టలేదు. ఎన్నో ఆలోచనలు వచ్చి పడుతున్నయ్. ఇదివరకు తను ఆలోచించి యెరగడు. దేనికీ బాధపడీ యెరగడు ఇప్పుడు అన్నీ ఆలోచనలే... ప్రతి ఆలోచనాబాధే! ఈ ముసలమ్మ టోకుర్లు తీస్తోంది. ఎప్పుడు వూపిరి ఆపేస్తోందో? దాని క్రింద దిన వారాలకి యెంత ఖర్చు? నలుగురు కులంవాళ్ళనీ పిలవకపోతే నామోషీకదా?

కొడుకు తినడానికి వచ్చే కాలానికి ఇలాగ పరిస్థితులు వచ్చాయేమని విసుక్కున్నాడు. పొలం అయిపోతుంది. రాజిగాడు వచ్చేయేటికి మింగేస్తాడు. ఇంక ఒకత పొలంవున్నాది. వాడు నిలకడలేని మనిషి! ధరలు వస్తున్నాయికదా అని అమ్మేస్తే! ఎలాగమ్ముతాడు. తాతలకాలంనుంచీ దున్నుతున్నాంకదా? ఏమో అమ్మేస్తే—కొనుక్కోడానికి డబ్బువుంటే యెంత బాగుండేది. అదాన్నం సంవత్సరం అంతా తినగా నీలి యెందరికి చెయ్య దులిపినా సరిపోయేది! డబ్బెక్కడిది? అమ్మదానికి యెన్ని గుండెలుండాల?—ఇలా ఆలోచించి నీలి చెప్పినది సరియైనదనిపించింది. తెల్లారుజామున లేచాడు. మల్లు యింకా నిద్దర పోతున్నాడు. పెళ్ళాంతో చెప్పి బీరవిత్తనాలు తేడానికి కోమటి గ్రామం వెళ్ళాడు.

మేల్కొన్న మల్లు అయ్యలేకపోవటంతో పాలలోనికి వెళ్లాడు. అక్కడ అయ్యలేడు. "అయ్యేడీ" అని అడిగాడు. ఒకపోతు తలాడించింది. ఇల్లంతా చూశాడు. అరుగుమీద చూశాడు. వీధిలో నిల్చొని యిటూ అటూ చూశాడు. గబగబ నోరు, ముఖము కడుక్కుంటున్న మామ్మజుత్తు వెనుకనుంచి పట్టుకొని "అయ్యేడీ?" అని అడిగాడు. "ఉహూ!" అన్నాది; యెక్కిరించాడు. అమ్మ అలావస్తే "అమ్మా అయ్యేడీ!" అన్నాడు. "కోమటిపనిమీద యెల్లాడు, వస్తాడు. మామ్మ ముఖం కడుగుతాది—యెల్లు," అంది అమ్మ.

"అయ్య లావాల!" అని భీష్మించుకొంటూ వాకిట మఠంవేసుకొని కూర్చున్నాడు. పొద్దు బాగాయెక్కింది. ఇంకా అయ్యరాలేదు. కళ్ళు కాయలు కాసిపోయాయి. రాను రాను ఆకళ్లల్లో నీరు నిండుకుంటున్నాయి. గొంతుకకూడా గురగురలాడుతోంది. ఇంకా అయ్యరాలేదని యేడవడానికి యింకెంతసేపో పట్టదు—అదిగో! అయ్య అగుపించాడు. ఒక్కగంతేసి పగుగత్తి అయ్యమీదవాలాడు. యెత్తుకోగానే ఆనందంతో వుబ్బితబ్బిబ్బయ్యాడు. కొడుకుని యెత్తుకొనివస్తుంటే, ముసలమ్మ

అంది: "వాడు అమ్మకొడుకా అయ్య కొడుకా?"

మల్లు తండ్రి వంటిమీద తూలుతూ, గెంతుతూ, నవ్వుతూ "అయ్య! అయ్య!!" అన్నాడు.

అగోకే ధాన్యంకొన్నారు. వూరంతా పుల్లయ్య బియ్యంవర్తకం చేస్తున్నాడని తెలిసిపోయిందని పుల్లయ్యకు సిగ్గువేసింది. వారంరోజుల్లో నీలిచెప్పిన లాభాలు కనిపించాయి. పుల్లయ్య ధాన్యం దంపడం, నీలి చెరగడం. ఇలా వేసవివచ్చింది. కళ్లాల్లో కొట్టవలసిన కొందరి చొప్పకుప్పలున్నాయ్. ఏవో దొంగతనాలు జరుగుతున్నాయని పెద్ద రైతులు అనుకోవడమేగాని, దొంగని పట్టుకోలేక పోతున్నారు. నీలి చేతితోనూ, మల్లు చేతులతోను వేసిన బీరపాదులు పువ్వులు పూశాయి. పిందెలువేశాయి. యేతంలతో నీలు యేటినుంచి తోడి చోడిపంట వేశారు. పుల్లయ్యకు ఈరోజుల్లో చేతినిండాపనివుండటంవల్ల అట్టేలేనిపోని ఆలోచనలకు తావు లేకపోయింది. నీలి పైవాళ్ళ చోడివుడుపులకు, గొప్పులకు, కూలికి వెళ్లటం పుల్లయ్య యిష్టపడలేదు. నలుగురూ యీ విషయం యేదో హీనంగా అనుకుంటారనీ, అనుకున్నారనీ వెరున్న పెళ్ళాన్ని పుల్లయ్య వద్దన్నాడు. ఆమె యెంతో నచ్చచెప్పింది. కష్టపడి తెచ్చుకున్నప్పుడు సిగ్గెందుకు పడాలని ఆమె వాదన. యెప్పుడోగాని రాజిగాడి దగ్గరకు అప్పుకువెళ్ళే అవసరం రాలేదు. వరి ఉడుపులకు, దుక్కులకు, కుదుపుకు అవసరం వచ్చేటప్పుడు రాజిగాడిదగరకు వెళ్లవలసి వచ్చింది. మూడు సంవత్సరాలు నిండుతున్న మల్లుకూడా అప్పుడే గోచీకట్టి చేతిలో చిన్న ముల్లుకర్రతోనూ, ముక్కులో చిన్న బంగారంకమ్మి, మెడలో వెండి అత్తి కర్రలతోనూ అయ్యకు సహాయంచేసేవాడిలా బయలుదేరుతున్నాడు. పారా బోరిగ పట్టుకొని గడ్డి తవ్వటం నేర్చుకుంటున్నాడు. వుడుస్తున్నపుడు "నోమీ నోమల్లాల—" అని పాడే ఆడమ్మలతో గొంతుక కలుపుతున్నాడు. వరియాకు కట్ట త్రోవలో గరమ్మగాపెట్టి దారినపోయేవాళ్ళను డబ్బు తెయ్యండని అడుగుతున్నాడుకూడా. పోతులను "హేయ్! హేయ్!" అని అపడం తెలుసు. "తుర్ దా తురదా" అని యేటిలోనికి వెళ్లిపోతున్న పోతులను పిలవటంకూడా తెలుసు. బలవంతాన అయ్యచెయ్యిలాగుతూ గూటాలున్న చింతచెట్టుక్రిందకి తీసుకవెళ్లి అయ్యను తిప్పమనడం అయ్య గూటాలు పట్టుకొని త్రిప్పుతుంటే తను వుత్తిచేతులు త్రిప్పటం చేస్తున్నాడు. తండ్రి సంతోషంతో కొడుకును మీదికియెత్తి ఆ చిన్ని పాదాలుపట్టుకొని గాలిలో నిల్చోపెడ్తే మొదట కొద్దిగా భయంవేసినా, రానురాను ఆ భయంపోయి ఇప్పుడు తొడ చరచడం కూడా తెలుసు! భళీ అంటే పుల్లయ్య-మల్లు "భళీ! భళీ!" అని అరుస్తాడు.

పనిపాట్లు అయిపోయాయి. మళ్లీ కావలసినంత తీరుబడి-వర్షాలు కురుస్తున్నాయి-వెలుస్తున్నాయి. యేరు-గడ్డపారుతోంది. పెటేరు వచ్చేటప్పుడు జీలుగు తెప్ప పట్టుకొని కర్రలు పుల్లయ్య తీసేడు. నీలి ఒడ్డునవుండి చెత్త పోగుచేసి అదీ, మొగుడు తీసినకర్రలూ యింటికి మోసిం-. మల్లు అయ్యతో తెప్పమీద యెల్లానని యేడ్చేవాడు. "పెటేరుచూసి జడిసిపోవాలకదా అలాంటిది మల్లుగాడు యేంటి ఆ దైర్నం!" అని మనిషోలా ఆశ్చర్యపడ్డారు. ఈలోగా ధాన్యంధరలు, దానితోపాటు, మిగతా జీవితావసరాల ధరలు పెరిగిపోతున్నాయ్! గరిసెధాన్యం ధర పదిమూడువందల వరకూ పెరిగింది! అంటే రూపాయికి మూడుసోలల బియ్యం! పుల్లయ్య ఒక్కడూ రూపాయి బియ్యపు అన్నం ఒక్కపూటకే లేదనిపించ గలడు. కాని జరుపుకోవడంవల్ల అదే యింటి అందరికీ ఒకరోజుకు వస్తోంది.

పీస, రోజూ వస్తున్నవాడు, యీమధ్య నాలుగురోజులు మనుమడు దగ్గరకు రాలేదు. ఐదోరోజు సాయంత్రం వచ్చేసరికి మల్లు "తాత" అంటూ యెదురెళ్ళాడు. మల్లుని భుజా నెక్కించుకొని స్వరంలా గెంతుతుంటే పకపకా సంతోషంతో మల్లు నవ్వుతున్నాడు.

"సీతకానోడివిరా" అన్నాడు పుల్లయ్య మల్లుని దించి అరుగుమీద కూర్చుంటున్న పీసతో. ఇంతలో నీలియిటు వచ్చింది. నీలిని మధ్యపెట్టూ, "నూకేకూతరా! ఆ బుగతోడిది భూమి. దరలు చాలాసెడావుగా వున్నాయి. ఇది అమ్మితేగాని బుగత కూతురికి పెళ్ళికాదు! మనం యేలాగ కొందంటామే!"

"ఏం అయ్య కాలంనుంచి దున్నుతున్నావుకాదా నీదా ఆడిదా హక్కు?" అంటూ పుల్లయ్య "బుగత నా పొలంమీద కౌలుపెటమను—ఎంత అలముత్తారలు గడించినా?" అన్నాడు.

నీలి నవ్వుతూ "ఇంకో నూరురూపాయిలు..."

పుల్లయ్యకు ఆత్మాభిమానం రేకెత్తి "సూడవా! యీసారి పిల్లి సైపోనులే" అంటూ మీసాలు మెలివేశాడు. పీస నీలినుద్దేశించి "అలు అమ్ముకుంటామంటే మనం కొనలేము - రాయేకూతరా - పుట్టించినోడు పెట్టకపోడు - మనల్ని నమ్మి బుగత పొలమిచ్చాడు. ఆ బాబు అవుసరం వచ్చింది అమ్మేస్తున్నాడు. నమ్మినోడికి అడేలాంటోడవనీ ద్రోహంసేస్తే మన జరగదే కూతరా! నాకు ముట్టసెప్పవలసిందేదో ముట్టచెప్పాడు."

నీలితనతో యేకీభవిస్తున్నట్టుగా ఆమె వైఖరిని బట్టి పోల్చుకున్నాడు. ఈ మాట ఆ మాట ఆడుతూ "వూర్లో దొంగతనాలు హెచ్చిపోతున్నాయే. పిల్లలు గలోడ్ని. జరక్కానే సేస్తన్నావని కొందరి గుంట కాయల అనుమానం. లేదమ్మా! ఇలా రెండు రోజులకి బుక్కెడుగంజి, చెరెగు అంబలి తాగి యెందుకు బతికున్నానని. నాకింత మందిపిల్లలా - యీ లంతా కష్టపడ్డానికి భూమీ పుట్రో, వుద్యోగం సద్యోగం యేదో నా గమర్నమెంటోడు పెద్దోడైతే సూపించదా? ముందుకున్నాయే కూతరా మంచిరోజులు, అన్నాడు."

ఆ విశ్వాసంతోనే జీవిస్తున్న పీస చాలాసేపటివరకూ మనుమడితో ఆడుకొని యింటికివెళ్ళి పోయాడు. ★

—ఇంకా వుంది.

# నా సంసారం

పురాణం సూర్యప్రకాశరావు



"నేను కాఫీ తాగను"

నా సమాధానానికి చిరంజీవి ఆశ్చర్యం ప్రకటిస్తూ "అంటే ఇంట్లో కూడా తాగరా ?" అన్నాడు పేముకుర్చీ ముందుకు లాక్కుని కూచుంటూను. ఆతర్వాత అయనే "ఇప్పుడు నేను ఈ ప్రశ్న చాలా ఆశ్చర్యంగా అడిగానుకదూ ? కాఫీ తాగకపోవట మన్నది ఒక ఆశ్చర్యకరమైన విషయం అయిపోయింది. అరుదయిన సంగతి ఆశ్చర్యకరమైంది కదూ ?" అంటూ నవ్వుకున్నారు.

నేను నా వీపువైపు చూపిస్తూ "నా వీపు మీద ఒకపెద్ద మచ్చవుంది. ఒకప్పటి నా కాఫీ వ్యసనానికి అదొక నిదర్శనం. బావమరిది బిక్షు ! నాకు సరిపడా నేనుతాగందే ఒక్క చుక్కయినా అవతలవాళ్ళు ముట్టుకుందకు వీలేదు. ఇదంతా చిన్నప్పటి విషయంలెండి. ఆనాడే వాడూ పూర్నించి కొత్తగాదిగాడు. పుదయం నాపద్ధతి చూశాడు. నేను తాగే వరకూ వాడు తాగటానికి వీల్లేదనే వరకువ వాడు లోబడకుండా ఎదురుతిరిగి అంతకు ముందే వంపట్లో నాకు తెలియకుండా కాశేసిన చెంబుతో నా వీపుమీద ఈ బహుమానం ప్రసాదించాడు. ఆ పుండు మానటానికి మాసంవత్సర పట్టింది. అప్పట్నించి నేను కాఫీతాగటం మానేశాను." అన్నాను ఆనాటి సంఘటనకు ఒక ఔన్నత్యం ఆపాదించే ధోరణిలో ఆఖరిమాటలు కొత్తి పలుకుతూను.

"అయితే నా కర్తవ్యం గరిటకా సేయ్! మన్యొకటే నేనొకటి పుచ్చుకుందాం" అన్నాడు చిరంజీవి భళ్లుక్కిగా భార్యవైపు తిరిగి.

ఆవిడ నవ్వుకుంటూ వంటగదిలోకి వెళ్ళిపోయింది.

"ప్రకాశరావుగారు చెబుతున్నారుగా. నెలకు ఇరవై రూపాయలు కలిసొచ్చేటప్పుడు వెధవది రెండు వారలతో రణాళ్ళు బాధపడలేమా ?— ఉక్కగావుందిబయటకూర్చుందాం."

కుర్చీలు అరుబయట వేసుకుని కూర్చున్నాం. మెట్టతామరపువ్వులు బరువుగా కదులుతున్నాయి. చిరంజీవి లేచి రేడియో కట్టేసివస్తూ "మీరు వున్నట్టుండి మాట్లాడటం మానేస్తారు. మొదలుపెడితే ఒకంతట ఆగరు. మంచి కబుర్లేమయినా చెప్పండి" అన్నాడు.

కుర్చీ కూర్చుందుకు అనుకూలంగా లేదు. లేచి సర్దుకున్నాను చీకటి పడుతోంది కాబిరీలోంచి మామీద పడుతున్న వెలుతురు ఆ విషయం స్పష్టం చేస్తూంది.

నేను వున్నట్టుండి తెలుగు సంసారాలు, అనే విషయం ఎత్తుకున్నాను, అయితే, ఇది సందర్భశుద్ధిలేని ఎత్తుగడకాదు. ఇందాక సగంలో వదిలేసిన కాఫీ ప్రసక్తి ఈశీర్షికలో ఒక భాగం.

చిరంజీవి సిగరెటు ముట్టించాడు. పొగ చిన్న మేఘంలా మా ఇద్దరి మధ్యా వచ్చి నిలిచింది. చిరంజీవి శ్రద్ధగా వినసాగాడు. అతని శ్రద్ధ నన్ను మరింత ఉత్సాహపరిచింది.

నూటికి కోటికీ ఒకటిరెండు సంసారాలు మినహాయిస్తే మన మధ్యతరగతి తెలుగు సంసారాలన్నీ ఇంచుమించు ఒకలాటి విధమైన దుబారాకి అలవాటుపడిపోయాయి. సంసారంలో మెంబర్ల సంఖ్య ఎక్కువను కోండి; ఈ దుబారా ప్రమాణం కూడా హెచ్చుగా వుంటుంది. సంసారం చిన్నదయితే తక్కువ స్థాయిలో ఈ దుబారా జరుగుతుంటుంది. ఎంతతక్కువగా అంచనా వెయ్యండి ఈ దుబారా ప్రతి సంసారంలోనూ పాతిక రూపాయిలకి తక్కువగా వుండదు కొద్ది ఆత్మపరిశీలన వుండి ముందు దృష్టి వున్నట్టయితే ఈదుబారా తగ్గించుకోవటం ఏమంతకష్టమయిన విషయం కాదు. అసలు బొత్తిగా ఆర్జన స్వల్పమయిన వాళ్ళు కూడా ఈవిధమైన దుబారాకి అలవాటు పడటం మరి ఆశ్చర్యంగా వుంటుంది.

"వాటికి కారణాలు నేను చెప్పనా, సంసారాల్లో వ్యక్తులకి వేళ్ళు తన్నుకుపోయిన కొన్ని మూఢ నమ్మకాలు, కొన్ని దురలవాట్లు, ఈవిధమైన దుబారాకి మూల కారణాలు అని నేననుకుంటాను" అన్నాడు చిరంజీవి.

"మీరు చెప్పింది అక్షరాలానిజం. కొన్ని కొన్ని సంసారాల్లో వయస్సు మళ్ళిన పెద్దవాళ్ళు చిన్నవాళ్ళని ఇలాంటి మూఢ నమ్మకాలతో తప్పుదోవ పట్టిస్తూంటారు. తరుచుగా దేవుని పేరటో దేవతపేరిటో భారీ ఎత్తున పూజాపురస్కారాలు జరుగుతూంటాయి. అన్నకాంతి జరగాలంటూ అయిన వాళ్ళనీ కాని వాళ్ళనీ పూరూవాడు ఏకంచేసి గుండిగలు వారుస్తారు. ఒక్కొక్కప్పుడు ఈ విధమైన ఖర్చులు వందలు దాటుతుంటాయంటే నమ్మండి. సంసారం అన్నతర్వాత, పదిమంది ఇంట్లో వున్నప్పుడు, పురుళ్లొస్తాయి పుట్టినరోజులు వస్తాయి. నామకరణాలు, నూతిలో చేద వెయ్యటం గడపదాటటం బోర్లపట్టం వుయ్యాల్లో పడుకోబెట్టటం, అన్నప్రాసనలూ, పుట్టినరోజులూ, అక్షరాభ్యాసాలు - ఇత్యాది ముచ్చట్లన్నీ తెలుగు సంసారాల్లో సాధారణంగా భారీ ఎత్తునే జరుగుతూంటాయి. ఇవన్నీ యథావిధిగా జరపకపోవటం పిల్లలకు ఏదో లోటుచేసినట్టుగా భావిస్తుంటారు మనవాళ్లు. ఇవన్నీ విపరీతమైన ఖర్చుతో కూడుకొన్నవి. ఇలాంటి వాతావరణంలో పెరిగిన పిల్లలకి కూడా ఇలాంటి అభిప్రాయాలే నాటుకు

పోతాయి. ఇదంతా దగ్గర డబ్బువుండి కాదు సుమండీ, అన్నీ అరువులు. మన తెలుగు సంసారాలు చాలావరకూ అరువుల మీద బ్రతుకుతున్నవే. బట్టలకొట్టు కాతా, పచారీకొట్టు కాతా, పాలూ, పెరుగూ, నెయ్యీ ఇవన్నీ కాతాలు. అనా వస్తువు తేలిక అమ్మే ఈకొట్టువాళ్ళంతా నెలల తరబడి బాకీలు వసూలు కాకపోయినా కాతాలు వదులుకోరంటే అలా వాళ్లు ఎందుకు నిదానిస్తున్నారనే యోచన మన వాళ్ళకుండదు. ఈ అరువులు పాపం పెరిగినట్టు పెరిగిపోవటం, చివరికి లాంగుబాటు తప్పి నగానట్రా అమ్మటమో, తాకట్టు పెట్టో అప్పులు తీర్చటం మన కుటుంబాల్లో సర్వసాధారణంగా జరిగే విషయమే."— కాస్త విశ్రాంతిగా ఆగాను.

చిరంజీవి లోతైన విషయాలపట్ల చూపే శ్రద్ధ నాకు తెలుసు. "ఒక సంసారాన్ని తీసుకుని చక్కని నవల రాయండి. బాగుంటుంది" అన్నారాయన.

చూరు కింద పెట్ట తామరపువ్వు అందం నలుపులో కలిసిపోయింది.

"అలాంటి సంకల్పం నాకు లేకపోలేదు. అయితే నా అభిప్రాయాలు పదిమంది చెవిని వేసి వాళ్ళ అభిప్రాయాలు తెలుసుకునిగాని అలాంటి ప్రయత్నం చెయ్యదలచుకోలేదు." అన్నాను.

"అక్కర్లేదు. మీరు రాయండి"

"ప్రయత్నిస్తాను"

"మీరు సగంలో ఆపినట్టున్నారు?"

నేను క్షణం మౌనం తర్వాత "ఈ దుబారాలు ఇంకా అనేకవిధాలజరుగుతూంటాయి. పైకి చాలా స్వల్పమయినవిగా కనిపిస్తాయి. కాని అవన్నీ కూడితే సంసారాన్ని నిలువునా ముంచేటంత శక్తివంతమై వుంటాయి. ఒక చిన్న ఉదాహరణ చెబుతాను. మా తమ్ముడున్నాడా! వాడికి బజారుకుపోయి సరుకులు తీసుకురావటం నామోషీ! కూరలు బేరం ఆడి మంచివి ఏరుకు రావటం నామోషీ! అవి ఇంటికి తెచ్చుకోవటం నామోషి!- వాడికి అన్నీ నామోషీలు. ఒక అణా ఇచ్చి మనిషిని మాట్లాడుకుంటాడు అవి మోసుకురావటానికి. బట్టలు నలగకుండా రెండు రోజుల కొకజత మారుస్తూంటాడు. బజారుల్లో కనబడే కొత్త ఫాషన్లన్నీ ముందుగా మావాడు అనుకరిస్తాడు. ఎలా లేదన్నా నెలకొక చొక్కాగుడ్డో, లాగూగుడ్డో కొనందే వాడికి తృప్తిగా వుండదు. ఇక స్నో, ఫేస్ పౌడరు, రోజుకు పదిమార్లు సబ్బు రుద్దటం, ఖరీదైన సబ్బులు గాని వాడకపోవటం, మూడు మూణ్ణాళ్ళకి అవి అయిపోవటం, మళ్ళీ తెచ్చుకుంటూ వుండటం- ఇత్యాది వ్యామోహాలు విపరీతం. వాడు చూడని సినిమా లేదు. వారానికి రెండు సినిమాలు చూస్తాడు. కూచుని తింటే కొండంతైనా కరిగిపోతుంది. ఏదో పిత్రార్జితం స్వల్పంగా వుందనుకోండి. ఈ పద్ధతిని అది ఎన్నాళ్ళు నిలుస్తుంది. అదేమని నేనంటే వాడు రాద్ధాంతం చేస్తాడు. "పోనిద్దూ! కుర్రతనం" అని అమ్మ వాడ్ని వెనక వేసుకొస్తుంది. వాడు ఏపని చేసినా ఒద్దికగా, లాభదాయకంగా వుండి తీరుతుందని గట్టిగా చెప్పటానికి లేదు. ఎందుకంటే అందులో శ్రద్ధా, బాధ్యతా, అనే రెండు విలువైన



# ★ నా సంసారం ★

వస్తువులు లుప్తమయి వుంటాయి. కాబట్టి ఈ తరం కుర్రకారు వాళ్ళంతా ఇలాంటి పదతులు బాగా అలవాటు చేసుకుంటున్నారు. మా తమ్ముడికి తెలిసినన్ని అత్తరూ, సెంటు-ఇత్యాది అలంకార ద్రవ్యాలపేర్లు చాలా తక్కువమందికి తెలుస్తాయి. అది వాడికి గర్వకారణం. ఇలా చూస్తూ, చూస్తూ అగాధంలోకి దిగబడి పోతూంటే ఏమీ చెయ్యలేక బెంగగా వుండి తిక్కగా అటూ అటూ పోతూంటాను. ఎలాగైనా ఈ మారు గట్టిగా పట్టుపట్టి మా యింటి పద్ధతులు మార్చాలి చిరంజీవిగారూ."

"ఒక్క మీ సంసారం ఏమిటి. ఇంచుమించు మధ్యతరగతి తెలుగు సంసారాలన్నీ ఇలాగే వున్నాయి. పెద్దవాళ్ళ మాటకి మనం ఎదురు చెప్పలేం. వాళ్ళు మన్ని కుర్రవాళ్ళ కింద తోసిపారేస్తారు గట్టిగా, కఠినంగా సంచరించాలనుకుంటే కుటుంబంలో కలతలు. అలాంటి కలతల్నయినా సహిస్తారుగాని మనవాళ్ళు పొదుపుని మటుకు అలవర్చుకోలేరు." అన్నారు చిరంజీవి.

"ఏమైనా పాటలు రాశారా?"

కృష్ణమూర్తిగారూ, ఆయనా కలిసిరాసిన 'నగం తెగిన కొండ' పాటపాడి వినిపించారు వాకోరిక పైన.

"చాలా బాగుందండీ"-చిరంజీవి కుటీరం మనశ్శాంతికి అనువైనచోటు. చుట్టూ పైరు భూములు, అక్కడా అక్కడా చిన్న చిన్న కుటీరాలు, ఎదురుగా సగం విరిగి, సిగ్గుపడి ముఖం వెనక్కి తిప్పుకున్న పర్వతరాజం. అనువయిస్తూ కొండ కొనని చల్లగా స్పృశిస్తూ సాగిపోయే మేఘపంక్తి—ఇత్యాది పరిసరాలమధ్య ఒక సెలయేరులాంటి రచయిత, అతని కవనం, అభిమానంకొద్దీ వచ్చిపోయే అతిథులూ, వారి కాయింట లభించే ఆదరణ,—ఆ చూరు నీడన ఎర్రటి మెట్టతామర పువ్వుల కెదురుగా కూర్చుని ఆ పాటలు వింటూ, కొన్ని రోజులకి ఒకరోజు, బాధ్యత తెలియని మనుష్యులమధ్య మింగలేని బెంగని, బాధని, నిస్పృహని వదిలించుకుందుకు అక్కడికి వెళ్తూంటాను. మనసు విప్పుతాను, మనసు కలుపుతాను, మనసు నింపుకుని ఉత్సాహంగా వచ్చేస్తూంటాను.

చేతి గడియారం చూసుకున్నాను. ఏడు గంటలయింది. 'నేను వస్తాను' అంటూ లేచాను.

చిరంజీవి వీధి మొగవరకూ సాగనంపాడు.

* * *

నేను ఇంటికి చేరేవేళకి ఎనిమిదయింది. భోజనంచేస్తూ అన్నాను. "నేనొక మాట చెబుతాను వింటారా?" అని. ఇలా అనటానికి ఒక కారణం లేకపోలేదు. ఇందాక వస్తూంటే చల్లగాలికి ఆరుబయట కూర్చున్న షాహుకారు "ఏమండీ పంతులుగారూ" అంటూ నవ్వినవ్వు నన్ను ఇంకా వెన్నాడుతూనే వుంది. ఒక పచ్చనోటయినా అతగాడి పుస్తకంలో చెల్లు వేస్తేగాని పరువు దక్కేట్టులేదు. ఆ వేడిలో అన్నం పెడుతూ అమ్మ నసుగుతుందీ—"ఎల్లుండి చెల్లాయి పుట్టినరోజురా. కాస్త వున్నదాంట్లో వున్నంతగా అయినవాళ్ళని నలుగుర్ని పిలుచుకుని ముచ్చట చేసుకుందామని"-అంటూ గొణుగుడు ప్రారంభించింది.

నాకు రిమ్మెత్తిపోయింది. అయినా తమాయించుకున్నాను. అప్పుడన్నాను పై మాటలు. అమ్మా, అనురాధా నావైపు సాభిప్రాయంగా చూడసాగారు. "నిన్న గాక మొన్న పిల్లవాడి బారసాలంటూ రెండొందలు ఖర్చు చేయించారు. మళ్ళీ ఎల్లుండి పుట్టినరోజంటున్నారు. నేను మీకు అనేక విధాల ఇదివరకు చెప్పిచూశాను. అయినా మీరు బాధల్నీ, కష్టాలనీ ఇలా పోగు చేసుకుంటూనే వున్నారు. మీలో ఎలాంటి మార్పు నాకు కనిపించటంలేదు. ఏమి చెయ్యాలో పాలుపోవటంలేదు. ఇదిగో ఈ ఉంగరం ఒక్కటే నా దగ్గర మిగిలివుంది. ఇది అమ్ముకుని నీకు ఎలా చేసుకుంటే తృప్తిగా వుంటుందో అలాగే చేసుకో" అన్నాను చేతి వుంగరం అమ్మ ముందుకు నెట్టుతూను.

అమ్మముఖం పాలిపోయింది. అనూరాధ నావైపు బాధగా చూసింది. ఒక్కక్షణంలో నే నూహించినమార్పు అమ్మ ముఖంలో నాకు కనిపించింది. ఆమె నేలమీద చతికిలబడి "అవున్నాయనా. నాబుద్ధి గడ్డితింది. మానేస్తానులే" అంది. అయితే కేవలం ఇది నాకు అనుకూలమైన పరివర్తన అనుకుంగుకు వీలేకుండా అందులో కొంత నిష్ఠూరం జోడించింది. అది నాకు మరీ బాధాకరంగా పరిణమించింది. అయినా నేను దిగజారకుండా "మంచిది అలాగే చెయ్యి" అన్నాను.

ఆ తర్వాత నా భోజనం ముగిసేవరకూ అమ్మ నాతో ముభావంగానే మసులుకుంది. ఏమైనా నాకు కావల్సింది మార్పు.

అమ్మ ముభావం వహించినా నేను మటుకు ఈ అవకాశాన్ని వదులుకోకుండా

చాలా విషయాలు చెప్పాను. అందులో ముఖ్యంగా ఇలాంటి ముచ్చటగురించీ, కాఫీ గురించి ఎక్కువగా చెప్పాను. "ఈ కాఫీ ఒక దురలవాటు. పెద్ద దుబారా! ఇది మానుకుంటే ఆడబ్బు మరొక విధంగా మనం సద్వినియోగం చేసుకోవచ్చు. ఉదాహరణకి ఎక్కడయినా ఒక మూడొందలు అప్పుగా తీసుకుంటే అది వాయిదాల పద్ధతిని నెలకి పాతికో ముప్ఫయ్యో ఆ అప్పుకింద కట్టుకుంటే ఆ మొత్తం పెట్టి అనూరాధ గొలుసు తాకట్టునించి విడిపిద్దాం. లేకపోతే ఆడబ్బు పచారీకొట్టులో కట్టేద్దాం. ఇంకా బట్టల కొట్టులో పెద్ద బాకీవుంది. ఇవన్నీ తీరాలి. మనం సుఖంగా సంసారం చేసుకోవాలనుకుంటే, మన పిల్లల్ని వృద్ధిలోకి తీసుకురావాలనుకుంటే, ఈ అచ్చట్లూ, ముచ్చట్లూ, ఈ దురలవాట్లూ మానుకుంటే మంచిది. మనం ఇలాంటి వాటిపట్ల చూపే శ్రద్ధ, పట్టుదల మన పిల్లల భవిష్యత్తుపట్ల చూపుతే మన ధర్మం మనం నిర్వర్తించుకున్నవాళ్ళం అవుతాం. అంతేగాని ఇవాళ ఏభయ్యో అరవయ్యో ఖర్చుచేసి చెల్లాయి పుట్టినరోజు ఘనంగా చేస్తే దానికి ఒరిగే దేమీ లేదు. దానికి నాలుగు అక్షరంముక్కలు అబ్బేట్టు చూసుకుంటే అంతకంటె వాళ్లకు మనం చేసే మహోపకారం మరొకటిలేదు. మనం ముందుగా ఒక విధమైన పొదుపు వుద్యమం సాగిద్దాం. ముందు కాఫీతో అది ప్రారంభిద్దాం తర్వాత క్రమేణా ఇతర దుబారాలు తగ్గించుకుందాం." ఇలా సానునయంగా చెప్పుకొచ్చాను.

ఇందాక నేను వుంగరం తీసి విసిరేసిన సంఘటనకి ఎంత ప్రాధాన్యంవుందో ఇప్పుడు నాకు ఇంకా బోధపడింది ఆ సంఘటన వాళ్లి మనస్సుల్లో కలబర్చిన ప్రభావం చాలా బలమయిందే అయివుండాలి. అందుకనే అనూరాధే కాకుండా అమ్మకూడా ముభావాన్ని వదుల్చుకుని "అవును మానేద్దాంరా" అంది. వాళ్ళ కంఠాలలో ఒక పట్టుదలా, దీక్ష ధ్వనించినట్టుగా నా కనిపించింది. నా మనసు ఎంతో తెరిపిన పడినట్టుగా అనిపించింది. ఆ వుత్సాహంలోనే ఆరాత్రి రెండో ఆట కూడా చూసుకుని అర్ధరాత్రి రెండింటికి వచ్చి తలుపుకొట్టిన తమ్ముడిమీద నాకు ఆగ్రహం కలగలేదు. అమ్మవాడ్ని మందలించటంకూడా విన్నాను. వాడు దురుసుగా సమాధానం చెప్పి వూరుకున్నాడు.

"మీకు నిజంగా ఇందాక కోపం వచ్చింది కదూ" అంది అనూరాధ.

"నువ్వు ఇంకా మెలకువగానే వున్నావా?"

"హాఁ!!"

"కోపం అనేది ఎప్పుడూ నాకు రాదు. ఇదివరకు వచ్చేది. ఇప్పుడు నమిలి మింగే తెంగ, బాధ, అంతే."

"అయినా మీదంతా చాదస్తం. ప్రతి ఇంట్లోనూ వుండే పద్ధతేగా. మనం ఏదైనా ప్రత్యేకంగా చేసేదేముంది? అందరూ కాఫీలు తాగటం లేదూ. అందరి ఇళ్లల్లో అచ్చట్లూ, ముచ్చట్లూ జరగటం లేదూ? మనంకూడా లోకంతోపాటే" అంది అనూరాధ.

"అయితే అందరూ చేస్తున్నారుకాబట్టి అది సవ్యమవుతుందా?"

"కాదులెండి. అవి మానుకోవటం చాలా మంచిదే. మీరు అంతగా బాధపడుతుంటే అలాగన్నాను. మనం కాఫీలు మానేద్దాం" అంది అనూరాధ.

"బజారు సరుకులూ, కూరలూ నేనే తీసుకువస్తాను. రేపట్నించీ వాడ్ని పంపకండి సాధారణంగా బేరం ఆడాల్సిన అవసరం లేకుండా మనవాళ్ళు ధరలు చెప్పరు. మనవాడికి బేరమాడటం నామోషీ! తూకంలో తేడాలుంటాయి...ఇంతా... చాలా...చాలా..."

అనూరాధ నవ్వేసింది. "సంసారంలో ప్రతి చిన్న విషయం మీకు కావాలి మీకున్న బాధ్యతలు చాలవూ; ఇంకా ఇంటి పన్లుకూడా నెత్తిన వేసుకోటానికి" అంది

"నువ్వు నవ్వేవు నువ్వు నవ్వితే నాకు ఇలాంటప్పుడు బాధగా వుంటుంది ఇవన్నీ చిన్న చిన్న విషయాలకింద కనిపిస్తాయి కాని వీటిలో చాలా తోసుకుపోతుంది"

"అవునులెండి. ఇవాళ మరిది దోసకాయలు తెచ్చాడు. నా తలకాయంత కాయలు. వీసెకి రెండు కాయలు తూగాయి. అవి తరుగుతే రెండూ చేదులయిపోయాయి ఎవరయినా చిన్నకాయలు తెచ్చుకుంటారు గాని అంతంత కాయలు తెచ్చుకుంటారా చెప్పండి. చిన్నకాయలైతే చాలా తూగుతాయి. కొన్ని పోయినా కొన్నయినా మిగుల్తాయి. ఆ పావలా దండుగయిపోయింది. వంకాయలన్నీ ముదురూ, పుచ్చులూను. అరవీశలో సగం కాయలు ఎందుకూ పనికిరాకుండా పోయాయి ఆ సవాశేరూ చాలవుగా. రేపు ఇంకో సవాశేరు తెప్పించి కలిపి వండుతానన్నారు అత్తగారు. అప్పుడే వెళ్ళితీసుకు రమ్మంటే అతడు వెళ్ళనన్నాడు."

"అందుకనే వాడ్ని పంపొద్దు. నేనే తెచ్చుకుంటాను. వాడిక అంతేలే. బాధ్యత నెత్తిమీద పడితేగాని తెలిసిరాదు."

"మీ చెల్లెలు పుట్టింరోజు ఘనంగా జరపాలని అత్తగారు గట్టి పట్టుదలగా వున్నారు ఇంతవరకూ. మీకు కోపం వచ్చిందని ఆవిడ ఆ సంకల్పం విరమించుకున్నారనుకుంటాను. ఇవాళ మధ్యాహ్నం 'మావగారే బ్రతికి వుండి వుంటే ఇలాంటి ముచ్చట్లు చూసుకుని ఎంత సంతోషించేవారు' అంటూ వాపోయారు." అంది అనూరాధ.

"అంటే నీ వుద్దేశ్యం?

నా వుద్దేశ్యాని కేముంది. ఆవిడ బాధపడిందని చెప్పానంతే"

"నువ్వు ఆ విషయం చెప్పే పద్ధతి వుందే అదినాలో మార్పు తీసుకురావాలనే ప్రయత్నంగా కనబడుతూంది"

"నేను మీకుమల్లె రచయితను కాను. అంత నేర్పుగా మీ పాత్రలు మాట్లాడగలవేమో! నాకు చేతకాదు."

"పాత్రలచేత అనుకూలంగా నేర్పుగా మాట్లాడించగలనేమోగాని మిమ్మల్ని మాత్రం అనుకూలంగా మాట్లాడించలేకపోతున్నాను."

"అంత మరీ హద్దు మీరి పోయామూ?"

"ఆ విషయం నాకు తెలుసు ఆ భగవంతుడికి తెలుసు"

"అంత హద్దుమీరే మనిషినే అయితే వాళ్ళా వాళ్ళా పండగలకీ, పబ్బాలకీ పెట్టిన చీరలు కట్టుకునే ఖర్మం పట్టేది. చెప్పా పెట్టకుండా అరువు కొట్టులో. తెచ్చుకోలేనా? కట్టుకోలేనా? మీరు అంతే

(47-వ పేజీ చూడండి)




## [ఉద్యోగపర్వంనుండి]

చ. ఉభయబలంబులుం బొగడ నగ్రత భీముఁడు విస్ఫురద్గదా
రభస మెలర్పఁ గుంభములు వ్రయ్యఁగ వ్రేసిన నెత్తు రొల్కఁగా
నిభముల పిండు గావిసెలయేఱులతోడి నగంబులట్లు సం
క్షుభితములై పయిం బఱవఁ జూచి తలంచెదు నాదువాక్యముల్.

చ. ఉఱక ధనంజయుండు వివిధోగ్రశరంబుల నొక్కమాత్ర నే
ర్పఱ నుఱుమాడినం బుడమిఁ ద్రెళ్లిన నీదగుసైన్య మంతయుం
నఱికినఁ బడ్డ ఘోరవిపినంబువిధంబున నున్నఁ జూచి య
త్తఱినయినం దలంపు ముచితం బగు నావచనంబుఁ బుత్రకా.

వ. అని పలికి యతనివలనం బలుకు గానక మనంబు మరలంబెట్టికొని కొడుకులు జయింప నోపుదురొకో యను నాస సంజయుదిక్కు మొగంబు సేసి పాండవ కౌరవపక్షంబులం గలవారి నడుగుచుం గొలందులు దలపోయుచు నాతని వచనంబులం దన విచారంబులను బలాబలంబులు నిశ్చయించి పాండవేయు లెక్కుడవుట యెఱుంగుచుఁ గ్రమ్మఱ నాసూతుపుత్రుతో లెక్కలు వెట్టుచుం బోలించుచుఁ బెద్ద ప్రొద్దు వితర్కించి కౌంతేయుల శక్తి దేవతల శక్తియు గాంధారేయుల శక్తి మనుష్యశక్తింగాఁ దెలిసినవాఁడై యంబికానందనుండు నిజనందనితో నిట్లనియె.

క. నరుఁ డగ్ని దేవుఁ దనకును, వరదునిఁగాఁ గొలిచినాఁడు వానికిఁ గేతు
స్ఫురణం బాదిగఁ గల సం, గరపరికర మెల్ల నతఁడు గావించె దయన్.

వ. అదియునుం గాక ధర్మదేవతయు వాయుదేవుండును వాసవుండును నాశ్వినులును వారలక్కఁ బాండురాజుతోడివారలు వారి నొక్క కీడునుం బొరయకుండ రక్షింతురు గావున భీష్మద్రోణప్రముఖులకుఁ బాండవులం బరిభవింపరామి దెల్లంబు.

క. దేవత లేటికిఁ బార్థుఁడు, దేవసముఁడు గాఁడె వాఁడు దివిజులచేతం
బోవనిదైత్యులఁ జంపఁడె, యీవును నీవారు నతని నెఱుఁగరె చెపుమా.

వ. కౌరవులకు వచ్చిన యిమ్మహాభయంబునకుఁ బ్రతీకారంబు శాంతిం గడచినయది లే దెన్నిభంగులం జూచినఁ గయ్యం బుడుగుటయ మనకుం గర్తవ్యం బై యున్న యది యుపశమింపవయ్య దీర్ఘవైరంబు వలవ దనినఁ దండ్రికిఁ గొడు కిట్లనియె.

క. దేవత లర్జునునకుఁ దో, డై వత్తు రనంగ వలవ దది యెట్లనినన్
దేవత్వము రాగద్వేషావేశము లేమిఁ గాదె యైనది మొదలన్.

వ. కావున వారొకళ్ల వారుం గా రట్లుం గాక పక్షపాతులై పూని వత్తురయేని నది దేవత్వంబుగా దట్టి దేవత్వంబుర నర్జునుండును సురక్షితుండు గానేరఁడు నీకు నాపనికిఁ జింత వలవ దని పలికి వెండియు నిట్లనుఁ బెఱిగి వచ్చు కార్చిచ్చు నుడుపను బాషాణవర్షంబు వారింపను మహావాయువు నిలుపను నీళ్లు గట్టిగా నభిమంత్రించి వానిపైఁ గరినతు గాదుల నడపింపను నాచేన నడచునప్పుడు వలసిన చోట జలంబు లుత్పాదింపను జాలుదు సింహశరభశార్దూలభూతబేతాళాది క్రూరసత్త్వసంరంభస్తంభన ప్రకారం బెఱుంగుదు మిత్రశత్రువిషయంబులైన శుభాశుభంబులు పలయు భంగి నావహింప నేర్తు మఱియు నానావిధ సిద్ధిప్రదంబు లగు మంత్రధ్యానాద్యనుష్ఠానంబుల నాకుం గొఱంత లేదు నీచెప్పిన యగ్ని ప్రముఖదేవతలం బ్రసన్ను లగునట్లుగా నారాధించినవాఁడ వారికి నాకుం బోలె మహానుభావంబు గలిగినఁ బదుమూఁడు వత్సరంబు లబ్బంగి నిడుమలం బడుదురె వినుము చెప్పెద.

# దుర్యోధనుఁడు తండ్రితోఁ దన బలపరాక్రమంబులు సెప్పుట

క. ఏ నలిగిన వారిని సుర, లైనను రక్షింప నోప రమరు లలిగినం
బూని చెడకుండఁ గాతును, మానవు లొక నరకె నాకు మనుజాధీశా.

తే. గర్వమున నాడుమాటలుగాఁ దలంప, వలవ దిది యెల్ల నిక్కంబు వసుమతీశ
నన్ను నేఁ జెప్పికొందునే యెన్నఁడైన, నాత్మసంస్తుతి పౌరుషం బగునె చెపుమ.

వ. ధర్మతనయాదిపాండవేయులును ద్రుపదాదిపాంచాలురును విరాటాది మాత్స్యులును వాసుదేవాదియాదవులును మఱియునుం గేకయ పాండ్య మాగధ చైద్య ప్రముఖ నిఖిలదండనాయకులును నాబారింబడి మున్నీరు సొచ్చిన యేఱుల చందంబున నడంగిపోవుట యవధరించెదు గాక వారెల్లఁ దేజోధైర్యపరాక్రమోపాయ విచారవివేకంబుల నాయెత్తువత్తురె పితామహద్రోణకృపాశ్వత్థామలు శస్త్రాస్త్ర విషయంబుగా నే మేమి యెఱుంగుదు రంతెంత నేర్తు రది యెల్ల నెఱుంగుదు నంతయు నేర్తు నని పలికి యందఱు వెఱఁగుపడి యుండం దాను సంజయుతో సంగరంబు తెఱంగు నాలోచనంబుగాఁ బాండవుల దెస మాటలాడుచుండఁ గర్ణుండు ధృతరాష్ట్రుం గైకొనక ధార్తరాష్ట్రునకుం బ్రియంబుగా నిట్లనియె.

క. గురు నలుక నాకు నస్త్ర, స్ఫురణ మెడలె నంద్రు జనులు బొం కది పూజా
పరత మెయి నమ్మునీశ్వరు, కరుణ గొఱలి మగుడఁ బడయఁ గాంచితిఁ బ్రీతిన్.

ఉ. కావున నస్త్రశస్త్రము లఖండితసంపద నొంది యుండు దే
వావలి కైన నన్నుఁ జెనయన్ భర మేఁ గలుగంగ నర్జునుం
డే విడిపించు మేదినిఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁగా
నీవు బలంబు మెచ్చ నని నిల్చెద గెల్చెదఁ బాండవేయులన్.

శా. గాంగేయాదులు నీకడన్ నిలిచి వేడ్కం జూడఁ గా సర్వసే
నాంగాంగంబులమీఁద గాలియును జిట్టాడంగ నీ కేను వీఁ
కం గౌంతేయులఁ దాఁకి తత్తనువు లుగ్రస్ఫారబాణాళిఁ గూ
లం గోదండవిలాసముల్ మెఱయ లీలం బోరఁ గ్రీడించెదన్.

వ అనిన విని యినసందనునకు మందాకినీనందనుం డిట్లనియె.

క. కాలుఁడు ప్రేరేపఁగ నిటు, ప్రేలినయంతటన నిన్నుఁ బెద్దగఁ దలఁపం
బోలునె మాకును నుడుగుము, చాలుదు నీ వెల్లపనులు సాధింపంగన్.

ఉ. కూలెదువారె పాండవులు ఘోరపుఁబోర నొకండొకండ యీ,
చాలెదువార లెల్ల మును చావఁ గ్రమంబున సేన లన్నియుం
గూలఁగఁ గౌరవుల్ పిదపఁ గూలుదు రింతియ కాక నోరిచే
టల వృథాభిమానమున నిన్నియుఁ బ్రేలెదు సూతనందనా.

తే. దివిజపతి నీకు నిచ్చిన తీవ్రశక్తి, చేతఁ గవ్వడి వడు నని చూతువేని
వాసుదేవునిచే నది వ్రయ్య లయ్యెఁ, దునియ లయ్యెను బొడి యయ్యెఁ దొరఁగు ధరణి.

క. సర్పముఖశరము గల దను, దర్పంబునఁ గ్రీడిఁ దొడరఁ దలఁపకు హరిపెం
పేర్పడఁగ నదియ కా దట, తీర్పవలయువాని నెల్లఁ దీర్చు నరునకై

వ. అని పలికి ధృతరాష్ట్రుతో నిట్లనియె.

క. జ్ఞాతులు దమలోఁ బొందినఁ, జేతో మోదమున వెలిఁగి చెలు వొందుదు ర
న్నీతిం బాసిన విగతవి, భూతిం గడకొఱవులట్ల పొగయుదు రధిపా.

వ. కావునఁ దమలో విరోధం బొప్పదు సంభాషణసహభోజనాది సత్కారంబులను సవినయవర్తనంబులను బ్రీతు లైన జ్ఞాతు లిహపరార్థసాధకు లగుదు రని చెప్పి వెండియు,

క. విను మే నొకశైలమునకు, మును భూసురవర్గసహితముగ నొకపనికిం
జనునెడఁ జనరానితటం, బున నొకజున్నుండెఁ దానిఁ బొగడిరి తజ్జ్ఞుల్.

తే. దీని తేనియఁ ద్రావిన మానవులకు, జరయు రుజయును దప్పియుఁ జావుఁ గలుగ
దనఁగఁ గొందఱు బోయలు విని కడంగి, యుఱక మొఱకులై చఱిఁ బడ నుఱికి రపుడు.

వ. ఇ ట్లుఱికి మృతిం బొంది రట్లపోలె నవినీతు లైన నీ కొడుకులు పుడమి యెల్లను దార యేలుతీపుఁ జూచెదరు గాని తమ పొలిసిపోవుటం గానరు వీర లర్జును తోడం బెనంగి మానప్రాణంబులు దక్కించుకొనువారె యట్లుంగాక సమ బలులై ననుం గయ్యంబునఁ గదా వీ రౌదురు వా రౌదు రనవచ్చు నది యేల నీలోనికి ధర్మనందనుం దెచ్చికొనుటయ నీకుం గర్తవ్యం బనిన బాహ్లికుండు ధార్తరాష్ట్రున కి ట్లనియె.

క. కను బ్రమసిన తెరువరి తన, కనపాయం బైన మార్గ మరసి తగ నెఱిం
గినవారు సెప్పఁగాఁ గై, కొననికరణిఁ దగిన వెంటకుం జొర వకటా.

వ అనిన వైచిత్రవీర్యుండు దుర్యోధనున కి ట్లనియె

మ. కొడుకా యే నెటు లట్ల బాహ్లికుఁడు నీకుం గూర్చు భీష్ముండు నీ
యెడ సస్నేహుఁడు వీరిమాట విను మే మీమువ్వురుఁ మన్ననల్
వడయంగాఁ దగునట్టివారము నినుం బ్రార్థించెదఁ ధర్మజున్
విడువంగాఁ దగ దిమ్ము వారలకు నుర్విం బాలు నెమ్మిం దగన్.

క. అనినను వెండియు నొడఁబాటునకుఁ జొరనిదానికిం గొడుకుతోడఁ గడుం
గినిసి ధరణీశ్వరుం డి, ట్లనుఁ గొలువున నున్నవార లందఱు వినఁగన్.

తే. బవరములు గావె విఱిగిన బారసాఁప, వచ్చునే యొక్కరుండ వివ్వచ్చుఁ డడరి
పసుల బెట్టించునపుడు నీబలము విఱుగ, దయ్యెనే నీవుఁ గర్ణుండు నచట లేరె.

వ అని రాధేయుదిక్కుమొగంబై మఱియు ని ట్లనియె.

ఆ. నాఁటికొలఁది గాదు నారాయణుఁడు నొగ, లెక్కఁ గొన భీముఁ డేచి నడవ
ననుజతనుజసహితుఁ డై వచ్చువివ్వచ్చు, మార్కొనంగ వశమె మనకుఁ గర్ణ.

చ. బలమును దర్పమున్ మెఱయ బంటుతనంబున నీవు పాండవే
యుల నని మార్కొనం గడఁగు టొప్పెడు తెం పగుఁ జచ్చి శుద్ధుఁడై
పలుకులు మాన్పు భృత్యుఁ డనుపాటి దలంచెద విట్లు మేలె య
చ్చలమున నీ సుయోధనుని చావున కోర్చుట గాదె యెంతయున్.

వ అనిన విని కానీనుండు సంక్షుభితమానసుండై యిది యెల్ల నిట్లయ్యె నిట్లుం గాక తక్కినయది య ట్లుండె నదీసూనుండు నన్ను నిరాకరించి పలికినపలుకుల ఫలం బనుభవించుం గాక యని యతని నుద్దేశించి యి ట్లనియె.

## కర్ణుండు భీష్మునిపై రోషముచేత నస్త్రసన్న్యాసంబు సేయుట

తే నీకు నాలావుతోడ్పాటు లేక యుండ, వలయు నీ తెగునంతకుఁ గలన నిలువ
నాయుధంబులు విడిచితి నంతమీఁద, మెఱసి బలవిక్రమంబులు నెఱపువాఁడ.

వ. అని శస్త్రసన్న్యాసంబు చేసి కొలువున నిలువనొల్లక దిగ్గన లేచి పోయె నట్టియెడ శాంతనవుండు నవ్వుచు దుర్యోధనునితో నిట్లనియె.

క. అంతకుఁ జాలఁడె కర్ణుం, డింతకు మును బాస యిచ్చి యెన్నఁడు బోంకం
డింతటి మానిసి యలిగినఁ గొంతేయుల కెట్లు బ్రదుకఁగా వచ్చు ననిన్.

క అని వెండియు ని ట్లను నా, తని మాటల కెట్లుఁ గడఁగి ధర్మతనయుతో
నని సేయక తక్కవు నీ, వనుమానము వాయఁ జూడు మతనిని నన్నున్.

వ. ఏను బాహ్లిక ద్రోణప్రముఖులు గనుంగొనుచుండఁ బ్రతివీరుల ననేకసహస్రంబుల సమయించెదఁ బిదప రాధేయు రణంబునుం జూచెదవు గాక యనిన విని దుర్యోధనుండు కర్ణపక్షపాతియు నవినీతుండును నగుటం జేసి సహింపక పితామహుతో ని ట్లనియె.

చ. ఎఱిఁగి యెఱింగి యొండె మది నేది యెఱుంగక యొండె నెప్డు నం
దఱు వినఁ బాండునందనులు దర్పితులై యని గెల్తు రంద్రు ముం

దఱి నిను బాహ్లికుఁ గురునిఁ దక్కటివారిని నమ్మి యేను నే
డ్తెఱ నని సేయఁ బూనితిఁ గడిందిమగంటిమి తోడు సాలదే.

ఉ. కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నా కొరు లేల సద్భటా
కీర్ణవిరోధిసైన్యముల గెల్వఁగఁ జాలుదు మేము మాకు నీ
యర్ణవవేష్టితక్షితి యనర్గళవిక్రమ మొప్ప దక్కు మా
నిర్ణయ మెల్ల నిట్టి దవినీతియొ నీతియొ చూడుమీ తుదిన్.

క. అనుపలుకులకు విషాదము, దనుకఁగ ధృతరాష్ట్రవిభుఁడు దననందను నే
మనియుం బలుకఁగఁ జాలక, వెనుఁబాటున నిట్టు లనియె విదురునితోడన్.

తే. మృత్యుపాశోపహతుఁ డయ్యె మీఁదు లేక, సూతనందనుతోఁ గూడి నాతనూజుఁ
డకట నాశంబుఁ బొందువాఁ డయ్యె మనకు, నింకఁ జేయంగ నగుపని యెద్ది చెపుమ.

వ. అనిన విని విదురుం డతని కి ట్లను మనవారలు మున్న దుర్బలులు తమలోనం బెనంకువ లయి విరసవచనంబు
లాడుచు నింతలు పుట్టించుట యిది యర్జునునకుం గార్యం బింతియకాక యే మనువారము వారలు బంధుమిత్త్ర
సహాయులుం దారును నొక్క తలంపువారలయి యున్న వారు వలవని యీ వెంగలిమాటలు విడిచి పాండవులం
బిలువం బనిచి తగవు నడపుట దక్క మనకుఁ జేయందగుపని వేఱొండు గలుగునే యని చెప్పిన ధృతరాష్ట్రుండు
సంజయు చెప్పిన కార్యవచనంబుల కొంత వినంగలవాఁడై యతని దిక్కు మొగంబు సేసి.

క. మును వరుసతోడఁ దన తలఁ, చిన యన్నియు నీవు వినఁగఁ జెప్పె దగవుమై
నిను వీడుకొల్పునెడ న, ర్జునుఁ డే మని నిశ్చయించెఁ జూతము చెపుమా.

క. అని యడిగిన సంజయుఁ డి, ట్లనుఁ దుదిఁ బార్థుండు నిశ్చయము సేసి సుయో
ధనుతో నిందలి పెద్దలు, వినఁగా నను మన్న పలుకు వినుము నరేంద్రా.

మ. కురువంశోత్తముఁడైన ధర్మజుఁడు నాకుం దండ్రి పాలీఁ దగుం
ధరలో సా మని తాన పల్క వినియుఁ దర్పంబుమై నీక త
క్కరయేనిం జటులాస్మదీయవిశిఖాగ్నిజ్వాలలం దాహుతుల్
వరుసం బెట్టుదు ధార్తరాష్ట్రతతి నైశ్వర్యం బవార్యంబుగన్.

వ. అని పలికి కౌఁగిలించికొని భూషణాంబరాది కమనీయ వస్తువు లొసంగిన నేనునుం బాండవులను వాసుదేవుని నవి
నయంబున వీడ్కొని యింతవట్టును దేవరకు నెఱింగింప వేగంబ వచ్చితి ననిన నమ్మాటలు దుర్యోధనుం డాదరిం
పక పెడచెవులం బెట్టె ధృతరాష్ట్రుండును జిచ్చవడి యూరకుండె నప్పు డయ్యిరువురపాలను సంజయుం డొక్క
రుండు దక్క నయ్యాస్థానంబున నున్న సమస్తజనంబులును దిగ్గన లేచి తమతమ నివాసంబులకుం బోయిరి తద
నంతరంబ.

క. తనుజవశవర్తి యగు న మ్మనుజేంద్రుఁడు దన సుతుండు మర్దింపఁగ నో
పునో యనిఁ బాండుతనూజుల, ననుమతి సంజయునితోడ నాడె దురాశన్.

సీ. ఈరెండు వీఁకల తారతమ్యంబులు నెఱుఁగుదు వోరైన నెవ్వరోర్తు
రిది నిశ్చయింతమే యెందు నుపాయంబుఁ బౌరుషంబును గలవారు గలరు
సూతము చెపు మన్న సూతనందనుఁడు న న్నడిగెద వే నొంటి యడుగవలదు
మీయయ్య సాత్యవతేయుఁ డీయెడకు వేంచేయునట్లుగ భక్తిఁ జేసి తలఁపు

తే. పిలువఁ బంపు గాంధారి వారలు వినీతి, రతులు నిశ్చయవిదులు ధర్మజ్ఞచిత్తు
లుల్లమున నీ కసూయాదు లొదవనేని, పూని మాన్పంగ నేర్తురు మానవేంద్ర.

## కృష్ణద్వైపాయనుఁడు ధృతరాష్ట్రునియొద్దకు వచ్చుట

వ అనిన విని యంబికానందనుం డట్లకాక యని యొక కంచుకిం బిలిచి వానిం బుచ్చి గాంధారి రావించి సద్భక్తి
తాత్పర్యంబునఁ గృష్ణద్వైపాయనమహామునిం దలంచిన దివ్యబోధమహనీయుండైన యమ్మహాత్ముండు విజయం
చేయుటయు నందఱు దండప్రణామంబులు సేసి సమున్నతాసనంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి
యున్న సమయంబున ధృతరాష్ట్రుండు విన్నపంబు సేయక మున్న యమ్మహాపురుషుండు ధృతరాష్ట్రసంజయుల చిత్త
వృత్తులు దాన యెఱింగినవాఁ డగుటం జేసి సంజయువలనఁ బ్రసన్నదృష్టి నవలోకించి యతని కి ట్లనియె. ★

## అమెరికన్ మహిళ

# భర్తృవియో

# స్త్రీకి ఏర్పడే

బార్బా



—చిత్రకారుడు: ఎం. డి. నెల్సన్, వీరవల్లి,

## రచయితల

భర్తృవియోగానంతరం ఎదుర్కొనవల

ఒక అమెరికన్ మహిళ 'శాటర్‌డే

వ్యాసాన్ని ఇక్కడ ఒక ఉద్దేశంతో ప్ర ప్రతి స్త్రీ జీవితాన్నీ అయోమయంగా, కు సంఘటన. తన కాళ్లపై తాను నిలబడి ఉన్న పాశ్చాత్య మహిళకే వైధవ్యప్రాప్తి బ్రతుకుబాటా కానక భర్తృవియోగంతో నట్లు భావించే హైందవనారి విషయంలో వుంటుందో గ్రహించవచ్చు. పెనిమిటి గా వునా కృంగి కృశించిపోయే వనితను. వున సమాజం జాలిపడడం మాని, మరీ హింసి విధాలా పరాభవిస్తుంది. క్రితం రోజువర నొసటను తీర్చిదిద్దిన చక్కని తిలకరేఖతో తురిమిన కుసుమసౌరభంతో సాక్షాత్తూ లనూ సర్దుకుపోతూ తిరిగిన హిందూగృ విరస్తభూషగానూ, అందవికారంగానూ మూల కూర్చోబెడుతుంది.

సనాతనులను ప్రశ్నిస్తే ఇది సామా సినతంతే నంటారు; ఇది కేవలం భా అధునాతనులు. ఈ వ్యవస్థ యథాతథా తేల్చి చెప్పవలసిన బాధ్యత ఆధునిక యువ వ్యతిరేకిస్తూ గాని సంగ్రహ వ్యాసరూపం ప్రచురిస్తామని తెలియజేస్తున్నాము. సవి శీర్షికను జయప్రదం చేయవలసిందని రచ

ఆ నాడు శనివారం. అక్టోబర్ నెల నాకు 51 సంవత్సరాలు పూర్తయి, 52 వ ఏడు ప్రవేశించింది. థాంక్స్‌గివింగ్ పండుగకు మా అబ్బాయి రాల్ఫ్ సెలవుమీద న్యూయార్క్ నుంచి వచ్చి ఇంటిదగ్గరే ఉన్నాడు. డౌనింగ్ టౌన్ ఫార్మర్స్ మార్కెట్‌లో నా భర్త హ్యూ ఇంట్లోవున్న అనవసరమైన పుస్తకాలన్నీ అమ్మేసే పుస్తకాల ఒకటుంది. ఆ పుస్తకాలు తను తీసుకుంటానని అబ్బాయి రాల్ఫ్ అన్నాడు.

హ్యూకు పుస్తకాలంటే మహా ఇష్టం. నాకు వెస్ట్ చెస్టర్ (పెన్సిల్వేనియా) లో మేము ఉండే ఇంటికి దగ్గర్లోనే ఒక పురాతన పుస్తక విక్రయశాలఉన్నది. ఫిలడెల్ఫియాలో హ్యూ ఒక సంస్థకు జనరల్ మేనేజరని ఫార్మర్స్ మార్కెట్‌లో ఎవరూ ఎరగరు.

హ్యూ స్థాపించిన ఆ సంస్థకు మంచిపేరు, వ్యాపారస్తుల వర్గంలో మంచి పలుకుబడి ఉన్నాయి. మార్కెట్‌కు ఎప్పుడు వెళ్ళినా మట్టి కొట్టుకున్నలాగు, పాతస్వెట్టరు, వలిగిపోయిన టోపీ వేసుకొని వెళ్ళేవాడు. స్టేషన్ వాగన్‌లోంచి పుస్తకాలన్నీ మోసుకుపోయి పుస్తకాలలో అరల్లో సర్దేవాడు.

ఆ రోజు ఉదయమే రాల్ఫ్ దగ్గర్లో ఉన్న కాలేజీలో ఎవరో స్నేహితు లుంటే చూసొస్తానని వెళ్లాడు. అతడు రావటం ఆలస్యమైంది. పదకొండున్నరకి హ్యూ తనొక్కడూ మార్కెట్ కువెళ్ళి పుస్తకాల తెయిస్తానని, రాల్ఫ్‌కి రావాలని ఉంటే తరవాత రావచ్చునని చెప్పి వెళ్ళిపోయాడు. అతన్ని సజీవుడుగా చూడటం అదే ఆఖరుసారి.

"వితంతువు" అనే మాట నాకు గిట్టదు. "భార్య" అనే మాటకి చట్టరీత్యా స్పష్టమైన, సంకుచితమైన

## హృదయవేదన:

# హాగంవల్ల శూన్యస్థితి!

గా స్మిత్



—చిత్రకారుడు: ఎం. డి. నెల్సన్.]

### కు విజ్ఞప్తి

సి వచ్చిన వివిధ పరిస్థితులనూ వర్ణిస్తూ
ఈవెనింగ్ పోస్టు' పత్రికలో వ్రాసిన
చురిస్తున్నాము. భర్తృవియోగమన్నది
న్యమయంగా చేసివేసే మహా విషాద
్వతంత్రంగా బ్రతకడానికి అనేకావకాశా
అంత దుస్సహంగా తోచిందంటే, ఏ
జగత్తే అంధకారమయంగా మారిపోయి
వైధవ్యజీవితం మరెంత దుస్సహంగా
వుతో ఏర్పడిన పుట్టెడు దుఃఖంతో విల
దుఃఖం చాలదేమో నన్నట్లుగా-హిందూ
స్తుంది: ఎన్నివిధాల పరాభవించాలో అన్ని
కూ చేతులకు రంగురంగుల గాజులతో,
. కాళ్ళకు పసుపు పారాణిలతో, జడలో
క్ష్మీదేవిలా కలకల్లాడుతూ ఇంటెడు పను
జేని కేశఖండనాది ఘోరకార్యాలతో
యారుచేసి మన సమాజం ఆమె నొశ

జీక కట్టుబాటుకోసం అవశ్యం జరగవల
ందనంతో కూడిన వ్యవహార మంటారు
ాన్వుండాలో, లేక రూపుమాసిపోవాలో
ియువకులదే. ఈవ్యవస్థను సమర్థిస్తూగాని,
గో వ్రాసిపంపితే వనితాలోకం శీర్షికక్రింద
త్ర వారపత్రిక ప్రారంభించే ఈ కొత్త
లుతలను అభ్యర్థిస్తున్నాము.—సం.

అర్థం ఉంది. కాని సాంఘికంగా చూస్తే ఈమాట అర్థం జీవిత మంత విశాలమైనది. సంఘంలో భాగమైన కుటుంబంలో భార్య ఒక భాగం. భార్యకు ఆసరా ఇచ్చేది ముందు కుటుంబం, ఆ తర వాత సంఘం.

కాని "వితంతు" వైన స్త్రీకి ఇంత స్పష్టమైన స్థానం లేదు. అంతగా తన కొక స్థానం కావాలనుకుంటే ఆమె తనంతట తాను దాన్ని ఏర్పరుచుకోవాలి. పూర్వము హిందువులు స్త్రీని సహగమనం చేయనిచ్చేవారట. ఒకానొక జటిల సాంఘిక సమస్యను సులభంగా, తేలిగ్గా పరిష్కరించటానికి కనిపెట్టిన పద్ధతీయీ సహగమనం అని నాకు అనిపిస్తూంటేది.

కొత్తగా వితంతువైన స్త్రీకి సర్వస్వ మూ నష్టమయినట్టే లెక్క. ఆనష్టం ఎంతసంపూర్ణమైనదంటే, దాన్ని ఎదుర్కొనగలగటం మాట అటుంచి, అంత నష్టం సంభవించిందనే సంగతికూడా ఆమె వెంటనే గ్రహించ లేదు. తత్క్షణం ఆమె జాగ్రత్త పడకపోతే ఆమె దుఃఖపంకంలో కూరుకుపోయి మరి లేవలేదు. నామటుకు నేను, హఠాత్తుగా హృద్రోగంతో మరణించాడనే వార్త విన్న క్షణం నించే జాగ్రత్త పడ్డాను.

నాకు మొదటగా కలిగిన భావం ఏమిటంటే, నాకు నాభర్త ఎప్పుడూ కొత్తమనిషేనని. తెలియకుండానే ఈ భావం నన్నావేశించింది. నేను దుఃఖంలో మునిగిపోకుండా ఈ భావం రక్షించిందన్నమాట. నిజానికి నా భర్త నాకెన్నడూ అర్థం కాలేదు. అందుచేత అతడు నాకెప్పుడూ ఉండీ లేనివాడే, కనుక కొత్తగా కలిగిన నష్టమేమీ లేదన్నమాటేగా. ఒకవేళ నన్నావేశించిన భావం మరొకటై ఉండవచ్చును: ఒక మనిషి మరొక మనిషిని ఎన్నడూ పూర్తిగా తెలుసుకోవటం జరగదు. పుట్టిన దగ్గిర్నించి గిట్టేదాకా మనిషికి ఒంటరితనం వదలదు. మొత్తంమీద, నాకు సంబంధించినంతవరకూ ఏ మార్పూ జరగనట్లే భావించాను.

ఇలా భావించటానికి కారణం బహుశా దుఃఖంనుంచి నన్ను నేను రక్షించుకోటమే

# భర్తృవియోగంవల్ల స్త్రీకి ఏర్పడే శూన్యస్థితి

అనుకుంటాను. కాలంగడచినకొద్దీ ఎంత కఠోర యథార్థాన్నయినా భరించవచ్చును. కొంతకాలానికి వైధవ్యంలో ఉండే చిన్న చిన్న సదుపాయాలు కూడా వ్యక్తమవుతూ ఉంటాయి. అయితే కొత్తగా వచ్చిన మార్పును నిశ్శంకగా, సంపూర్ణంగా ఆమోదిస్తేనేతప్ప ఈ సదుపాయాలు వ్యక్తం కావు.

ఇదంతా నేను అనుభవంద్వారానే తెలుసుకోవలసివచ్చింది. నా జీవితంలో మార్పు ఎంత హఠాత్తుగా వచ్చిందో, అంతనెమ్మదిగా, అంతబాధతో ఆ మార్పుకు నేను అలవాటుపడవలసివచ్చింది.

కొత్తగా వితంతువైన స్త్రీ ఒక కొత్త ప్రపంచంలోకి హఠాత్తుగా విసరివేయబడినట్లవుతుంది. స్త్రీకి వివాహం ఎంత సంపూర్ణ రక్షణ కలిగిస్తుందో నేను అప్పటిదాకా గ్రహించనే లేదు. నేను కేవలం భర్త మీదనే ఆధారపడే మనస్తత్వం కలదాన్ని కానుగనక, అసలు భర్తఅనే వాడొకడు ఉండటంలోనే ఎంత రక్షణఉన్నదో నాకు తెలియలేదు.

ఉదాహరణకి, నా పేరుమీద మా ఇంట్లో టెలిఫోను ఒకటి ఉండటంతో నేను కొన్ని ఇబ్బందులపాలు కావలసివచ్చింది. కొందరు కొందరు పోకిరీ మనుషులుంటారు. వీళ్ళు టెలిఫోన్ డైరెక్టరీల్లో వెదికి ఆడవాళ్ల పేరుమీద ఉన్న నంబర్లను పిలుస్తూ ఉంటారు. నాకు అలాగే కొన్ని చిత్రమైన పిలుపులు వచ్చేవి.

ఒకసారి తెల్లారుఝామున మూడు గంటలకు టెలిఫోను మ్రోగింది. పిలిచిన మనిషి ఒకసారి తనభార్యతో మా ఇంటికి అతిథిగా వచ్చినవాడే. అతడు ఆ సమయంలో ఫోను చేసి తాను, తనస్నేహితుడూ కలిసి మాఇంటికి కాస్త పానీయం పుచ్చుకోటానికివస్తే నాకేమైనా అభ్యంతరమా అని అడిగాడు. అతని మాటలధోరణిచూస్తే అప్పటికే బాగా తాగిన మనిషిలాగా ఉన్నాడు. అందుచేత నాకు అభ్యంతరమేనని చెప్పాను. మరి కాసేపటిలో ఇంటివాకిట్లో బెల్ మ్రోగసాగింది. నేను తలుపుతీయలేదు. వాళ్లువెళ్ళిపోయారు. కాని ఇక ఆ రాత్రంతా నాకు నిద్ర పట్టలేదు.

ఏకాంత జీవితంలో నాకు బాగా కొట్టవచ్చినట్లు కనుపించిన లోటేమిటంటే, నా ఆనందాన్ని పంచుకునే వ్యక్తి మరొకరు లేకపోవటమే. శరత్కాలంలో అందమైన ఉదయాన మన పక్కన మరొకరుఉంటే ఆ శరత్కాల సౌందర్యం ద్విగుణీకృతంగా భాసిస్తుంది. రుచ్యమైన భోజనం మనతోపాటు మరొకరు పంచుకుంటేనే రుచ్యంగా ఉంటుంది. భార్యాభర్తల జీవితాలు ఎంతగా పెనవేసుకుపోయి ఉంటాయంటే ఒకరి ఆనందం, ఒకరి సంతృప్తి మరొకరిలో తప్పకుండా ప్రతిధ్వనిస్తాయి. ఈ రీతిగా ఇద్దరు ఒక్కరవుతారు. ఒకరి వియోగంతో మరొకరి హృదయం శూన్యమైపోతుంది.

హ్యూ చనిపోయిన నాలుగేళ్ళ తరవాత నేను గ్రహించాను చాలమంది వితంతువులకంటే నేనెంత అదృష్టవంతురాలినో. ఎందుకంటే, నాకు ప్రతిరోజూ ఏదో వ్యాపకం ఉండనైనా ఉంది. సరదాగా ప్రారంభించిన పురావస్తు విక్రయశాల హ్యూ మరణానంతరం బాగా లాభసాటి వ్యాపారంగా వృద్ధి అయింది. నేను నలుగురితో కలిసి మెలగటానికి, కొత్తస్నేహితులను సంపాదించుకోటానికి అనువైన స్థలంగా తయారైంది. అదిగాక నాభర్త డబ్బు ఎలా ఖర్చుపెట్టాలో, జమాఖర్చులు ఎలా వ్రాయాలో మొదలైనవెప్పుడూ ఆలోచించేవాడు కాదు. మొదట్నించీ ఆపని నేనే చేసుకుపోయేదాన్ని. అందుచేత నేను ఒక్కర్తినే అయిపోయినా నాకేలాంటి ఇబ్బంది అనిపించలేదు. జీవనోపాధికి సరిపడిన డబ్బే కాకుండా కాస్త పైపై వినోదాలకుకూడా సరిపడినంత ధనం సంపాదించేదాన్ని. ఒంటరి జీవితానికి, దాంపత్య జీవితానికి డబ్బుఖర్చులో ఎంత తేడాఉన్నదో కాలక్రమాన నాకు తెలిసివచ్చింది. ఇన్సూరెన్సు కట్టనక్కర్లేదు. పక్కింటి జోన్సుకుటుంబీకులతో సమానస్థాయిలో ఖర్చుపెట్టాలనే తహతహ లేదు నేనెలా ఉన్నా, బాధపడేవారు, బాధపెట్టేవారు లేరు.

నేనూ, హ్యూ ఇరవైయేళ్ళపైగా కలిసి జీవించిన మా పెద్ద ఇంటిని వదిలిపెట్టటానికి నాకు మొదట్లో మనస్కరించలేదు. నాభర్త చనిపోయిన మూడేళ్ళ తర్వాత వెస్ట్ చెస్టర్ లో ఒక చిన్న ఇల్లుకొన్నాను. ఇది కేవలం డబ్బుందిగదా అని పెట్టుబడి పెట్టడానికి కొన్నదేగాని మరేమీ కాదని మొదట్లోనన్ను నేను నమ్మించుకున్నాను. దాన్ని అద్దెకిచ్చేద్దామని, ఎప్పుడో బాగా ముసలిదాన్నైపోయాక దాంట్లోకి మారవచ్చుననీ అనుకున్నాను. భర్తృశోకం నన్నేమీ చేయలేదని నాకు నేను ధైర్యం చెప్పుకోటానికి పాత ఇంట్లో ఉండిపోదలుచుకున్నాను. నీటిలో మునిగిపోయే మనిషి గడ్డిపోచను నమ్ముకుని పట్టుకున్నట్లుగా ఆయింటిని పట్టుకువేళ్ళాడదామనుకున్నాను. చిత్రమేమిటంటే నాకుమారుణ్ణి కూడా అలాగే అంటిపెట్టుకు ఉందామనుకున్నాను.

హ్యూ చనిపోయినతర్వాత రాల్ఫ్ న్యూయార్క్ వదిలేసి, దగ్గర్లో ఫిలడెల్ఫియాలో ఏదన్నా ఉద్యోగం సంపాదించుకుని ఇంటిపట్టునే ఉంటాడని ఆశపడ్డాను. అతడు పెళ్ళిచేసుకున్నా మేము ఎప్పటిలాగా కలిసే ఉంటామని ఆశించాను.

కాని నాభర్తపోయాక అంతా మారిపోయింది. నేనేదో చేశాననీ, నేనేదో అన్నాననీ కాదు. కాని ఒక కొత్త పరిస్థితి మాత్రం ఏర్పడింది. రోజూ ఉత్తరం వస్తుందేమోనని ఎదురుచూసేదాన్ని. ఫోను మోగితే అతడే పిలిచాడని అనుకునేదాన్ని. మాటమాట్లాడితే న్యూయార్కు వెళ్ళేదాన్ని ఇంటికివస్తూ పోతూ ఉండమని కోరేదాన్ని. అతడు ఇదివరకటిలాగా బహుమతులూ అవీ పంపించకపోతే బాధపడేదాన్ని. పెళ్లిచేసుకుంటున్నానని అతడు ఫోనుచేసినప్పుడు అతని తండ్రి పోయినవార్త విన్నప్పుడు అనిపించినంత వెలితి అనిపించింది.

న్యూయార్కులో నా కుమారునియింటికొకసారి వెళ్ళి చూశాను. కొడుకు కోడళ్ళ దాంపత్యజీవితంకూడా మా దాంపత్యజీవితంలాగే ఉండటంచూసి మళ్ళీ ఏదో బాధ కలిగింది. మా ఇరువురికీ పూర్వపు అనుబంధం పోయింది. నిజానికి నేనంత బాధపడవలసిన అవసరం లేదు. జీవనయాత్రాపథంలో అధిగమించవలసిన కొత్తసీమగామాత్రమే దాన్ని పరిగణిస్తే సరిపోను. అయితే నా మనస్సు ఒప్పిందిగాదు. ఎంతో కష్టంమీద కొత్త పరిస్థితికి అలవాటుపడవలసి వచ్చింది. చనిపోయిన భర్తస్థానాన్ని కుమారుడు ఎన్నడూ ఆక్రమింపలేడని గ్రహించిన తరవాతగాని నాకు మనశ్శాంతి కలగలేదు. ఇప్పుడు మా యిద్దరికీ అంత అనుబంధం లేకపోయినా ఒకవిధమైనసన్నిహితత్వంమాత్రం ఉంటూనే వుంది.

భర్తలేని లోటు ఎన్నడూ భర్తీకాదు. భర్తీ చేసుకోవాలని చేసే ప్రయత్నం బెడిసికొడుతుంది కూడాను. పిల్లల్ని చూసుకుని కాలక్షేపం చేద్దామనుకుంటుంది తల్లి. కాని పెద్దవారైపోయాక పిల్లలకు ఆమెతో అవసరమేముంటుంది? మరొకర్ని పెళ్ళిచేసుకుందామనుకుంటుంది; కాని మొదటి వివాహానికి రెండో వివాహం ఎన్నడూ దీటుకాలేదు. కొత్తవివాహాన్ని కొత్తఅనుభవంగానే పరిగణించాలిగానిపాతదానికి 'బదులు' అనిఎన్నడూ భావించరాదు.

సాధారణంగా పిల్లలతల్లికి జీవితం ఆషామాషీవ్యవహారంకాదు; వినోదం కాదు. ఆమె ప్రతి తలపూ, ప్రతి పనీ కుటుంబావసరాలమీదనే కేంద్రీకృతమై ఉండాలి. డబ్బు వృథాచేస్తే దాని ఫలితం అనుభవించేది కుటుంబం. ప్రతిదీ బాధ్యతగుర్తెరిగి చెయ్యాలి. ఈ మధ్య ఒకసారి నేనొక పొరపాటు చేశాను. దాని ఫలితాలు అనుభ

(౫౮ వ పేజీ చూడుడు)

# నక్షత్ర ఫలితాలు

**(26-3-58 మొదలు 1-4-58 వరకు)**

### గ్రహస్థితి

| | | | |
|---|---|---|---|
| ర బు | కే | | |
| | 26 తేదీన మేషంలో బుధుని ప్రవేశం. 30 తేదీన కుంభములో శుక్రుని ప్రవేశం. వృషభ, మిధున, కర్కాటక, సింహములలో చంద్రుడు | | |
| శు<br>కు | | | |
| శ | | గు రా | |

### *అశ్విని [చూ, చే, చో, లా]*

ఈ వారము మీకు యోగదాయకము కాదు. మీరు తలపెట్టిన కార్యములకు మీకు తెలియకుండా కొందరు ఆటంకములను కలుగజేస్తారు. కార్యభారము, అకాలభోజనము వల్ల శరీరస్థితి చెడకుండా శ్రద్ధతీసుకోండి. ఉద్యోగస్థులకు హోదా పెరగడంతో కొత్త బాధ్యతలు మీదపడతాయి. రాజకీయవాదులకు మేలు. ఆటవిక ఫలసాయముల, గోధుమ వంటి ఆహారధాన్యాల వ్యాపారస్థులకు లాభయోగం. 26,27,28 కొత్తపనుల ప్రారంభం. 29 కార్యభారముచే త్రిప్పట. 30,31 బంధుసహాయం. స్వల్పలాభం 1 అనారోగ్యము

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము ధనలోపమువల అనుకున్న పనులు నెరవేరవు. మిత్రులుగా కనపడినవారే సమయానికి సహాయముచెయ్యరు. కానిమీరు సహాయాన్ని ఆసించని వ్యక్తివల్ల వారాంతంలో కార్యసిద్ధి పొందుతారు. వర్తకులకు వారం ఆఖరున లాభిస్తుంది. ఉద్యోగస్థులకు క్రమేణా అధికారుల ఆదరణ వుంటుంది. 26,27,28 త్రిప్పట, ధనాభావం. 29 ఆటంకాలు. 30, 31 ప్రయాణం, మిత్రసహాయం, కార్యసిద్ధి, నూతనులతో పరిచయం, విచిత్ర వస్తుసంపాదన. 1 ఇంట్లోవారి ఆరోగ్యం గురించి చింత.

### * కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] *

ఈవారము కార్యాచరణలో ఆటంకాలు కలుగుతాయి. అయినప్పటికీ దైవముపై భారం వదలి కార్యసిద్ధిని పొందుతారు. ఆప్తీయుల ఆరోగ్యం గురించి కొంత కలవరపడతారు. ఉద్యోగస్థులకు స్థిమితము వుండదు. వ్యాపారస్థులకు ఆందోళన. 26,27,28 నిలకడలేని స్థితి. 29 అవాంతరాలు. 30, 31 విజ్ఞానార్జన, కార్యసిద్ధి, ధనలాభము. 1 ఆప్తీయుల గురించి చింత.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

ఈవారము అనుకొన్న సొమ్ము చేతికి రాక ఖర్చులు ఎక్కువగుటచేత అశాంతి కలుగుతుంది. మీ పనులేకాకుండా ఇతరులకొరకు పాటుపడి శ్రమచెందుతారు. కోర్టు వ్యవహారాలు కొంత అనుకూలిస్తవి. ఉద్యోగస్థులకు కొత్త సమస్యలు, కార్యభారము ఎక్కువ. వర్తకులకు అశాంతి. వ్యవహారం పట పేచీలు. భార్యకు ఆరోగ్య

**బి. నరసింగరావు**

భంగ సూచనలు. 26, 27, 28 కార్యభారము, త్రిప్పట. 29 వివాదాలు. 30, 31 కార్యలాభము. 1 ఆరోగ్యచింత.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము అనుకున్నట్లుగా పనులు జరగవు. ఆర్థికంగా ఇబ్బందిపడవలసివస్తుంది. ఆప్తుల సహాయానికి పూనుకొని మాటపడి, మనోవ్యథ పొందుతారు. దెబ్బలు తగిలే ప్రమాదం జాగ్రత్తవల్ల తప్పవచ్చును. భూస్వాములకు, యంత్రములు నడుపు నిపుణులకు, రసాయనశాస్త్రజ్ఞులకూ, గనుల యజమానులకూ లాభం. 26, 27, 28 కార్యాలోచన. 29 ఆటంకములు, నిందలు. 30, 31 కార్యలాభము. 1 ప్రమాదసూచన.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీకు యోగప్రదము. అధికారుల సహాయము, మీ పలుకుబడి, బుద్ధిబలమువల్ల గత రెండు వారాలనుండి కలుగుచుండిన ఆటంకములను గడిచి కార్యసిద్ధిని పొందుతారు. బంధుసహాయముకూడా కలుగుతుంది. ఆర్థికస్థితి బాగుంటుంది. 26, 27, 28 తొందరపడి తగిన కార్యక్రమము ఒక రూపములోకి వస్తుంది. 29 న ఏమి చేసిందికి తోచదు 30, 31 మిత్రలాభం, ధనాదాయము కార్యానుకూలత కవులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము.

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారము మీకు కొత్తవారి పరిచయమువల్ల విజ్ఞానాభివృద్ధి చేసుకుంటారు. ఉత్తమగ్రంథాలు పఠిస్తారు. ధనాదాయము ఎక్కువవుతుంది. పిల్లల అభివృద్ధికి పథకాలు ఏర్పాటుచేస్తారు. కోర్టు వ్యవహారములు సుముఖమవుతాయి. ఉద్యోగస్థులకు హోదా పెరుగుతుంది. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు మేలు కాలము. 26, 27, 28 నూతనుల పరిచయం, విజ్ఞానగోష్ఠి. 29 బద్ధకం 30, 31 ధనలాభము, కార్యసాధన.

### *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈ వారము మీ మాటకారితనమువల్ల కార్యసాధన పొందుతారు. కోర్టు వ్యవహారములు మీ పక్షము అవుతాయి. ధనాదాయము వృద్ధిఅవుతుంది. ఉద్యోగస్థులకు అనుకూలము. బియ్యపు వర్తకులకు మేలు కాలము. వెండినగల వ్యాపారస్థులకు ప్రయాణమువల్ల లాభము. కవులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలం. 26, 27, 28 ప్రయాణము, బంధుసమాగమము. మృష్టాన్న భోజనము. 30, 31 ధనలాభము, కార్యసిద్ధి.

### * ఆశ్లేష [డీ, డూ, డే, డో] *

ఈ వారము మీకూ శుభయోగము. బంధుమిత్రులను కలుసుకుంటారు. శుభకార్యములనుగురించి ఆలోచిస్తారు. యత్నకార్యలాభం. వాహనయోగంవుంటుంది. బంగారం, బట్టలు, నూలు వ్యాపారస్థులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 26, 27, 28 ప్రయాణము, శుభకార్యాలోచన, విందువినోదము. 30, 31 ధనలాభం, కార్యసిద్ధి.

### * మఖ [మా, మీ, మూ, మే] *

ఈ వారం ఆర్థికస్థితి అంత తృప్తికరంగా వుండదు. కార్యభారము ఎక్కువ. తలపెటిన పనులకు ఆటంకములు, త్రిప్పట, అకాలభోజనమువల్ల ఆరోగ్యము చెడే సూచన లున్నవి. శ్రద్ధ వహించండి. ఉద్యోగస్థులకు, రాజకీయవాదులకు మేలు. కోర్టు వ్యవహారాలు వాయిదాపడుతవి. 26, 27, 28 కార్యవిఫలత, గృహకలతలు. 29 మనోవ్యథ. 30, 31 పితృవర్గమునుండి సహాయం, స్వల్పధనలాభం, కార్యసిద్ధి. 1 అనారోగ్యం.

**చూడండి! సన్‌లైట్ సగంబిళ్ల మాత్రమే ఈ బట్టలన్నిటిని ఉతికింది!**

అట్లు చేసినట్టిది దాని అధికమైన నురగ!




సన్‌లైట్ సబ్బు బట్టలను
తెల్లగాను, కాంతివంతముగాను ఉతుకును

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి వారి ఒక తయారు S. 248-X52 T L.



# నక్షత్రఫలితాలు



### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### [మో, టా, టీ, టూ,]

ఈ వారం అంత యోగకరము కాదు. మిత్రులవల్ల ఆటంకాలు కలిగినా, అనుమానించినవారి సహాయంలో కార్యసిద్ది అవుతుంది. ఉద్యోగస్తులకు ధనలోపమువల్ల మొదట్లో ఒత్తిడి వున్నా వారాంతమందు సద్దుకుంటుంది. వ్యాపారస్తులకు మాంద్యం. 26, 27, 28 అనిశ్చితకార్యక్రమం. 29 ఆటంకములు. 30, 31 కార్యలాభము, విదేశీయుల మైత్రి. చిత్రవస్తుసంపాదన. 1 న ఇంట్లోవారి అనారోగ్యము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [టే, టో, పా, పీ]

ఈ వారము తలపెట్టిన పనులకు ఆటంకాలు వస్తాయి. బంధువుల రాకవల్ల ఖర్చులు ఎక్కువ. ఆర్థికంగా ఇబ్బంది. కోర్టువ్యవహారములు మీ పరముగా తీర్పు అవుతవి. ఆధ్యాత్మిక చింతవల్ల కుటుంబకలతలుతగ్గి మనశ్శాంతి కలుగుతుంది. దైవానుగ్రహంవల్ల కార్యలాభము కలుగుతుంది. 26, 27, 28 తీరుబడిలేని కార్యక్రమము. 29 ఆటంకములు 30, 31 ధనలాభం, కార్యసాధన, మనశ్శాంతి

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము తలపెటిన కార్యములు ఫలించక కార్యభారము, ఖర్చులు ఎక్కువ. ఇతరులకొరకు కష్టపడి వివాదాలకులోనౌతారు. కోర్టు వ్యవహారములు లాభిస్తాయి. ఉద్యోగస్తులకు క్రమంగా ఒత్తిడి తగుతుంది. వర్తకులకు నిరుత్సాహము. 26, 27, 28 కార్యభంగం, 29 వివాదము. 30, 31 ధనలాభం, శాంతి. 1 భార్యఅనారోగ్యమువల్ల ఆందోళన.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారం కార్యాచరణలో ఎన్ని ఆటంకములు కలిగినా పటుదలతో ప్రయత్నించుటవలన కార్యలాభము పొందుతారు ధనలోపము తీర్చుకుందికి అప్పుచేస్తారు. మీ ప్రయత్నములు ఫలించడముచేత ఋణబాధ తీరుతుంది. దెబ్బలు తగిలే ప్రమాదం జాగ్రత్తవల్ల తప్పవచ్చు. రసాయన శాస్త్రజ్ఞులకూ, పోలీసు ఉద్యోగులకు, గనుల యజమానులకు కష్టములో కూడిన యోగము. 26, 27, 28 కార్యాచరణకు ప్రయత్నములు, 29, ఆటంకములు, మనోవ్యథ, 30, 31 లాభయోగము, ఋణవిమోచన. 1 ప్రమాద సూచన.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

గత రెండు వారములనుండి కలుగుచున్న కష్టములు గట్టెక్కుతవి. ఈ వారము ఉత్సాహములో మీ ప్రజ్ఞ, పలుకుబడి ఉపయోగించి మంచి ఫలితాలు పొందుతారు. అధికారులు ఆదరిస్తారు. ఈశాన్య దిక్కున వున్న ఆత్మీయుల కుశలము తెలిసి సంతోషిస్తారు. కవులు కొత్త రచనలు ప్రారంభిస్తారు. గణిత శాస్త్రజ్ఞులకూ, చిత్రకారులకూ, వైద్యులకూ యోగకాలము. 26, 27, 28 తెరిపిలేని కార్యక్రమము 29 అలసట, 30, 31 కార్యసిద్ధి, ధనలాభయోగములు.

### ధరలు:

నూలు, వస్త్రములు: స్వల్పముగా పెరుగును.

నూనె దినుసులు: నిలబాటుగా వుండును.

బెల్లము, పంచదార: సమస్థాయిలో వుండును.

చింతపండు. మార్పు లేదు.

ఆహార ధాన్యములు: కొంచెముగా పెరుగును.

పప్పు దినుసులు: నిలబాటుగా వుండును.

వెండి, బంగారము: స్వల్ప తేడాలో వుండును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెలుగనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, వ్యాఘ్రుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము మీకు ధనయోగము. భాగ్యాభివృద్ధి అవుతుంది. ఇదివరకు కలిగిన ఇబ్బందులన్నీ తీరుతవి. నష్టము వస్తుందనుకున్న వ్యవహారము లాభకరముగా పరిణమిస్తుంది. పిల్లల అభివృద్ధికోసము కొన్ని ఏర్పాట్లు చేస్తారు. ఇంట్లో వున్న వృద్ధుల ఆరోగ్యము బాగుపడుతుంది. శుభకార్యములలో పాల్గొంటారు. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు మేలుకాలము 26, 27, 28 ధనలాభము, కార్యసిద్ధి. 29 అలసట. 30, 31 భాగ్యవృద్ధి, పండిత గోష్ఠి, విజ్ఞానార్జన.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

గతవారము కలిగిన యోగము ఈ వారము కూడా వుంటుంది. చాలావరకూ చిక్కులు తీరిపోతవి. బంధుమిత్రులతో కలసి శుభకార్యాలలో పాల్గొంటారు. ఉద్యోగస్తులకు బాధ్యతలు ఎక్కువ. ఇంట్లోవారి ఆరో



# నక్షత్రఫలితాలు



గ్యము బాగుపడుతుంది. బియ్యము, బట్టలు, నూలు వ్యాపారస్తులకు మేలు కాలము. కవులకు, గాయకులకు, కళాకారులకూ యోగము. 26, 27, 28 ధనయోగము, ప్రయాణము. 30, 31 బంధుదర్శనము, మృష్టాన్న భోజనము, వినోదము.

## *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము ఉద్యోగరీత్యా మీ హోదా, ఆదాయము ఎక్కువవుతాయి. గతవారం అసంపూర్తిగా నిలచిన పనులు ఈవారము పూర్తి అవుతాయి. ఇతరులకు ఉపకారము చేసారు. కోర్టు వ్యవహారములు అనుకూలిసాయి. మీకు వాహనయోగము, ఇంట్లోవున్న స్త్రీలకు అలంకార ప్రాప్తి. విలువగల వస్తువుల క్రయ విక్రయములో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 26 27 28 ధనలాభం, ప్రయాణం. 30 31 శుభకార్యములో పాల్గొనుట, విందు, వినోదము. కార్యలాభము.

## * మూల [యే, యో, బా, బీ]

ఈ వారము డబ్బుకు ఇబ్బంది ఎక్కువగ వుంటుంది పెద్ద బాధ్యతలు పైని పెట్టుకొని బాధపడుతారు. గృహ కలతలుకలుగుతాయి. ఆరోగ్యము భంగపడే సూచనలు కలుగగానే శ్రద్ధ వహించండి. రాజకీయ వాదులకు గౌరవము, ధనాదాయము పెరుగుతవి ఆటవిక వస్తువుల వర్తకులకు లాభం. 26 27 28 తెమలని కార్యక్రమము. 29 ఆటంకములు, కలతలు, 30 31 పితృవర్గమునుండి సహాయము, కార్యలాభము, 1 అనారోగ్యము.

## *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]*

ఈ వారము మొదటిభాగము ఏ పనిచేసింటికీ తోచక అయోమయముగా వుంటుంది ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడి. వ్యాపారస్తులకు ఆందోళన. వారము రెండవ భాగములో కార్యలాభము. ఇంట్లోవున్న ముసలి



వారి ఆరోగ్యము చికాకు కలిగిస్తుంది 26, 27 28 అనిశ్చిత కార్యక్రమము. 29 ఆటంకములు. 30 31 మిత్రసహాయము, కార్యలాభము, విదేశీయులతో పరిచయం, విచిత్ర వస్తు సంపాదన.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

గత వారమువలె ఈ వారము కూడా యోగము తక్కువ. ఏపనిచేసిందికి మనస్సు కుగుటపడదు. దైవబలంవల్ల వారాంతానికి మీ ప్రయత్నములు సుఖమవుతాయి. ఇంట్లో వారి అనారోగ్యముచే కలవరపాటు. వ్యాపారస్తులకు నిరాశ. ఉద్యోగస్తులకు వారాంతమున మేలు. 26,27,28 నిలకడలేని స్థితి 29 ఆటంకములు 30,31 ప్రయాణము, మిత్రసహాయము, సజనదర్శనము, వేదాంత చర్చ, కార్యలాభము 1. ఆరోగ్యచింత.

## *శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఈవార మంతా కార్యకలాపాలతో సతమత మవుతారు. మీ పనులు చేసుకొనుటే కష్టమయిననూ ఇతరుల పనులుకూడా మీద వేసుకొని చెయ్యలేక నిందల పాలౌతారు కోరువ్యవహారములలో జయము పొందుతారు. ఇచ్చిపుచ్చుకొనేచోట్ల నీచులతో వివాదాలు, మనోవ్యథ. భార్య ఆనారోగ్యము కలవర పెడుతుంది. 26,27,28 ఉద్యోగస్తులకు ఒత్తిడి, 29 ఆటంకాలు, వివాదము. 30,31 ధనాదాయము కార్యలాభము 16 భార్య ఆరోగ్య చింత.

## ధనిష్ఠ [గా, గీ, గూ, గే]

ఈవారం డబ్బు ఇబ్బంది ఎక్కువ ప్రయత్నించిన యత్నములకు విఘాతాలు కలుగజేసున్నా మీపట్టుదలవల్ల తుదకు జయం పొందగలుతారు. వారాంతమందు దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, లోహపు సామానుల వర్తకులకు కష్టముతో కూడిన లాభము. ఇంజనీరింగు, పోలీసు శాఖలలో వారికి మంచికాలము 26, 27, 28 వ్యవధిలేని కార్యక్రమము. 29 ఆటంకములు, ఖర్చులు, 30,31 ధనాదాయము. కార్యసాధన. 1 ప్రమాద సూచన.

## * శతభిషం [గో, సా, సీ, సూ]

ఈవారము మీకు యోగప్రదము. కొత్త వారితో పరిచయముకలుగుట, శుభవార్త వినుట వంటి మంచిఫలితాలు కలుగుతాయి. మీ ప్రజ్ఞవల్లను, అనధికారుల సహాయము వల్లను యత్నకార్యాలు నెరవేరుతాయి. అంగువల్ల ధనాదాయము వృద్ధిపొందుతుంది. ఆత్మీయుల ఆరోగ్యము బాగుపడుతుంది. కవులు కొత్త రచనలు మొదలుపెడతారు. డాక్టర్లకు లాభం. చిత్రకారులకు, నటీనటకులకు మంచికాలము. 26, 27 28 విరామంలేని కార్యక్రమము. 29 అలసట 30, 31 ధనలాభము, కార్యసిద్ధి, మిత్రసమాగమం, కుశలవార్త.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈవారం మీరు ఉద్దేశించినట్లు కార్యం నిర్ణయం చేసుకొని లాభం పొందుతారు. ఆరోగ్యం సరి అవుతుంది. ఆర్థిక లాభం, భాగ్యవృద్ధి, మానసికోత్సాహం కలుగుతవి. సంతానమునకు మేలుకొరకు కొన్ని ఏర్పాట్లు చేస్తారు. వర్తకులకు ప్రయాణమువల్ల లాభం ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు యోగకాలం. 26, 27, 28 కార్యనిర్ణయము, కోరు వ్యవహారములలో లాభం. 29 ప్రయాణము, శ్రమ. 30, 31 ధన భాగ్యవృద్ధి, కార్యలాభము.

## *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]*

గత రెండు వారములకన్నా ఈ వారము యోగప్రదము. అసంపూర్తిగా నిలిచినపనులు లాభకరంగా ముగుస్తాయి. కవులు, గాయకులు మొదలగు కళాకారులతో వినోదముగా గడుపుతారు. బంధువులతో శుభ కార్యాలోచన, మృష్టాన్న భోజనము. వెండి, బియ్యము, బట్టలవర్తకులకు లాభయోగము. దూరమంగున్న ఆత్మీయుల క్షేమం తెలిసి సంతోషము కవులకూ, గాయకులకూ, కళాకారులకు మేలు. 26, 27, 28 కార్య నిర్ణయము. 29 ప్రయాణము 30, 31 బంధుదర్శనం, వినోద కార్యలాభం, మృష్టాన్న భోజనం.

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈవారము మీకు యోగదాయకము. యత్నకార్యాలు ఫలిస్తాయి. ధనాదాయం బాగుంటుంది పరోపకారము పుణ్యకార్యాలలో పాల్గొంటారు. శుభకార్యాలోచనలు చేస్తారు. వాహనయోగము కలుగుతుంది. బంగారము, వజ్రములవంటి ఖరీదైన సరుకుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభం. 26, 27, 28 సంఘక్షేమకార్యాచరణ 29 ప్రయాణము, 30, 31 ధనలాభం. శుభ కార్యాలోచన, విందు, వినోదం.





# వనితాలోకం

## నడక



టి. ఉషారాణి

జమ్మలమడుగు

పొద్దు పడమటికి వాలి చాలాసేపైంది.

నేను పువ్వులు చేరంచేస్తున్నాను అంతలోకే బామ్మ వచ్చింది. ఓ కాలేజీ అమ్మాయి గావును, ఆ దారినపడి పోతుంటం ఆవిడ కంటపడ్డది. తన అలవాటు ప్రకారం ఆ అమ్మాయిని నిలేసి "ఎవరమ్మాయివి తల్లీ?" అంది.

ఆ అమ్మాయి చిటిముడిపాటులో ఫలానా వారి అమ్మాయినని చెప్పింది.

"ఏదిటో పోగొట్టుకున్నావులావుంది. వెతుక్కుంటూ వెడుతున్నావు. చీకటి పడుతోంది గదా! ఏదైనా లైటు తెచ్చుకోగూడదటమ్మా!" అంది బామ్మ.

బామ్మ చెప్పింది ఆ అమ్మాయికి సరిగా విన్పబడలేదు గావును మామూలు కాలేజీ భాషలో "హ్వాట్" అని అడిగింది.

బామ్మ మాత్రం తక్కువదా? ఈమధ్య తమ్ముడిదగ్గర కొన్నాళ్లు యింగ్లీషు ప్రైవేటు చెప్పించుకుంది మరి. అందులో మరచిపోయినవి పోగా 'హాట్' అంటే 'టోపీ' అనే దొక్కటీ అమ్మమ్మకు కంఠతా వచ్చు.

"ఓహో! హాట్ పోయిందా! హాట్ అయితే చీకట్లో అయినా కాస్తా గుర్తుపట్టవచ్చులే..." యింకా బామ్మ తన సోది ముగించకముందే ఆ అమ్మాయి "చట్... చట్" అని విస విసా నడిచిపోయింది.

"అదేవిటే అంటోంది! నాకర్థంకాలా!" అంటూ బామ్మ విరగబడి నవ్వుతున్న నాకేసి తిరిగింది. బామ్మకు ఎంచేతో నా నవ్వంటే సయించదు. అంచేత గబుక్కున పైటచెంగు నోట్లో కుక్కుకుని నవ్వాపుకుని తీరిగా బామ్మకు సంగతి సందర్భాలు విడమర్చి చెప్పాను.

"మరేవిటి! ముసలమ్మలా - మరీ నాకంటె అధ్వాన్నంగా నీవు అలా వంచి నడచిపోతోం దెందుకు అడుగులో అడుగేసుకుంటూ?"

"ఆ పిల్ల నడకతీరే అంత బామ్మా! అదో ఫాషన్ - ఇప్పటివారి ట్రేడ్‌మార్క్!" అన్నాను.

"ఏం పేడుమార్కో! అకేం నడకమ్మా! యింకా నయం! కోతులకు మల్లే నడవటం లేదు." అంది బుగ్గని వేలేసుకొని బామ్మ.

నిజమే మరి! ముసలైనా - నడుములు వంగిపోతున్నా చేతులు వేలబడిపోతున్నా నిటారుగా నించోని నడవటానికే మా బామ్మ తాపత్రయపడుతూ వుంటుంది. అలాంటి బామ్మ నడుములు వదించుకుని వంచుకొని నడచిపోతున్న అమ్మాయిని చూచి 'ఏదో పోగొట్టుకొని వెతుక్కుంటున్న'దనుకొనటంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

### రాయంచ నడక

అందాలూ అలంకారాలూ అన్నీ ఒక ఎత్తు. మనం నడిచేతీరూ ఒక ఎత్తు. ఎప్పుడైనా పెద్దవారు పెళ్ళిచూపులకు వచ్చినపుడు గమనించండి. వారు పెళ్ళికూతుర్ని అవీ యివీ తెమ్మని పనులు పురమాయించి నడకతీరును గమనిస్తూంటం మనం యిట్టే పట్టేసుకోవచ్చు. అందం అలంకారం వుండిన అమ్మాయిలైనా బుజాలు ముందుకు వేలేసుకొని నడుములను అరవై డిగ్రీల కోణంలో సర్దుకొని నడుస్తుంటే చుట్టుపట్ల వారు ఏమంటారో విన్నారా? "దిష్టిబొమ్మలాగుంది. అందం చందం వుండి ఏం లాభం? గూనిదానిలా అలా ముఖం వేలేసుకొని వీపు వంచి నడుస్తోంది ముత్తవ్వలా! ఆ నడకా అదీ చూస్తుంటే ఈ జన్మకు మరోమాటు చూడ బుద్ధెయ్యదు" అంటారు ఇహ బామ్మలజాతికి చెందినవారైతే పుట్టుక్కున మొహంమీదే అనేస్తారు.

అంచేతే పూర్వం మనకవులుగూడా తమ కావ్యనాయికల్ని కాస్తా జాగర్తగానే ఏరుకున్నారు. కావ్యనాయికలందరూ దాదాపు రాజహంసలకు నడకలు నేర్పేవారు. పూవు వంచీవంచక తిన్నతిన్నగా అడుగులు వేస్తూ వుంటే చుట్టూ కొన్నిగజాల మేరకు నేల ఆకాంతులతో వెలిగిపోయేదిట. లాగని మనంగూడా వారికి మల్లే మందయానలమూ, గజగమనలమూ, హంసగమనలమూ కావాలని కాదండోయ్ నేనంటం! ఆ నడకలు యిరవైయ్యో శతాబ్దంలో మరీ యిబ్బందిగా వుంటాయి. ఆ కావ్యనాయికల్ని అనుకరించబోవటంకన్నా మామూలు పల్లెపడుచుల నడక యిరవైయ్యో శతాబ్దానికి బాగా అచ్చివస్తుంది.

### నడక నసిపడక

ఈమధ్య అన్నయ్య ఓ ఫ్రెండు తరఫున పెళ్లికూతుర్ని చూట్టానికి వెళ్లాడు. ఆ పెళ్ళికూతురు మంచి సంపన్నకుటుంబంలో అమ్మాయే! అందం, చందం, చదువూ అన్నీ వున్నాయి. వచ్చాలి కానీ ఎంతైనా కట్నం యిచ్చుకోగలరు కూడా! అన్నయ్య యింటికి వచ్చాక అడిగాను "పెళ్లికూతురికి మీ ఫ్రెండు నచ్చాడా!" అని. "పెళ్లికూతురికి మావాడు నచ్చాడుగానీ, మావాడికి పెళ్ళికూతురు నడక నచ్చలేదుట. ఇహ వాడి బామ్మకి ఆతీరు అసలే సయించలేదుట. అంచేత అంతా కాన్సిలయింది" అన్నాడు. అన్నయ్య తమాషాకి చెబుతున్నాడనుకున్నాను. మరి నడకమూలంగా పెళ్ళిమానేసే వారుంటం ఆశ్చర్యంకాదూ? కానీ అన్నయ్యమాటలు నిజమేనని నిలకడమీద తెలిశాక ఆశ్చర్యపడటంగూడా ఎంత అసంగతమో తెలిసివచ్చింది.

ఈ నడకవిషయంలో పెద్దవాళ్ళకున్నంత శ్రద్ధమనకుండదు. ఎప్పుడైనా తమాషాకి వంకరగా నడిచామంటే పెదవాళ్లు మందలిస్తారు. మాబామ్మ అయితే 'తిరిగీ అలానడవన'ని ఒట్టు వేయించుకొనిగానీ అన్నం ముట్టదు. నడకలోగూడా వంకలు పెడుతూవుంటం మనకు

(42-వ పేజీ చూడండి)

# మామ్మగారి అనుభవాలు: ఒక మనుమరాలి విమర్శ

పవని నిర్మలప్రభావతి

పొన్నాడ సుబ్బమ్మ మామ్మగారు వ్రాసిన వ్యాసం చదివాను. మామ్మగారి ఉద్దేశ్యాలతో నేను చాలావరకు ఏకీభవించలేకపోతున్నాను. తాము అనాగరికులం, మోటు వాళ్ళం అంటూనే నేటి నాగరిక యువతీ యువకుల్ని తమాషాగా కొంత వింతగా కూడా విమర్శించారు. మామ్మగారు వ్రాసినట్లు అత్తగార్లూ సాధింపులూ! అంటూ వ్రాయడం ఆ అత్తగార్ల సాధింపులు పడలేక నే ననేది వారు బహుశా తమ వార్ధక్యంవల్ల మర్చిపోయివుంటారు. అంతేగాదు వారి కాలానికీ, ఈ కాలానికీ ఎంతో తేడా వుంది. రోజులు పూర్తిగా మారాయి. అలాగే కాలంతోపాటు మనుషులు, మనస్తత్వాలూ కూడా మారిపోయాయి—అంతే గాని ఇదంతా నాగరికుల తప్పుకాదనే సంగతి కూడా వారు విస్మరించారనుకుంటాను.

మామ్మగారి కాలంలో అత్తమామలను, తలిదండ్రులను దైవస్వరూపులుగా భావించే వారమంటూ వ్రాశారు. నేడూ అలాటి వాళ్ళు ఎంతోమందున్నారు. కాని ఒక్క విషయం. ఈనాడు కూడా తలిదండ్రులను, అత్తమామలనూ దైవస్వరూపులుగా భావించినా, అవతలివాళ్ళు మాత్రం వీళ్ళు చేసే చిన్న తప్పిదాలనైనా క్షమించడం, అర్థం చేసుకోడంలాటిది వదిలేశారు. అందువల్లే రానురాను పెద్దవాళ్ళంటే కేవలం మాపాలిటి 'సాధింపుల పుట్టలు'గానే తయారయ్యారు. బాగు పరచాలని చెప్పేదాన్లో కూడా సాధింపుమాటలు జత చెయ్యటంవల్ల పెద్దవాళ్ళ మాటలంటేనే ఓ విధమైన తలనొప్పి బయల్దేరుతోంది. అది మా తప్పు—అంటే నేటి నాజూకు మనుషుల—తప్పు కాదు సుమా! పోగే ఈ కాలంలో పెళ్లాన్ని 'యేరా!' అని పిలుస్తున్నారంటూ మరో అభాండం వేశారు మామ్మగారు. ఏమో నే నెక్కడా వినలేదు ఇలా! కాల స్వభావాన్ని బట్టి—లోకజ్ఞానం తెలుసుకుని, హృదయంకలిగి, భార్య మనలాటి మనిషే నని తెలుసుకున్న ఈ రోజుల్లో—కాకుంటే పేరట్టి పిలవడం పరిపాటీ, నాజూకూ గూడాను. "ఏమేవ్!—ఒసేవ్!—కుంకా—విధవా!" ఇత్యాది సంబోధనలకన్నా శుభ్రంగా పేరుపెట్టి పిలిచినదాన్లో తప్పేమీ లేదనుకుంటాను. ఒకర్నొకరు అర్థంచేసుకుని సాధ్యమైనంత వరకు సంతోషంగానే సంసారాన్ని గడపాలని అనుకునే నేటి దంపతుల్లో ఎవరూ ఒకర్నొకరు కొంగునగాని కట్టుకు ఆడించడం లేదు. ఇంకా ఇప్పుడు మన అమ్మమ్మలనూ, అవ్వలనూ, తాతలనూ చూస్తుంటే—ఆ కాలపు ఆడవాళ్ళ నోటికి తట్టుకుని మన తాతలు ఇన్నేళ్ళు ఎలా బ్రతగ్గలగారా అనిపిస్తుంది!. బహుశా మామ్మగారు చెప్పినట్టు తాతలమీద దేవుడికి దయరాకనేమో!

పోతే తెల్లవారుజామున లేచి ఇంటిపనులు చూసుకోడానికి ఈ కాలంలో అంతంత పనులు సర్వసాధారణంగా వుండటంలేదు. అధవా వున్నా ఆధునిక గృహిణి చాకచక్యంగానే అన్నింటినీ సర్దుకుపోతోంది. పైగా ఆ కాలపువాళ్ళకుండే దేహాధారుఢ్యం మాలో—అంటే నేటి నాగరికుల్లో—అక్షరాలా లేదు. ఈ కాలపు కొత్త కొత్త రోగాలూ అప్పుడు లేవు. కారణం ఆ కాలపు స్వభావమె అంత! అప్పటిలా ఇప్పుడు అందరూ ఆవకాయా పెరుగన్నం తింటే—అది అరిగేందుకు ఆ కాలపు పనిలేదు! (ఆ కాలంలో ఆచారం పేరిట ఒళ్లు హూనం చేసుకునేవాళ్ళులెండి!) అందుచేత ఎన్నోరకాల మందులు తినాల్సొస్తోంది. మరి ఈ శనిపోనిబాధ దేనికి?

(88-వ పేజీ చూడండి)

## అంబపూజ

అంబపూజ శ్రీశైలంలో, ఉగాదికి చాలా బాగా జరుగుతుంది. అంబ, శ్రీశైలంలో మల్లికార్జునస్వామి భార్య భ్రమరాంబాదేవి. అంబ 'పుట్టింటివారు' మార్వాడీలు. వారు వచ్చి అంబకు, పూజలు జరిపిపోతారు. దీనికి చిన్నకథ చెపారు.

పూర్వం ఒక భార్య, భర్త ఉండేవారు. వారికి ఓకొడుకు. ఆ అబ్బాయి ఒకరోజు తల్లి దగ్గరికివచ్చి "అమ్మా అందరికి అక్కయ్యలు వున్నారుకదా మాఅక్క ఎవరమ్మా, ఎక్కడ వుంది" అని ప్రశ్నించాడట.

తల్లి చెప్పిందట. "నాయనా మీఅక్కయ్య శ్రీశైలంలోవుంది. మల్లికార్జునస్వామి భార్య అని చెప్పింది. ఆఅబ్బాయి రోజూ అడుగుతుండేవాడట. ఆమె రోజూ అలాగ చెప్పేది.

ఒకరోజు తల్లి, తండ్రులకు తెలవకుండా శ్రీశైలము వచ్చి "అక్కా, అక్కా" అని గట్టిగా పిలిచాడట. భ్రమరాంబ పలకలేదు. అప్పుడు అబ్బాయికి కోపంవచ్చి కొండమీద నుండి దూకి చనిపోతాను. మా అక్కయ్యకు నామీద కోపం వచ్చి పలకటంలేదు" అని పడబోయాడు.

అప్పుడు భ్రమరాంబ వచ్చి "నాయనా నేనే మీ అక్కయ్యని" అని పట్టుకొని ఒడిలో కూర్చొపెట్టుకొని ముద్దులాడిందట. అందుకని భ్రమరాంబదేవికి మార్వాడీలు ఈ విధంగా పుట్టింటివారయినారు.

శివరాత్రికి మల్లికార్జునస్వామికి జరిగే వుత్సవాలు అన్నీ చూసి భ్రమరాంబదేవి అలిగి కోపంవచ్చి తలకు పట్టువేసుకుని పడుకుంటుందట. అందుకని శివరాత్రి వెళ్ళిన తరువాత అంబ గుడితలుపులు మూసివేస్తారు. ఉగాదికి అంబ "పుట్టింటివారు" వచ్చి అంబకు ఉత్సవాలు జరిపి వెళ్తారు. ఇట్లా ప్రతి సంవత్సరము ఇప్పటికికూడా జరుగుతుంది. శివునికి జరుగుతుంటే చూసి పార్వతి ఓర్వలేక అలిగి తనుకూడ పూజలు జరిపించుకున్నది. అందుకనే స్త్రీలు ఓర్వలేనివారు అని అంటారు. ఈ సంగతి నేను అంటున్నానని కోప్పడేరుసుమండి. ఉన్నసంగతి వ్రాసేను.

టి. రమాదేవి.

(మార్కాపురం)

# పోగులు తీసికుట్టే డిజైన్లు

పోగులు బాగా లెక్కపెట్టడానికి వీలుగా ఉండేబట్ట దీనికివాడాలి. డి. ఎమ్. సి. రంగుదారము మీకునచ్చిన రంగులోది ఒంటి పోగు సన్నసూదికి ఎక్కించుకోవాలి. కుట్టుఅంతా రెండుపోగులువదులుతూ రెండు పోగులు సూదిమీదకు ఎక్కించుకుంటూ రావాలి. కుట్టు అంతా బట్ట తిరగేసి కుట్టాలి. సూది క్రిందనుంచిపైకి, పైనుంచిక్రిందకూ కుట్టుకోవాలి. ఎక్కడ ఆపనక్కరలేదు. బోర్డర్, మొదటివరసకు ఆరుపోగులు. వీటికి మధ్యవదిలిన ఆరుదూ రెండవవరుస, మూడవ వరుస, రెండవ వరుసమధ్య నాలుగు. అట్లాగే నాలుగవవరుస మూడవవరుసనిమధ్య మూడు. అయిదవ వరుస నాలుగవవరుసమధ్య రెండు. దీనితో ఒకదిమ్మ పూర్తిఅవుతుంది.

రెండవదిమ్మ మొదటిదిమ్మ చివర రెండు లోను మధ్యది ముందర సూది మీ దకు ఎక్కుతూ ఆరు పైకి ఎక్కించుకోవాలి. అట్లాగే మొదటిదిమ్మలాగేవేస్తూ ఎనిమిది దిమ్మలు పూర్తిగావెయ్యాలి. ఎనిమిదవ దిమ్మ చివర రెండుకు ఇటూ, అటూ ప్రతీ లైను పెంచుతూ, మూడు, నాలుగు, అయిదు, ఆరు వెయ్యాలి. ఇది ఎదురుబదురుగారావాలి. రెండవబొమ్మ జాగ్రత్తగా పరిశీలించి చూడవలెను. క్రిందకు అటాగే ఎనిమిది దిమ్మలు దిగవలెను. క్రింద డైమను ఏర్పడుతుంది. బోర్డర్ లో చూడవలెను. ఇట్లా వంకీలవలె



# పోగులుతీసి కుట్టే డిజైను

కుదురుగా మనకు కావలసినంత మేర నింప వలెను.

ఈ అర్చిలలోని పువ్వులు, మూడవబొమ్మ పువ్వు. పువ్వులోని మధ్యనుంచి మొదలు పెట్టి సగం పూర్తిఆయాక మిగిలిన సగం నింపాలి. మొదటి మధ్యవరుస పదునాలుగు. రెండవవరుస పదమూడు. మూడవ వరుస పన్నెండు. నాలుగవవరుస మొదటిపోగులు



వదిలి మూడు ఎక్కించుకుని, మళ్ళీ ఒకటి వదిలి, ఒకటి ఎక్కించుకుని, మళ్ళీ ఒకటి వదిలి మూడు ఎక్కించుకోవాలి. అయిదవ వరుస. నాలుగవ వరుస ముందుఅపోగులు ఎక్కించు కుంటూ మూడు, ఒకటివదిలి మధ్య రెండు, మళ్లీ ఒకటివదిలి మూడుతో పూర్తిఅవుతుంది. ఆరవ వరుస. ఇట్లాగే పెంచుకూ మూడు ఒకటివదిలి మూడు, ఒకటి వదిలి మూడుతో పూర్తిఅవుతుంది. ఏడవ వరుస అట్లాగే పెంచుతూ మూడు ఒకటివదిలి నాలుగు, ఒకటి వదిలి మూడుతో పూర్తిఅవుతుంది. ఎనిమిదవ వరుస మధ్య నాలుగుకు అటు ఇటూ పెరుగుతూ అయిదు. తొమ్మిదవ వరుస ఆరు. పదియవ వరుస ఏడు. పదకొండవ వరుస ఎనిమిది. పన్నెండవవరుసనుంచీ ఒకొక్కటి ఒకొక్క వరుసకు తగ్గిస్తూ ఒకటితో పూర్తి చెయ్యాలి. ఇక్కడ డిజైను ఆకారము ఏర్పడుతుంది. ఇక్కడకు సగంపువ్వు పూర్తయినట్లేను.

ఇట్లాగే అవతలిసగం పువ్వు నింపాలి. దారం తెంపకుండా మధ్యవరుస పదునాలుగుకు ప్రక్క వరుస ఎత్తుకోవాలి. పువ్వు పూర్తిగాకుట్టాక దారం చిన్నముడివేసి తెంపాలి. దారపుపోగు కొంచెం పెద్దదిగానే మూడినీదకు మొదట్లో తీసుకోవాలి. మధ్యలో ముడులకు వీలుండదు. ప్రతీ అర్చికి క్రింద, పైన ఒకొక్కపువ్వు చొప్పున నింపాలి. దానితో బోర్డర్ పూర్తిఅవుతుంది. నాలుగవ బొమ్మలోని పువ్వుకూడా స్వల్ప భేదాలతో ఈరకమేను. జాగ్రత్తగా పరిశీలిస్తూ కుట్టండి. అర్చిలు పువ్వులు ఒకేరంగు దారముకాని, రెండురకముల దారములు కాని వాడవచ్చు. ఓర్పుతో చెయ్యాలి. దారం



"పాప చేతుల్లో పాప"

ఫొటో పంపినవారు: —కమలకుమార్, కర్నూలు.

తక్కువ వసూలుతుంది. క్రమఅధికం. అందం ఆనందం ఎక్కువ. తప్పక ప్రయత్నించి చూడండి. ★

గోటేటి కమలాదేవి,
(విజయనగరము.)

# మామ్మగారి అనుభవాలు;

(36 వ పేజీ తరువాయి)

ఎక్కడో కాగా జరుగుతాటుంటే ఇళ్లలో—ముఖ్యంగా దాపదాపీలు—లక్షలకు లక్షలు డబ్బుండేవాళ్ళ ఇళ్లలో నేమోగానీ మామూలుగా మధ్యతరగతి మహిళ లెవ్వరూ కూడా ఎంత చదువుకున్నా తొమ్మిది, పదిదాకా నిద్రపోవటంలేదు. స్కూలుకుపొయ్యే పిల్లలూ, ఆఫీసుకు వెళ్ళిపోయే భర్తలూ వుంటే మరి తొమ్మిది పది గంటలకు నిద్రలేస్తే ఆ గృహిణి ఏంచెయ్య గలుగుతుంది చెప్పండి?

చదువుకుంటున్నందుకు ఆ చదువును సార్థకంచేస్తూ, సాధ్యమైనంతవరకు అవతలి వాళ్ళ కష్టసుఖాల్ని కనిపెట్టే ప్రవర్తిస్తున్న నేటి మాబోటివాళ్ళందర్నీ ఒక్కసారిగా రకరకాలైన అభాండాలలో అలాడించడం ఏంబాగులేదు. ఎక్కడో ఒక్కచోట చెడ్డ వాళ్ళు, గయ్యాళులు, ఆ కాలంలో, ఈ కాలంలోకూడా వున్నారు. అంతేగాని కేవలం నేటి నవనాగరికులే చెడ్డవాళ్లనటం చాలా అన్యాయం.

అంతేగాదు. శారీరికంగా శక్తిలేని ఈరోజుల్లో మామ్మగారిలాటి వాళ్లను కొలబద్దలుగా పెట్టుకుంటే విముఖంలో హాకీ మంటాం. ఆ కాలానికి తగట్టు వాళ్ళు ప్రవర్తిస్తే—ఈ కాలానికి అనుగుణంగా మనం నడుస్తున్నాం. అంతేగాని, విడాకుల చట్టాలొచ్చాయని పది పెళ్ళిళ్ళు చేసు కోడం ఆ తర్వాత ఆరడిపడలేక వేరు కాపురాలు పెట్టడం (ఈ కాలంలో ఎక్కువ మంది చిన్న చిన్న ఉద్యోగస్తులు కాబట్టి వేరేచోట వుండటం తప్పనిసరి) లాటివి ఎక్కడోతప్ప వినటంలేదు.

మామ్మగారి వయస్సులో మూడోవంతు లేకున్నా, ధైర్యంచేసి ఇలా నిర్మొహమాటంగా వ్రాశానని మామ్మగారిలాటి పెద్ద వాళ్ళందర్నీ కోప్పడొద్దని మరీ మరీ కోరుతున్నాను. ★

# ★ వంటలు ★

ఇడ్లీన్ని రకరకాలుగా చేస్తారు. సగుబియ్యంతోను, టెంకాయతోను, సేమియాతోను మామూలు మినపప్పు (ఉద్దిపప్పు) తోను పెడుతారు. సేమియా ఇడ్లీ చాలా బావుంటుంది. సగుబియ్యం ఇడ్లీ కమ్మంగా ఉంటుంది.

## సగ్గుబియ్యం ఇడ్లీ

మధ్యాహ్నానికి టిఫినుకయితే, నూకవి పట్టే సగుబియ్యం పుల్లటి పెరుగులో నానవెయ్యాలి. బియ్యపు నూకని పురుగులు అవీ లేకుండా చూసి పెట్టుకోవాలి. బియ్యం నానవేసి (కొంచెంసేపు) ఎండపెట్టి మినుము సైతం రవ్వనూక చాలా బాగుంటుంది. ఇడ్లీలకు కలిపిపెట్టిన మిశ్రమానికి సరియైన ఉప్పు వేసి ఇడ్లీ పాత్రలలో పొయ్యాలి. వేడిమీద సగుబియ్యం ఇడ్లీ చాలా బావుంటుంది. సగుబియ్యం పెరుగులో అరగంట నానితే చాలు. బియ్యపు నూక పోసి ఉప్పు వేసి బాగాకలియపెట్టి మూతపెట్టాలి,

## సేమియా ఇడ్లీ

సేమియా ఇడ్లీకి పుల్లటి పెరుగు వుంటే చాలా బావుంటుంది. అలాగని ఏనాలుగోజులకో కాదు. అప్పటికప్పుడు కలుపుకొని ఇడ్లీ పెట్టాలి. ఒకవాయకు సరిపోయేంతనూక సేమియా పెరుగులో కలిపి తగిన ఉప్పువేసి ఆవాలు, మిరపకాయలు తాళింపు చేసి వేసి పోసుకోవాలి. వాయ వాయకూ ఇలాగే చెయ్యాలి. లేకా సేమియా పులుపు లేకుండా పోతుంది.

## టెంకాయ ఇడ్లీ

మామూలు ఇడ్లీలకుమల్లే ఉద్దిపప్పు, బియ్యం రుబ్బుకొన్నా సరే, లేదా బియ్యపు నూక పుల్లటిపెరుగులో కలిపి ఉప్పు వేసి కలియపెట్టాలి. టెంకాయ కోరుకొని అలాగే వెయ్యవచ్చు. లేదా రుబ్బివెయ్యవచ్చు. మామూలు ఇడ్లీలలా పెట్టుకోవాలి.

## ఆవిరి వుండలు

ఈ ఫలహారం అమ్మమ్మలు రాత్రిపూట ఫలహారంగా చేసుకోవచ్చు. మిరియాలు, జీలకఱ్ఱ వుంటుంది కాబట్టి సులభంగా జీర్ణం అవుతుంది. మనకు కావల్సినంత నూకని తీసుకొని నూక ఒక గిద్దడయితే ఒకటిన్నర గిద్దడు నీరు పోయాలి. తెర్లుతున్న నీళ్ళల్లో తగినంత ఉప్పు, జీలకఱ్ఱ, మిరియాలు టెంకాయ ఇష్టమున్నవారు కోరివేసి బియ్యపు నూక పోసి గట్టిపడేంతర్వాత దించుకోవాలి. ఈ పిండి పుడికిపుడకనట్లుంటుంది. తర్వాత కోడిగుడ్డు ఆకారంలో మన పిడికెడికి పట్టినంతవుండలు చేసి ఆవిరిలో పెట్టాలి. చిన్నపిల్లలు తిన్నా ఏంచెయ్యదు. ఆవాలు పోపు పెట్టుకొన్నా పెట్టుకోవచ్చు.

పులుసు వుండలు:—నాలురకాలపప్పులు తెచ్చి రవం బాగుచేసుకుని మిగిలిన నూకతో ఈ పులుసు వుండలు చేయవచ్చు. ఉద్దిపప్పు, పెసరపప్పు, కందిపప్పు, సెనగపప్పు, ఈ నాలు పప్పుల నూకనీ బాగా రాయి లేకుండ నాలించివేసి తగ్గ మిరపకాయలు, ఉప్పు, ఓ టెంకాయచెబ్బ కోరువేసి బాగా రుబ్బాలి. కొందరికి పప్పులు పప్పులుగా ఉంటే ఇష్టం. కొందరికి మెత్తగా వుండాలి. ఈ రుబ్బిన పిండిని కొద్దిగా బాణట్లో నూనెవేసి ఆవాలు పోపుపెట్టి, అందులో వేసి ఓ ఐదు నిమిషాలు ఉంచాలి. పిండి గట్టిగా వస్తుంది. అప్పుడు ఓ పళ్ళెంలో కుమ్మరించి, చిన్న చిన్న వుండలుగా చేసి ఆవిరిలో పెట్టాలి. ఈ పులుసుకు పాళ్ళమయినంతవరకూ మజ్జిగ పులుసు వుండాలి. మరీ నీళ్ళుగా కాక, మరీ గట్టిగా కాక సమపాళంలో మజ్జిగ తీసుకొని (ఇష్టమున్నవారు పచ్చి మిరపకాయలు) సెనగపప్పు (తగినంత ఉప్పు) కొంచెం కొబ్బరికోరు, ధనియాలు ముందే నీళ్ళలో నానవేసి మెత్తగ రుబ్బుకొని మజ్జిగలో కలపాలి. కాస్త పసుపు పొడివేసి ఓ పొంగు వచ్చేదాకా చిన్న సెగమీద పెట్టి దించెయ్యాలి. ఈ పులుసు తెర్లకూడదు. తెర్లితే మజ్జిగ విరిగిపోతుంది. తరువాత ఆ ఆవిరి వుండలు ఈ పులుసులో వేయాలి. చాలా బావుంటుంది.

-ఎస్. కె. రాజేశ్వరి, నిడుబ్రోలు.

* * *

## కోవా కజ్జికాయలు

కావలసిన సామాను: ఒక సేరు చిక్కని పాలు, రెండు కొబ్బరికాయలు, అర్ధ శేరు బెల్లం, ఏలకులు.

చేయు విధము : కొబ్బరికాయలు రెండు తురుముకొని వుంచుకోవాలి. బెల్లం ఇసక లేనిది తెచ్చుకోవలెను. బెల్లం మెత్తగా తరుక్కొని తురిమిన కొబ్బరి, బెల్లము రెండూ ఒక స్టీలుగిన్నెలో కానీ కళాయి గిన్నెలో కానీ కలిపి కుంపటిమీద పెట్టి అడుగంటకుండా గరిటెతో కలుపుతుండవలెను అంటే ముందు కొబ్బరి లస్కోరా తయారుచేయాలన్నమాట. ముదురుపాకం వచ్చి ఉండకట్టేటుగా వున్నప్పుడు దింపి ఏలకు పొడివేసి



“చల్ చల్ గుర్రం”
ఫోటోపంపినవారు: కె. సోమసుందరరావు, వాల్తేరు.

మూతపెట్టాలి. కొంచెం సేపయినాక నిమ్మకాయంత సైజులో ఉండలుకట్టి ఒక పక్క పెట్టుకోవలెను.

తరువాత పాలు ఒక కళాయి గిన్నెలో పోసి తోరక కట్టకుండా తిప్పుతూ వుండవలెను. ఈ కోవాలో పంచదార వేయ నవసరము లేదు. కోవామాత్రము కొంచెం ఓపికతో తగిన పదునులో చేయవలెను. కోవా తయారయినాక గిన్నె క్రిందికి దించి వేడిమీద, చేతికి నేయి రాసుకొని పెద్ద వుసిరికాయంత కోవా ముద్ద తీసుకుని అరచేతిలో పల్చగా వొత్తి మధ్యన కొబ్బరివుండ పెట్టి కోడిగుడ్డు ఆకారములో ఉండకట్టేయవలెను. ఈ విధముగా కోవాతో కజ్జికాయలు చేయవలెను. ఇవి తింటానికి రుచిగాను చూచుటకు ఇంపుగాను వుంటాయి. చేస్తారు కదూ!

## కొబ్బరి కజ్జికాయలు

ఇవి చేయటం చాలా సులభం. అట్టే శ్రమపడ నవసరము లేదు. కోవా కజ్జికాయలో పెట్టిన కొబ్బరివుండలు మాదిరి ముందుగా కొబ్బరి వుండలు చేసుకోవలెను. అర్ధశేరు పంచదార కాటుకలా దంచుకోవలెను. దంచిన పంచదారలో రెండు స్పూనుల పాలు పోసి మెత్తగా పిసికి వుసిరికాయంత ఉండ చేసి అరచేతి మధ్య పెట్టి దాని మధ్యన కొబ్బరి వుండ పెట్టి వుండకట్టవలెను. ఇది కొద్దిసేపటిలో గట్టిపడి తింటానికి రుచిగా వుంటాయి.

భారతుల జయలక్ష్మి ★
(నాగార్జునసాగర్ డాము)

# పాండ్స్

## డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం

**మిమ్మల్ని రోజంతా హాయిగా మరియు సువాసన వెదజల్లుతూ ఉంచుటలో సాటిలేనిది**

ఉత్సాహాన్నిచ్చే. పరిమళభరితం పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరు వాడితే తీక్ష్ణమైన ఎండలో చికాకు కలిగించే వాతావరణములో కూడ మీకు చల్లగా, హాయిగా ఉంటుంది. ఈ మెత్తని పౌడరును ఒళ్లంతా రాసుకొంటే చెమట వలన కలిగే చికాకు లేకుండా మీరు రోజంతా ఉత్సాహముగా మరియు హాయిగా ఉంటారు. రోజంతా హాయిగా ఉండుటకు ఎల్లప్పుడూ పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరునే వాడండి

చిస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో. యు.ఎస్. అమెరికాలో సంస్థాపితము)



# వనితా వాణి



## "ధైర్యం కావాలి"

కుటుంబములో ఏవిధమైన లోపాలూ లేకపోయినా, కోపం, రోషం త్యజించలేక కూడా ఆత్మహత్యలు చేసుకున్న అబలలు ఉన్నారు.

కొన్ని సంవత్సరముల క్రిందట జరిగిన ఒక వనితగాథ చెబుతున్నాను. అత్తమామలు ఏ లోపమూ లేకుండా చూచుకునేవారు. భర్త ప్రేమానురాగములలో లోపములేదు. అతనికి గవర్నమెంటులో మంచి ఉద్యోగం. ముద్దులు మూటగట్టు ముగ్గురు బిడ్డలు. ఆఖరు బిడ్డకు నెలా పదిహేను రోజుల వయస్సు. పుట్టినింటివారు, అత్తను, భర్తను, నిరాదరించినందుకు మనస్సు వికలము జెంది తిరిగి అత్తవారింట కాపురము ఎట్లా చేయగలననే భీతితో ఆమె ఆత్మహత్య చేసుకున్నది. పరిస్థితిని ధైర్యంతో ఎదుర్కొనవలెనేగాని, కన్నబిడ్డలకు కన్నవారికి దూరమై చచ్చి సాధించేదవర్ని? భర్తకు భార్య, అత్తకు కోడలు వస్తుంది. తన బిడ్డలకు తల్లిమాత్రము రాదు. సామాన్య కుటుంబాలలో స్త్రీలు కొద్దికొద్ది కలహాలను అప్పుడప్పుడు ఎదుర్కొనవలసి వస్తుంటుంది. వాటిని ధైర్య సాహసాలతో సమర్థించుకోవలెనేగాని ఇటి అఘాయిత్యాలు చేయరాదు.

పురుషులతోపాటు సమాన హక్కులను కోరుతున్న ఈ రోజులలో స్త్రీలు ధైర్య సాహసాలతో కష్టాలను ఎదుర్కొవాలే గాని అబలలు అనే పేరును సార్థకం చేసుకొనరాదు.

—వి. సుందరి, విజయవాడ.]

* * *

## 'నేనింక కాలేజీకి పోనమ్మా!'

వ్యాసంలో నిజం నూరుపాళ్లూ వుంది. ఆ విషయంమీద నేనే వ్రాద్దామనుకున్నా. నిజాన్ని బి. ప్రేమలీలగారు చక్కగా నిర్భయంగా విడమర్చి చెప్పారు. భయపడి అసలు విషయాల్ని మరుగు పరిస్తే మనకే నష్టంగదా? ఆమె చెప్పినట్లుగానే ఈ మధ్య ఇక్కడకూడా జరిగాయి చాలా.

వి. లలితగారు అన్నట్లు ఒకరిని ఒకరు నిందించుకోక ఏదైనా ఒక ముఖ్యమైన విషయాన్ని తెల్సుకోవాలని యత్నించి విజయాన్ని పొందినప్పుడే మన వనితాలోకం కీర్తికి ఉపయోగం. ముఖ్యంగా కాలేజీ యువతులకు, యువకులకు ఒకయూనిఫారం తప్పక అవసరం. ఎందుకనగా ప్రతి యువకుడూ తనని చూసి స్త్రీలు గొప్పవాడు అనుకోవాలని ఇంటి దగ్గర ఎన్ని తిట్లయినా సరే తిని పులెన్ సూట్లు కుట్టించుకొని మురుస్తాడు. ప్రతీ కాలేజీలో యూనిఫారం వుండాలి. అప్పుడే యీ విషయాలకు స్వస్తి చెప్పవచ్చు. మనమంతా కలసి దీన్ని సాధిస్తే ఎవరెస్టు శిఖరం ఎక్కినంత.

—కే. రాధ, కాకినాడ]

* * *

## వ్యక్తిత్వ శీలాలకు మచ్చ కారాదు

"నేనింక కాలేజీకి పోనమ్మా" అన్న బి. ప్రేమలీలగారి వ్యాసం చాల బాగుంది. ఈ నవ నాగరిక ప్రపంచంలో కాలేజీ అమ్మాయిలు తాము కాలేజీకి వెడుతున్న దెందుకో మరచి, కాలేజీలను ఫ్యాషన్ సెంటర్సుగా చూస్తున్నారనడం సత్యదూరము గాదు. ఇది అందరిపట్ల వర్తించకపోయినా, చాలమంది విద్యార్థినులకు వర్తించగలదు. నిరాడంబరముగా కనిపించినంత మాత్రాన విద్యార్థులు పూరుకొంటున్నారా అనేది వేరే ప్రశ్న. కాని ఒక స్త్రీకి సంఘంలో గౌరవం ఆమె వస్త్రాలంకరణమీద ఆధారపడి వుంటుందనుట సత్యము. అలంకరణ తప్పుగాదు గాని, అది వ్యక్తిత్వ శీలములకు మచ్చ దెచ్చేదిగ మాత్రం ఉండకూడదు. తల్లులు తమ కుమార్తెల వస్త్రధారణపై తగినంత శ్రద్ధ వహించుట అవుసరము. కనుక మన విద్యార్థినులు నిరాడంబరముగ ఆదర్శ విద్యార్థినులుగా వెలిగి మంచి గౌరవం సంపాదిస్తారని ఆశిస్తున్నాను. రచయిత్రి బి. ప్రేమలీల గారికి నా హృదయపూర్వక అభినందనములు.

—మిసెస్ "ప్రేమబాల", కొవ్వూరు]

* * *

## ఉలుకెందుకు?

12-3-58 సంచికలో బి. ప్రేమలీలగారు వ్రాసిన వ్యాసము చాలా బాగున్నది. వీరు నేటి కాలేజి విద్యార్థినుల అలంకరణలోని కొన్ని లోపాలను బాగుగ విడమర్చి చెప్పగలిగారు. వారికి నా అభినందనములు. కాని కొంతమంది విద్యార్థినులు అనగా ప్రేమలీలగారి చెల్లెలు లాంటి వారు ఈ వ్యాసము చదివి కోపగించుకోవచ్చు. "ఉన్నమాటంటె ఉలుకెందుకు?" అని మన పెద్దలు ఊరికే అన్నారా? కోపముతో గాక శాంతచిత్తతో చదివిన వ్యాసములోని భావము గోచరించగలదు. ఇకముందు గూడా ఇటువంటి వ్యాసములనే వ్రాయుటకు ప్రయత్నించవలెనని నేను బి. ప్రేమలీలగారిని కోరుతున్నా. నాకు ఈ వ్యాసము చదువునప్పుడు కోపము రాలేదు; ఆమె వ్రాసినదంతా నిజమే అనిపించినది. ఇంతకీ ఇది ఎందుకు చెపుతున్నానంటె నేనూ ఒక కాలేజి విద్యార్థినే. కాలేజి విద్యార్థినులకు నాపై కోపము రావచ్చునుగాని తమలో తప్పులున్నపుడు ఆ తప్పులున్నట్లు ఒప్పుకొనుటవలన వారికే లాభదాయకమని గుర్తించవలెను.

—కె. గిరిజాదేవి, బళ్ళారి]

* * *

## అత్తలేని సంబంధం!

మార్చి 5 వారపత్రికలో పి. సీతాదేవి గారు వ్రాసిన "చూడమ్మ తలకు మూచన" చాల బాగుంది. ఆమె వ్రాసినట్లు పుచ్చకాయ దొంగ అంటే భుజాలు తడుముకున్నవారీ ప్రపంచంలో ఎంతో మంది వున్నారు. నిజం చెప్పాలంటే, అందులో మన స్త్రీలే ఎక్కువ. ఆ మధ్య, మా చిన్న మరదలు "అత్తలూ, కోడళ్లూ" అనే శీర్షికను విమర్శిస్తూ "మా ఊరిలో ఒకమ్మాయి ఉంది. ఆమెకు అత్తలేని సంబంధమే కావాలట! అందుకని ఆమె తల్లిదండ్రులు అత్తలేని సంబంధము కోసం తెగవెతుకుతున్నారు" అని వ్రాసింది. ఇక చూసుకోండి! ఆ వారం పత్రిక ఊరువచ్చిన దగ్గరనుండి ఇద్దరు ముగ్గురమ్మాయిలు మా ఇంటికివచ్చి, నానా మాటలూ అనడం మొదలెట్టారు.! అందులో ఒకమ్మాయి ఆ వ్యాసం తనమీదే వ్రాశామని,

(48- వ పేజీ చూడండి)

# నడక
(35-వ పేజీ తరువాయి)

అయిష్టంగా వుంటుంది. అందువలన కేవలం బొమ్మలని రెచ్చగొట్టడంకోసం అని వంకర నడకలు అలవాటుచేసుకున్న వాళ్లని నే నెఱుగుదును. కానీ అలాంటి చిన్నచిన్న విషయాలపైనే మన అందచందాల రాణింపు ఆధారపడివుందని మాత్రం మనం గుర్తించలేం! ఎంతైనా మనం పట్టినకుందేటికి మూడు కాళ్ళంటే దబ్బినా ఎక్కువ వుండకూడదుగదా!

## 'మా బొమ్మ చూస్తే'

నడక ఆడవారికే ముఖ్యంకాదు. మొగాళ్ళకిగూడా అవసరమే. ఆమధ్య అన్నయ్య తలవంచుకొని ఈడిగిలపడి నడుస్తుంటం గమనించి బొమ్మ వాడి నెత్తిన ఓనీటిబిందెవుంచి దాన్ని పట్టుకొని యింట్లోనే ఆమూలనుండి ఈమూలకు ఓపదిహేనురోజులపాటు రోజూ 10నిముషాలునడిపించింది. అన్నయ్య డిగ్నిటీకి అది మొదట లోపమనిపించింది కానీ బొమ్మ ఒక్కరోజు ఉపవాసంలో డిగ్నిటీని వట్టిల్లో కలిపి అందుకొప్పుకున్నాడు. ఇప్పటికీ అన్నయ్య బొమ్మ ఎదటపడి నడవాలంటే భయపడతాడు. ఎక్కడ వంకలుపెట్టి నీటిబింద నెత్తికెత్తుతుందోనని!

మొగవారిలోకూడా ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నదాన్ని వెతుక్కుంటున్నట్లు ముందుకువంగి నడిచేవారు చాలామంది వున్నారు. కొందరు నడుస్తూంవుంటే గంతులు వేస్తున్నట్లు తమాషాగా వుంటుంది చూడ్డానికి. ఇంకొందరు తూర్పుకోకాలూ పడమటికోకాలూ విసిరేసి తమకేమీ పట్టనట్లు నడుస్తూంటారు. ఈలాంటివారిని బొమ్మలాటివారు చూశారంటే మొహం వాచేలా చివాట్లేసితీరతారు.

ముఖ్యంగా చదువుకునే అమ్మాయిలు- అందులో కాలేజీ అమ్మాయిలు మూపులను ఒంటెమూపుల్లా అష్టవంకర్లూ తిప్పి నడుస్తూ వుంటారు. స్త్రీకి సిగ్గు అందం. నమ్రత, వందనం వ్యక్తపరచాలంటే నడుములు వంచుకు తిరక్క తప్పదు అనుకోవచ్చు. కానీ నడుములు వంకరపోయేలా సిగ్గుపడిపోవటం బావుండదు. అంతగా సిగ్గును వ్యక్తపరచాలంటే తల కాస్త వాల్చుకొని నడిస్తే చాలు. భారతదేశపు పూర్వాచారాల్ని యింకా పోషించే పల్లెపట్టుల్లోని పల్లెపడుచుల నడకల్ని గమనించితే నడకలో ఎంత అందం వుందో ప్రత్యక్షంగా గుర్తించవచ్చు. నీటి కడవ తలమీదుంచుకొని నడిచే పల్లెపడుచును గానీ-గడ్డిమోపును తలపై వేసుకునివచ్చే అమ్మాయి నడకల్ని గానీ చూడండి. అందులో సహజత్వం విశిష్టత మీకే అంతు పట్టుతుంది.

## డాన్సింగ్

కాలేజీలలో స్కూళ్ళలో అడపాతడపా డాన్సింగ్ ప్రదర్శించేవారు నడుస్తున్నా డాన్సు చేస్తున్నట్టే వూగుతూ నడుస్తుంటారు. డాన్సుచేస్తున్నప్పుడైతే అది అందంగా కనిపించవచ్చుగానీ మామూలు నడకల్లోగూడా డాన్సింగ్ అనుకరిస్తే అందంగా కాకుగదా- ఎబ్బెట్టుగావుంటుంది. మద్యం తాగిమతి మరచి నడిచేమనిషి జ్ఞాపకంవస్తాడు అప్పుడు.

మామూలుగా పల్లెటూరివారిని చూడండి. వారికి పట్టణాల్లో నగరాల్లో నివసించేవారి కంటే వినయం వందనం, వంటి విషయాల్లో పట్టింపులెక్కువ. అయినా సిగ్గు పేరిట ఎప్పుడూ నడుములు వంచి నడవటముంటూ వుండదు. ముసలమ్మలైనాసరే నడుములు చక్కావుంచుకు నడవాలనే ప్రయత్నిస్తారు. వారు మామూలుగా తలపైన కాస్త చెఱగు వేసుకుంటారు. బావినుండి నీరు తెచ్చుకునేప్పుడైతే ఆ చెఱగునుకూడా చుట్టచుట్టుకు తల మీద పెట్టుకొని ఆ చుట్టపైన కడవ ఉంచుకొని వస్తారు. అలాంటప్పుడు వారికి సిగ్గులేదని మనమనుకోవాలి? వుంది. కానీ ఏఏ వేళల్లో సిగ్గుపడాలో ఎప్పుడు సిగ్గును సింగారించుకోవాలో వారికి తెలుసు. అంచేత సిగ్గు వారి నడకకేమీ యిబ్బంది కలిగించదు. సిగ్గు స్త్రీకి సింగారమైనంత మాత్రాన నడుములు వంచుకు గూని తెచ్చుకు తిరగటం ఏనాటికీ 'కల్చర్' అనిపించుకోదు.

వీపువంచుకుతిరిగే జంతువు కోతి. వీపును వంచకుండా వెన్నెముకను నిలబెట్టుకుతిరిగే జంతువు మానవుడొక్కడే - అన్నాడు డార్విన్. ప్రస్తుతం కొందరి నడకల్ని గమనిస్తూవుంటే మానవులు తిరిగి కోతుల్లో కలవటానికి అట్టేకాలం పట్టదనిపిస్తోంది.

మనం నడుములువంచుకు నడిస్తే, మరుగుజ్జులా, ఎబ్బెట్టుగా కనబడతాం. మనిషన్నతర్వాత ఒడ్డూ, పొడుగూ వుండాలి. మానవుడు గంభీరంగా కనిపించాలంటే అనుక్షణం తన ఒడ్డూ పొడుగుల్ని వ్యక్తంచేస్తూ వుండాలి. అది ఓ అందం ఓ అలంకారం. తలెత్తిమాస్తే ఏవిటో కొంప మునిగిపోయేలా నడుములు దించుకొని నడిచేవారినిచూస్తే ఎవరికైనా చిరాకు వేస్తుంది. సహజమైన నడక నేర్చుకోవటం కోసం అలాంటివారు అట్టే కష్టపడనక్కర్లేదు. లేకుంటే మా బొమ్మ అన్నయ్యచేత చేయించిన ఎక్సర్సైజు ఓ రెండువారాలపాటు చేస్తేసరి. కొన్నాళ్ళకి బాగానడవటం అదంతటదే చేతనవుతుంది.

ఓవిషయం జ్ఞాపకముంచుకోండి. నడక అనేది ఓకళ. మనిషి నడకనుబట్టి మనం ఆ మనిషినిగురించి కొన్ని ఊహించుకోవచ్చు. అందం, చందం చదువూ వినయంతోపాటూ వాణ్యమైన నడకగూడా ఎంతైనా అవసరం!

వాణ్యంగా నాజూగ్గా నడవటమంటే కావ్యనాయికల్లా హంసల్లా నడవాలని కాదు. మరీగంభీరంగా సింహాల్లా అడుగులేసి అడుగెయ్యాలనీ కాదు. నిటారుగా రొమ్ము విరచుకొని గజం బద్దలు మింగినవాడిలా నడవటం కాదు. వీపును వంచకుండా కాళ్ళను విసిరెయ్యకుండా గంతులేయకుండా మామూలుగా నడిస్తే చాలు. అందులోనే అందం వుంది. ఆకర్షణావుంది.— ★




# గర్వం

అనగనగా ఒకరాజు;
ఆ రాజుకు ఒక తనూజు
డుండె నతడు చాల బుద్ధి
మంతుడనే ఘన ప్రసిద్ధి
గాంచియుంటచే రాజూ
ఏటేటా ఒక రోజూ
పెద్ద సభను గావించీ,
పండితులను రావించీ,
వారి విద్య పరీక్షించ
గాను పుత్రు నియమించ,
రాకొమరుడు గర్వించి,
వారినెల్ల ఈసడించి
నిజములైనవారిమాట
లెల్ల గూడ తాను బూట
కంబు చేతునంచు పల్క,
వానిమాట కెదురుపల్క
భయముచెంది వా రందరు
ప్రతి యేమీ చెప్పకుండ్రు.

ఇటు లుండగ ఒక్కనాడు
సభకువచ్చి జ్యోతిష్కుడు
"ఓ రాజా! తదియనాడు
నీమీదికి తురకరేడు
దాడివచ్చి నీదురాజ్య
మెల్ల దోచు"ననగ, ఆజ్య
మోసినట్టి వీతిహోత్రు
వోలెమండి రాజపుత్రు
"ఏమేమీ ముసలివాడ!
నీదు పల్కులెల్లగూడ
కల్లగాదె, మమ్ముగొట్ట
వా డేమని పెద్ద దిట్ట?
చాలు చాలు నీ జోస్యం;
సాగించక నీ హాస్యం
పోపో"మ్మని కసిరికొట్టె
పూజ్యుడైన అతని తిట్టె.

కొడుకుమీద వున్నట్టి
కూర్మిచేత తానట్టి
మాటలాడలేదు రేడు,
ముదుసలి ఇట్లనినాడు:

"ఫలభారముచేత చెట్లు
పుడమికి తావంగినట్లు
బుద్ధిమంతులైనవారు
వినయనమ్రులవుతారు.
నేను చెప్పినట్టి మాట
నిక్కమౌ వరాలమూట.
వింటావా అది మంచి
వినకున్నా మరీ మంచి,
నాకే"మని వెడలినాడు.

ఆపిమ్మట తదియనాడు
తురకరేనిదండు వచ్చి
కరకుతనముచేసిపుచ్చి
రాజ్యమెల్ల దోచివేసె,
రుద్రభూమి చేసివేసె.

గర్వముచే, పెద్దవారు
చెప్పినదీ విననివారు
బుద్ధిమంతు లయ్యును తుది
చెడిపోవుట తథ్యము సుమి!

★

చర్ల లక్ష్మీనారాయణ

# జ్వరదేవత

ఒక రోజున జ్వరదేవత విహారానికి బయలుదేరింది. బయలుదేరి ఒక్కొక్కరినే వెదుక్కుంటూ పోతోంది. పోగాపోగా ఒక పొలంలో కండలు తిరిగి, దుక్కలా ఉన్న ఒక నల్లటి రైతు కనబడ్డాడు. అప్పుడే సుష్టుగా చల్ది భోజనంచేసి పొలం దున్నుకొంటున్నాడు. జ్వరదేవత చాలసేపు కూర్చొని ఆలోచించింది. చివరకు "దుక్కలా ఉన్నాడు; బావుంది. ఇతని దగ్గర కొన్నాళ్ళుంటే బాగా పీడించవచ్చు. సుఖంగా ఉంటుంది," అనుకొంది.

సూర్యభగవానుడు నడినెత్తికెక్కాడు. అందుచేత రైతు ఇంటికి పోదామని కంప పోగుజేసి నాగలికి కట్టుకొన్నాడు. కట్టాడో లేదో వెంటనే జ్వరదేవత అతన్నావహించింది. ఒళ్లు తెలియక అతడా కంప మీద కూలాడు. అలవాటుప్రకారం ఎడ్లు ఇంటిముఖం పట్టాయి. అసలే శరీరం సలసల కాలిపోతోంది. దానికి తోడు ఎండొకటి. కంపమీద పడుకొన్న మూలాన ముళ్లు గుచ్చుకొంటున్నాయి. ఎడ్లు బరబరా ఈడ్చుకుపోతున్నాయి. అయినాసరే, రైతు కేమీ తెలియలేదు.

జ్వరదేవత రైతుకు కలుగుతున్న ఈ బాధలన్నీ భరించలేకపోయింది. చీదరించుకొంది. "ఈ రైతు దగ్గరుంటే ఎలాగైనా కష్టాలనుభవించా"లని, భయపడింది. ఎడ్లు రైతుతో ఇంటిని సమీపించాయి. జ్వరదేవత అతన్ని వదిలేసి, మరో సుఖమైన చోటికి పోవాలనుకొంది. మరొకరికోసం వెదుక్కుంటూ బయలుదేరింది.

ఎడ్లువచ్చి ఇంటి గుమ్మందగ్గర ఆగాయి. రైతు కంపమీద నుంచి నిద్ర మేల్కొన్నవాడిలా లేచాడు. "తను పొలంనుంచి ఇంటికి ఎలా చేరానా?" అని ఆశ్చర్యపోయాడు.

---

ధూళిపూడి రాజా రామమోహనరావు.

---

జ్వరదేవత అలా వెదుక్కుంటూ పోయిపోయి అప్పుడే పంచభక్ష్య పరమాన్నాలతో విందారగించి, అంతఃపురంలో హంసతూలికాతల్పం మీద, మల్లెపూల పాన్పుపై పవళించిన మహారాజును చూచింది. చూచిందే తడవుగా బ్రహ్మానందపడింది! ఏమీ ఆలోచించకుండానే మహారాజుగారికి ఆవహించింది!

జ్వరదేవత ఆవహించగానే మహారాజు ఆస్థాన వైద్యులకు కబురంపాడు. ఆస్థాన వైద్యులు పరుగు పరుగున రాజ సన్నిధికి వచ్చి వాలారు.

మహారాజుకు వంగి నమస్కరించి, "మహారాజా? ఏమి శెలవు?" అని అడిగారు మహారాజవైద్యులు.

మహారాజు "వైద్యులారా! మీరు నన్నీజ్వరాన్నుంచి బాధేం కలుగకుండా విముక్తుణ్ణి చేయాలి. జ్వరం ఉన్నా మీరు నాకు కషాయాలు కాకుండా తియ్య తియ్యటి, తేన మందులు ఇస్తూ ఉండాలి. నేను రోజూ పంచభక్ష్య పరమాన్నాలతోను, రకరకాల పిండివంటలతోను భోజనం చేయాలి; ఎప్పుడు నిద్రవస్తే అప్పుడు నిద్రపోవాలి!" అని తెలిపాడు మహారాజు! వైద్యులు మాత్రం ఏమనగలరు? "సరే" నన్నారు.

మహారాజు తల్చుకొన్నట్లల్లా చేస్తున్నాడు. తినాలని ఉన్నదల్లా తింటున్నాడు! నిద్రపోవాలని ఉన్నప్పుడల్లా నిద్రపోతున్నాడు. తియ్యతియ్యటి తేనమందులు వేసుకొంటున్నాడు.

"ఎన్నాళ్లోగదా నాకీ సుఖం, ఈ మహారాజభోగం!" అనుకొంది, జ్వరదేవత. సంతోషంగా సాగుతుంటే ఉండడానికేం? ఎన్నాళ్లయినా ఉంటుంది.

మహారాజుకి, ఇలా ఉండగా, కొన్నాళ్ళకి నీరసం, విసుగు, భోజనం సహించకపోవడం మొదలయాయి. నీరసం నానాటికీ అధికం కాసాగింది. వైద్యులు రోజూ తియ్య తియ్యటి తేనమందు లిస్తున్నారు. అప్పటికప్పుడే జ్వరం ఆవహించి చాలానాళ్ళు కావస్తోంది. వైద్యులకీ విసుగ్గానే ఉంది; ఇలా ఎన్నాళ్లని రోజూ మందు వేసుకోవడమంటే, తియ్య తియ్యటి, తేన మందులయి

నప్పటికీ మహారాజుకి విసుగ్గానే ఉంది !

జ్వరదేవత పాయసాలు పరమాన్నాలతో కులుకుతూ ఉండేది! మహారాజు అదేమీ తినకపోవడంతో, ఇప్పుడు దిగులు పుట్టింది.

ఒకరోజున మహారాజు "ఎన్నెన్నో రాజ్యాల్ని, ఎందరెందరో రాజుల్ని జయించిన నేను, ఈ జ్వరదేవతని జయించలేనా ?" అనుకొన్నాడు. అనుకొన్నదే తడవుగా వైద్యులకి కబురు పంపాడు.

క్షణంలో వైద్యులు వచ్చి మహారాజుకు వంగి నమస్కరించి "ఏమి, శెలవు ? మహారాజా !" అని అడిగారు.

మహారాజు నీరసించి ఉన్నాడు. "వైద్యులారా!......మీరు....నాకీ జ్వరం.....త్వరగా.....తగ్గేలా చూడండి. మీరు....కషాయాలిచ్చి.... త్రాగమన్నా.....త్రాగుతాను..... తేనె మందులు...లేక....పోయినా... బాధలేదు! కటిక...లంకణాలు చేయమన్నా...చేస్తాను" నీరసంచేత ఇక మాటాడలేకపోయాడు మహారాజు.

మహారాజ వైద్యులు, రాజు అంగీకరించిందే తడవుగా జ్వరం వేగంగా తగ్గే ఒక కషాయాన్నిచ్చారు. బలవంతాన త్రాగాడు మహారాజు. భోజనం సహించని మూలాన బాగా శుష్కించిపోయాడు మహారాజు.

జ్వరదేవత విచారానికిక హద్దూ పద్దూ లేదు; "ఇక లాభంలేదు. మహారాజు కటిక లంకణాలు చేస్తున్నాడు. కషాయాలు త్రాగుతున్నాడు. మనకిక సుఖంలేదు. పెట్టే, బేడా, మూటా ముల్లె సర్దుకొని వెళ్లిపోవా"లని నిశ్చయించుకొంది! ఇన్నాళ్ళూ, వారాలూ, నెలలూ, తిష్ట వేసుకూర్చున్న దొక్కసారిగా వెళ్లడం ఎలా ?

మహారాజు మూడు లంకణాలు చేశాడు. కషాయం తప్ప మంచినీళ్ళుకూడా ముట్టడంలేదు. దీనితో జ్వరదేవత హడలెత్తిపోయింది ! "ఇక లాభంలేదు. నన్నిన్ని బాధలు పెట్టిన వైద్యులెన్నెక్కడా చూడలేదు !" అనుకొంది. నాలుగో లంకణానికల్లా ఈ బాధలన్నీ అనుభవించలేక త్వరత్వరగా మూటా ముల్లె సర్దుకొని ఆపరిసరాలన్నీ వదలిపెట్టి మరొకర్ని వెదుక్కొనడానికి పారిపోయింది జ్వరదేవత !

మహారాజుకి వెంటనే జ్వరం తగ్గింది. అనలక్కడ జ్వరదేవత ఉంటేగా ? వైద్యుల్ని ప్రశంసించాడు మహారాజు. "మహారాజు జ్వరదేవత మూలంగానైనా 'లంఘనం పరమౌషధం' అని గ్రహించగల్గాడు" అనుకొని సంతోషించారు, ఆస్థానవైద్యులు. ★

# సంక్రాంతి–సంకెళ్లు

(16-వ పేజీ తరువాయి)

ఇంత సందడిగావున్నా నా మనస్సంతా యింటిమీదేవుంది.

మా రావు కాపురంవున్న యింట్లో యింకా ఆరు యిళ్లవాళ్లున్నారు. ఏ వాటాకి ఆవాటా కేటాయింపుగావుంది. ఎవరితోనూ యెవరికీ పొమ్మిడిలేదు.

నేను వచ్చినట్లు క్షణంలో తెలిసింది వాళ్ళకి. భోజనాలూ పనులూ అయాక ఒక్కొక్కరేవచ్చి "వచ్చారా" అంటూ నన్ను పలకరించారు. ఇదివరకు వచ్చాను కనుక వారికి నేను తెలుసును.

"పాపం. పండగపూటా పిల్లలు వండుకుంటున్నట్లున్నారు." అంటూ మా పిల్లల మీద సానుభూతి కనబరిచారు కొందరు.

"అలుడు కూడా వచ్చినట్లున్నాడు. అతన్ని పండగకు పిలిచి మీరిలాగవస్తే మీ అలుడికి కోపంవచ్చి మీ అమ్మాయిని తీసుకుని చక్కా పోడుగదా పండగ అవకుండానే" అంది ఒక యిల్లాలు వినీవినబడనట్లుగా.

గతుక్కుమన్నాను "మా వాళ్లంతా అంగీకరిస్తేనే వచ్చాను" అన్నాను.

"అందరినీ తీసుకురాలేకపోయారా? ఏకంగా పండగలయాక వెళుదురు?" అంది ఒక యిల్లాలు.

"అల్లాగ కుదరదండి" అన్నాను.

"పోనీ వీళ్లందరినీ మీ యింటికే రమ్మనలేకపోయారా? ఎవరికీ ఏ బాధా లేకపోను, ఇంతకీ మీరే వీరందరికన్నా పెద్దకదా. మీరు వీరిని రమ్మన్నా ఏ ఆక్షేపణా లేకపోను?" అంది ఒక మహిళ.

వచ్చిన అమ్మలక్కలు వెళ్ళిపోయారు.

"ఎంతటి యిల్లాలే! భర్తనీ, పిల్లల్నీ, పండక్కి వచ్చిన అల్లుణ్ని పండగపూటా వాళ్ల ఖర్మకి వాళ్ళని వదిలేసి తగుదునమ్మా అని వచ్చింది" అంటూ పోతూపోతూ వాళ్లనుకున్న మాటలూ, తిరువాత పకపకలూ వినిపించాయి.

అసలే యింటిమీద ధ్యాసతో మనస్సు బాగాలేని నాకీ మాటలు చాలా బాధ కలిగించాయి. చటుక్కున లేచి రావుని కేక వేశాను. "సాయంత్రం బస్సు సరిగా యెప్పుడు బయలుదేరుతుంది" అని.

"అదేమిటి?" అని ఆశ్చర్యపోయారంతా.

"రేపు ప్రొద్దుటి దాకా వుంటానన్నావు కదూ అక్కా" అన్నారు తమ్ముళ్ళు.

"అప్పుడే వే అమ్మాయీ వెళ్ళడం. ఆ కారుకి వచ్చి యీ కారుకి వెళ్ళడం మగవాళ్ళకి చెల్లిందిగాని ఆడవాళ్లం అలాగ వెళ్లడమేమిటే" అంది అమ్మ.

"పండగ అంటూ మూడు రోజులూ వుండకపోయినా ఒక్కరోజైనా పూర్తిగా వుండరా వదినా" అంది మరదలు.

"వెళ్లవద్దు అత్తా" అన్నారు యిద్దరు మేనల్లుళ్ళూ, యిద్దరు మేనకోడళ్ళూను.

వాళ్లలా ప్రతిమాలుతున్నా ఒక్క నిముషం యిక అక్కడ నిలవలేకపోయాను.

"వెళ్ళక తప్పదర్రా, ఎన్నాళ్ళున్నా నాకూ వుండాలని వుంటుంది. మీకూ అలాగే వుంటుంది. రావడం, నలుగురినీ చూడడం అయింది. మళ్ళీ త్వరలో నే వస్తా" అంటూ నా ప్రయాణ నిశ్చయం తెలియజేశాను. ఏమీ చెయ్యలేక వాళ్లూరుకున్నారు.

పిల్లలేమీ చేసుకోనివుండరని మా మరదలు బొబ్బట్లూ నిన్న చేయించివుంచిన మిఠాయి వుండలూ ఒక పజబుట్టలో పెట్టి యిచ్చింది "వాళ్ళకి పెట్టండి" అని "రేపు నేనివన్నీ చేస్తా"నన్నా వినిపించుకోలేదు.

* * *

మా వూరు చేరుకునేసరికి ఏడు గంటలయింది. ఆలిండియా రేడియో నుండి తెలుగు వార్తలు ప్రసారమౌతున్నాయి. బస్సు స్టాండులో బోలెడు రిక్షాలుండేవి. అదేమో ఒక్క రిక్షా లేదు! మా యిల్లు అక్కడికి దగ్గరే అయినా రిక్షామీదే వెడుతూంటాం సాధారణంగా ఏదో సామానూ వుంటుంది.

ఇక నడిచి వెళ్ళవలసిందే. చిన్నపిల్లని యెత్తుకోనక్కర్లేదు. నడుస్తుంది. కాని, బుట్ట?

పాటం కట్టియిస్తే తీరిపోను. బజారు బుట్ట లాంటిది యిచ్చింది మరదలు! ఏం చెయ్యను. ఒక చేత్తో పిల్లను, మరోక చేతో బుట్టనీ పట్టుకుని యెవరైనా తెలిసినవాళ్లెదురు పడతారేమోనని జడుస్తూ రోడ్డు వారగా నడుస్తున్నాను. ఎలక్ట్రిక్ దీపాల కాంతిలో వీధులు పట్టపగల్లాగ వున్నాయి. చేతిలోని బుట్ట యెవరికీ కనబడకుండా చీరచెంగు బుట్ట మీదుగా కప్పివుంచాను. మా సందులోకి మళ్ళాను. అంత దూరాన మా యిల్లు కనబడుతోంది.

"అమ్మా ఆకలేస్తోంది" అంది పిల్ల.

"మిఠాయి తింటావా? యిస్తాను. అరవబోకు" అన్నాను.

"నాకు యిష్టంలే"దంది.

దానికి తీపికిట్టదు. ఆమాట మరచిపోయి అడిగాను.

ఇంతలో యెదరనుండి మావారి స్నేహితుడు శర్మగారు సైకిల్ మీద వస్తున్నారు మా వైపే. ఇక రెండుయిళ్ళే మా యింటికి మధ్య వున్నాయి. ఇంతలోకే యీయన కనబడాలా? చేతిలో బుట్టతో చచ్చిన చావయింది. దీపస్తంభం క్రీనీడ అదృష్టవశాత్తూ మామీద పడుతోంది. మేము ఆయనను చూశాం. కాని, ఆయన మమ్మల్ని చూడలేదు. ఎక్కడికో హడావిడిగా వెడుతున్నట్లున్నాడు. "బ్రతుకు జీవుడా" అనుకుని రెండు అంగల్లో మా యింటికి చేరుకున్నాను.

లోపల భోజనాలవుతున్నట్లుంది. వీధి వైపు సందడిలేదు.

"అమ్మాయి తలుపుతియ్యి" అని గట్టిగా పిలిచాను.

* * * *

"అమ్మాయీ, తలుపుతియ్యి" అన్న అచ్చి పిలుపుతో కళ్లు తెరిచాను. నా చేతిలో బుట్టాలేదు! నేను వీధి గుమ్మంలోనూ లేను! మంచం మీద పడుకునివున్నాను. నా పక్కలో చిన్నపిల్ల పడుకుని హాయిగా నిద్రపోతోంది.

లేచి గడియారం చూశాను. తెల్లవారు జాము అయింది. ౫ గంటలయిందని జనం సంచరిస్తున్న సందడి అవుతోంది. కాకులు "కావు కావు" మంటూ, రెక్కలు విదలిస్తూ గూళ్లలోంచి బైటకి వస్తున్నాయి.

వెళ్ళి వీధి తలుపు తీశాను అచ్చికి.

బస్సులో ముసలమ్మ అన్నమాటలూ, రావుగారింట్లో యిరుగు పొరుగు అమ్మలక్కలు అన్నమాటలూ, వాళ్ల నవ్వులూ నా చెవుల్లో యింకా ప్రతిధ్వనిస్తూనే వున్నాయి.

"అమ్మాయీ, ఇప్పుడేనా వెళ్లడం?" అంది అచ్చి.

"ఆఁ! నేనెక్కడికి వెళతానే" అన్నాను నిర్లిప్తతగా.

* * *

సంక్రాంతి నాదే కాదు. మనస్సుకి ఏనాడూ లేవు సంకెళ్ళు. ★

 

# నా సంసారం



(23-వ పేజీ తరువాయి)

అర్థం చేసుకున్నా రన్న మాట." అంది అనురాధ నిష్ఠూరంగా.

"నేనొద్దన్నా నా, ఇంట్లో అందరూ చేసే పని అదేగా. వాళ్ళతో సంప్రదించాలనే నియమం ఎక్కడుంది? అందరూ పెత్తనం చెలగబెడుతూండగా లేనిది నువ్వు ఒక్కతివే నా తక్కువ తిన్నది? నువ్వూ చెలాయించు"

"అంత మరీ వాళ్ళ పెళ్ళాంగా కన్నా మిన్నా కాని స్వతంత్రం ఎవరూ వెళ్ళబోసుకోవటంలా."

"ఆ విషయం బటలకొట్టులో రెండొందల అరువూ చెబుతూ నేవుంది"

"అవును. దగరడబ్బువుండి చేసుకునే వాళ్ళకి అరువులెందుకుంటాయి. అది లేనప్పుడు అరువు కనిపిస్తుంది. అందరికీవుండే ఖర్చే"

"ఆ సమానూ అందరూ, అందిరూ అంటావేమిటే? అందరూ మనకి ప్రమాణం కాదు. వాళ్లంతా మన ఇబ్బందులకి ఆదుకుంటారా? అందురూ చేస్తే అది మంచి అయిపోతుందా? మనంతట మనం ఆలోచించుకోవాలి!"

"మీరు ఎలా చెబితే అలా నడుచుకుంటాం. ఎంతమాత్రం పొదుపు చెయ్యగలుగుతారో చూద్దాం."

"పొదుపంటే మనం వందలూ వేలూ వెనకేసుకుంటామని కాదు నా వుద్దేశం. ఈ ఖర్చు మరొకవిధంగా సద్వినియోగ పర్చుకుందామని. ఇందాక చెప్పలా. నీ గొలుసు విడిపిద్దామని అనుకుంటున్నాను"

అనూరాధ ఆవులించి పక్కకి వత్తిగిలింది. 'అది జరిగినప్పుడు చూద్దాం' అన్నట్టుగా నిర్లక్ష్యంగా.

నేను అర్థాంతరంగా ఆపేసి కళ్ళు నులుపుకున్నాను.

ఉయ్యాలలో పాపాయి 'కార్' మన్నాడు!!

నా ఒళ్ళు ఝల్లుమంది!! నేనెందుకో చప్పున సిగ్గుపడిపోయాను.

నాకిప్పుడు ముగ్గురు సంతానం!! పట్టుమని పాతికేళ్ళు లేవు. ఇంకెంతమందో?!

అనూరాధ లేచి పిలవాడిని పొత్తిళ్ళలోకి తీసుకుని పాలివ్వసాగింది.

నేను సంతాననిరోధం నిమిత్తం ఆపరేషను చేయించుకోవాలని మొదటి పుత్రవాడు పుట్టినప్పట్నించీ అనుకుంటున్నాను. ఇప్పుడూ అనుకుంటున్నాను. అది ఆచరణలోకి ఎందుకు రావటం లేదో సమాధానం చెప్పుకుంటే నా నిర్లిప్తతకి నాకే సిగ్గువేసింది.

ఇక నాకు పిల్లలుపుటటానికి వీల్లేదు!

గడియారం మూడుగంటలు కొట్టింది. నేను గోడవైపు వత్తిగిలాను.

* * *

తెల్లవారి లేచేసరికి బారెడు పొద్దెక్కింది. విసుక్కుంటూ లేచాను. మెలకువ సహజంగా రాకుండా బలవంతాన రావటం నా చిరాకుకి కారణం. వీధి తలుపు బార్లా తెరవద్దని ప్రతిరోజూ చెబుతాను. తూర్పు వైపున ఉన్న ఆద్వారంగుండా శీతాకాలపు ప్రొద్దుటి ఎండ చురచురలాడుతూ నామీద పడుతోంది. ఆ వేడికి మెలకువ వచ్చేస్తుంది. నేను నిద్రలేమికి ఎఱ్ఱబడిన కళ్లని నులుపుకుంటూ ఇవతలకి వచ్చేసరికి పనిమనిషి నవ్వుతూ "అయితే ఈ పూటనించి నాకు ఒక పని తప్పి దన్న మాట" అంటోంది.

"ఏమిటది?" అన్నాను.

"కాఫీలు మానేసినారుగా బాబూ!"

నేను ఏమీ మాట్లాడకుండా దాగరంత ముఖం చేసుకుని వంటగదివైపు చూశాను. అనూరాధ గర్వంగా నవ్వుతూ పక్కకి తప్పుకుంది. అమ్మ ఇవతలికి వచ్చి "అందుకనే జీతంలో ఈ నెలనించి ఒక అర్ధరూపాయ కోత పెడతాను" అంది.

'ఇది వ్యంగ్యం కాదుగదా' అని నేననుకున్నాను. ఎందుకంటే ఆవిడ ఆమాటలంటూ నావైపు చూసిన చూపునిబట్టి నేనలా అనుకున్నాను. కాని అది నిజం కాదు.

"అదేం కుదరదమ్మోయ్!" అంది మనిషి.

"ఊరికే అన్నానే. అంత కంగారుపడతావు దేనికి" అంటూ అమ్మ మాసినబట్టలు బుజాన వేసుకుని బావి దగ్గరకు వెళ్లింది.

"రోజూ ఆ బట్టలన్నీ తను ఉతక్కపోతే ఒక అర్ధరూపాయ పడేస్తే చాకలి వుతికిపెట్టదూ" అన్నాను అనూరాధ వైపు తిరిగి.

"అనవసరంగా ఎందుకు ఖర్చు అని ఆవిడ అభిప్రాయం" అంది అనూరాధ.

ఇది చాలా అందంగా వుంది! నాకు నవ్వాలో ఏడవాలో తెలియటం లేదు. ఏది అవసరమో అక్కడ లోభిత్వం చూపటం, ఎక్కడ అనవసరమో అక్కడ పెద్ద భారీతనం చెలగబెటటం—ఇదన్నమాట మీదృష్టిలో జాగ్రత్తంటే."

బావి దగ్గర నీళ్లు పోసుకుంటూ తమ్ముడు అమ్మమీద ఎగురుతున్నాడు. ఆవాళ ఇంట్లో కాఫీ పెట్టనందుకు వాడు కాఫీ హోటలుకి పోయి తాగుతాట్ట. వాడికి ఆఫీసు దగ్గర ఒక అరువు హోటలుంది. నెలకి ఇరవైకి తక్కువ కాకుండా వాడి హోటలు ఖర్చు వుంటుంది. మొదటి తారీకున జీతం రాగానే ఆ డబ్బు అక్కడ కట్టేస్తూంటాడు. ఏ నెలకానెల ఇంత ఖచ్చితంగా డబ్బు చెల్లించే కాతాలు చాలా తక్కువంటూ ఆ హోటలు వాడు వీడ్ని మెచ్చుకుంటూ తరుచు మిగతావాళ్ళ దగ్గర వీడ్ని ఉదాహరణగా చెబుతూంటాట్ట. అని వీడు అమ్మ దగ్గర గర్వంగా చెబుతూంటాడు.

మొత్తంమీద ఈ ఉదయం నా పాతికేళ్ళ జీవితంలోనూ చాలా ప్రధానమైన సమయం. పాతికేళ్లుగా వేళ్ళు తన్నుకుపోయి పెద్ద రాక్షసిలా మా సంసారాన్ని పటిపల్లారుసున్న ఒక దురలవాటుని రూపుమాపే ఒక వుద్యమం ప్రారంభమయింది. ఇంతకంటె గర్వకారణమైన విషయం ఏముంటుంది? తను మారినట్టుగా అమ్మకూడా రాత్రి ఒక హామీ ఇచ్చింది. ఈ ఇంట్లో అచ్చట్లూ, ముచ్చట్లూ అంటూ దుబారా ఇక జరగటానికి వీల్లేదు. అలా జరగదనే నేను గట్టిగా నమ్మాను. ఒక పెద్ద ప్రణాళిక జయప్రదంగా నిర్వహించినంత సంతృప్తి నా హృదయాన్ని ఆవరించుకుంది.

అయితే ఇంట్లో అందరూ ఆ పూట ఎందుకో తడుముకుంటూన్నట్టుగా, పోయిన వస్తువుకోసం వెతుక్కుంటున్నట్టుగా, వుండి వుండి వులికిపడుతున్నట్టుగా మసలటం నేను గమనించాను. ఇన్నాళ్ళ వ్యసనం ఒక్కపూటతో స్వస్తి చెప్పటమంటే సామాన్యమైన విషయం కాదు. అయినా మా వాళ్లు దృఢంగా నిలబడగలిగారు.

నా డైరీలో ఇలా రాసుకున్నాను. "ఈ పూట సూర్యోదయం బాహ్యంగా నే కాదు. మా అందరి మనస్సుల్లోనూ ఈ వెలుగు ఉదయించింది. నా కష్టాన్ని, బాధని, శ్రమని, నా వాళ్ళు ఇన్నాళ్ళకి అర్థం చేసుకుని నా బాధ్యత పంచుకున్నారు. నాకు శాంతిగా వుంద. ఇంతకంటే నేను కోరదేముంది?" ఇలా రాస్తూంటే నా చేతులు కొద్దిగా వణికినట్టుగా నాకనిపించింది.

* * *

ఆఫీసులో మిత్రులు చాలామంది నన్ను హేళన చేస్తూంటారు. కారణం ఆఫీసు పక్కనే వున్న హోటల్ కాతా పుస్తకంలో నా పేరు లేకపోవటమే. కనీసం ఆ ఛాయలకైన పోవటం ఇష్టంలేని నన్ను ఒక లోభిగా తోటి గుమాస్తాలు భావించుకున్నారో ఏమో "పోనీ నీ హోటలు ఖర్చు మేం భరాయిస్తాం రారాదూ" అంటూ అప్పుడప్పుడు బలవంతం చేస్తూంటారు.

"నాకు అలవాటులేదు భాయీ!"

"పొద్దున్నన గా తినివస్తావు. సాయంత్రం దాకా ఎలావుండగలవయ్యా?"

"నాకు ఆకలివేస్తే నేనెందుకు వూరుకుంటాను."

"అది నమ్మతగ్గవిషయం కాదు. ఆకలి ఎందుకువెయ్యదు. అందులో గుమాస్తాని

## 'నా సంసారం'

కూడాను."

"ఇంటికి వెళ్ళగానే తొందరాకే భోజనం చేస్తాను."

వాళ్ళు విసుక్కుంటూ వెళ్ళిపోతారు. దూరంగాపోయి వెనక్కి తిరిగి నన్ను చూసి నవ్వుకుంటారు. కాని నెలమొదట్లో జీతాలు పుచ్చుకునే వేళకి బయట కిటికీలపక్కగా చేతిలో కాతాపుస్తకాలతో నిలబడి తొంగి తొంగిచూసే హోటలువాళ్ళని తప్పించుకుందుకు నేను చేసే ప్రయత్నాలు, గత్యంతరంలేక, ఇవ్వక తప్పక వాళ్ళు సైతాను లాగ పట్టుకున్నప్పుడు వీళ్ళపడేశాన... అప్పుడేమయిపోతాయి ఈ చిరునవ్వులూ, వ్యంగ్యాలూను?

అప్పుడప్పుడు హోటలువాళ్ళు వసూలు కాని పెంకి కాతాల తాలూకు తగాయిదాలు పరిష్కరించుకుందుకు నన్ను మధ్యవర్తిగా వాడుకోవటంకూడా మా తోటి గుమాస్తాలకి గుర్రుగుర్రుగా వుంటుంది.

సాయంత్రం జీతంపుచ్చుకుని నాలుగింటికి ఆఫీసరుగారివద్ద పర్మిషన్ తీసుకుని ఇంటికి బయల్దేరాను. ఇవ్వాళవిందీ ఇంటి బాధ్యతకూడా నేనే నెత్తిన వేసుకోదల్చుకున్నాను. ఇంట్లో బియ్యం నిండుకున్నాయి. వాళ్ళనీ వీళ్ళనీ అప్పులడగటం నాకు సమ్మతంగావుండదు. అందుకనే తొందరాకే వెళ్ళి కావలసిన సరుకులన్నీ తీసుకురావటంకోసం బయల్దేరాను. బట్టలకొట్టు వాడు రోజూ వచ్చి పీక్కుతింటున్నాడు. ఈ నెల ఒక ఏభయ్యయినా చెల్లు వేస్తేగాని వాడు శాంతించడు. అలా వెళ్ళాను! డబ్బు చెల్లుపెట్టి రాబోతుంటే పిడుగులాంటి సంగతి నాచెవిని వేశాడు వాడు. అమ్మ స్వయంగా వచ్చి ఒక పరికిణీగుడ్డా, జాకెటుగుడ్డా, ఇంకా ఏవో రవికల గుడ్డలూ-అంతా కలిసి ఇరవై రూపాయల బట్టలు పట్టుకెళ్ళిందంటూ బిల్లుచూపించాడు. అక్కడ నేనేం మాట్లాడలేను. నా ముఖంచూసి జరిగిందంతా వాడు వూహించాడుకాబోలు "మీ చెల్లెలుగారి పుట్టింరోజట కదండిసార్! ఏదో ఎంతకలిగితే అంత! వున్నదాంట్లో వున్నంతగా అనుభవించాలి సార్! ఒక్కరయినా మనుష్యుల్ని భోజనానికి పిలవకేం సార్!" అంటూ తనలోతాను నవ్వుకోసాగాడు.

నేను నవ్వునటించి ఇవతలికి వచ్చేశాను. నా మనస్సంతా కుతకుత లాడిపోతూంది. రాత్రి అమ్మచెప్పిన మాటలు నమ్మాను. కాని ఇలా నిలకడలేని మనుష్యులని నేననుకోలేదు. తలనొప్పిగా తోచి తలపట్టుకుని నడవసాగాను. పచారీ కొట్టుకు ఇంకో గంటలో వస్తానని చెప్పటానికి అతనికొట్టుకు వెళ్ళాను.

"అమ్మగారు సరుకు లన్నీ పట్టుకెళ్ళారండీ!" అన్నాడు షావుకారు.

"ఎంతయింది?"

"నలభై!"

నేను ఇక అక్కడ నిలబడదల్చుకోలేదు నలభై! ప్రతినెలా పాతికరూపాయలకంటె మించదు. ఈ నెల ఇంకా పదిహేను! ఇదంతా ఒక్కరోజు ముచ్చటతో తీరిపోతుంది. మరునాడు మళ్ళీ సంచీ బుజాన వేసుకుని కొట్టుకుపోక తప్పదు. తలనొప్పి బాగా ఎక్కువైంది.

ఇంటిగుమ్మంలో అత్తరు సాహెబు ముఖానికి చెయ్యి అడ్డంపెట్టుకుని లోపలికి గుచ్చిగుచ్చి చూస్తున్నాడు.

"ఎవరికోసం?" అన్నాను.

"అమ్మగారు డబ్బు ఇవ్వాలి. సెంటు పుచ్చుకున్నారు"- కుర్రవాడువచ్చి డబ్బు లిచ్చాను. అతను వెళ్ళిపోయాడు.

నేను గుమ్మంలో అడుగు పెటగానే నాకు మొట్టమొదట కనిపించిన దృశ్యం అమ్మ మూతి తుడుచుకుంటూ కాఫీగిన్నెలు బైట పడెయ్యటం.

కాఫీసుంపటేమిటూతా పిల్లలు తగవులాడుకుని ఒలకబోసిన కాఫీ మరకలు!— కొద్దిదూరంలో అనూరాధ కాళ్ళమీద ఎడపిల్లవాడ్ని వేసుకుని "అబ్బ! పాడుపిల్లడు! చంటిపుంక వాడు తాగకుండా మనం తాగటమేమిటని ఒక చుక్క పడదామంటే గుటక మింగుతేనా" అని విసుక్కుంటూ వాడినోరు పగలదీసి నోటికి ఒక చెంచా అడ్డం పెడుతూ కాఫీగొంతుకలోపోసి బలవంతాన తాగిస్తూంది. రెండుతరాలవ్యసనం మూడో తరాన్నికూడా బానిస చేస్తూంది.

వాళ్ళు చెప్పిన సంజాయిషీలు నేను ఇక్కడ రాయదల్చుకోలేదు. అనూరాధ ముస్తాబు చేసుకుని మరదలి పుట్టింరోజుకి బంధుబలగాన్ని భోజనానికి పిలవటానికి వెళ్ళే సన్నాహంలో, అమ్మ మరునాటి తతంగానికి చేసుకునే ఏర్పాట్లలో వాళ్ళని నిలదీసి, రెక్కించి మాటకిమాట పెంచుకునే ధైర్యమూ నాకు లేకపోయింది.

రాత్రి జేబులో డైరితీసి ఆ పేజీ వెతుక్కుని ఉదయంరాసిన నాలుగు పంక్తులూ అడ్డంగా కొట్టివేస్తున్నప్పుడు నా చెయ్యి కొద్దిగా వణికింది. ఇంకా ఏదో రాయాలని మనసులో వుంది. కాని డైరిలో ఆ తారీకు కాగితంలో ఇక చోటు లేదు. 

## వనితావాణి

(41-వ పేజీ తరువాయి)

తనపరువూ, మర్యాదా, మంటకలిసి పోయాయనీ దెబ్బలాడటం మొదలెట్టింది. వేరొక పిల్లతల్లి మాఇంటికి వచ్చి, మా అత్తగారితో "ఏమమ్మా మీ కూతుళ్లూ, కోడలూ ఎంత చదువుకున్నవారైనా, ఇలా మనుష్యుల్ని పత్రికల్లో పెటి రచ్చకీడ్చడం బాగుందా? చెప్పండి? మీరు చదువుకున్నవారైతే మీ చదువులు మీ దగ్గరే ఉంచుకోండి. అంతే కాని, మా సంగతులు మా సంబంధాలు మీ కెందుకు?" అని ఏమేమో అనడం మొదలెట్టింది. ఇదంతా మా అత్తగారికి తెలియక మమ్మల్ని కేకలేయడం మొదలెట్టారు. దానికి మాకు ఏడ్వాలో, నవ్వాలోకూడ తెలియలా అప్పట్లో. అది ఎవ్వరికి వ్యక్తిగతంగా సంబంధించినది కాదని, అందులో లోకపు సహజగుణాన్ని విమర్శించామనీ వాళ్ళకి నచ్చచెప్పేసరికి మాకు తలప్రాణం తోకకు వచ్చిందంటే నమ్మండి! 

—ఎస్. సుమిత్రాదేవి, బిలాస్‌పూర్,
మధ్యప్రదేశ్]






## ★ హోలీ కోలాహలం ★

బొంబాయి చిత్రసీమలో మొన్నటి హోలీపండుగ కోలాహలం వంద పెళ్ళి పందిళ్ళ సందళ్ళను మించిందనిపించింది. ఎటొచ్చీ ఈయేడు రెండుచోట్లే హుషారుగా జరిగింది. తెల్లవారగానే రాజ్ కపూర్, భరత్ భూషణ్, నిగర్ సుల్తానా, శ్యామాలు నలుగురూ, వసంతం పట్టుకుని మిత్రప్రపంచంలో జైత్రయాత్రకు బయల్దేరారు. ఇంటింటికీ వెళ్ళి, ఎదురైన ప్రతివాళ్ళమీదా, ఉక్కిరిబిక్కిరి అయేలా రంగునీళ్ళు చిమ్మి, నవ్వి నవ్వించి నానా గోలా చేశారు. ఇంటింటా ఇంతో అంతో మిఠాయిలారగించి, అభినందించి తమవెంట మరి నలుగుర్ని కలుపుకుని మరో యింటికి బయల్దేరేవారు. ఇలా ఈ తారా సందోహం

## బొంబాయి సినిమా లేఖ

ఇంతింతనరాని దంతై, చివరికి అంతా కలిసి రాజ్ కపూర్ స్టుడియో ఉద్యానవనంలో జొరబడింది. డైరెక్టర్ రాజ్ కపూర్, అక్కడ అపూర్వమైన పదుపాయం ఒకటి చేశాడు. అది: వసంతం చల్లడానికి గొట్టాలూ గిట్టా అవసరం లేకుండా, ఏకంగా ఓ పెద్ద కొలనునే వసంతంతో నింపెయ్యడం. ప్రొడ్యూసర్ రాజ్ కపూర్, పెద ఫెట్ అని వెనుకాడక, భారీఎత్తున ఏర్పాట్లు చేసి, కొలనులో పుష్కలంగా రంగునీళ్ళు పోయించాడు. యాక్టర్ రాజ్ కపూర్ అండ్ కంపెనీ, కేరింతలు పెడుతూ, ఒకరి కొకరు కేకేలు కొడుతూ అక్కడ చెయ్యగలిగినంత అల్లరి చేశారు. ఇద్దరిని ముగ్గురిని కలిసి, ఒకొక్క నటినో, నటుణ్ణో చుటుముట్టి, పైకి లేవనెత్తి, హాయంపట్టి అటూ యిటూ ఓసారి ఊపి, సరాసరి, ఆ సరస్సులోకి విసిరి పారెయ్యడం. ఆనాటి అందులో మునిగి లేచి నఖశిఖపర్యంతం ఎర్రబడిపోయి

శక్తి పిక్చర్ వారి 'హౌరా బ్రిడ్జ్' చిత్రంలో మధుబాల.



వరసూవారి హిందీచిత్రం 'సితారోంసే ఆగే'లో అశోక్‌కుమార్, వైజయంతిమాల.

[illegible]

బయటికి రావడం. చూస్తూ చప్పట్లు కొడుతున్న ఇంకో అమ్మాయిని, మరో యిద్దరు పాయంపట్టి అదే విధంగా నమస్కారం చేయడం—ఇలా, ఈ కోలాహలం పన్నెండు గంటలదాకా సాగింది. ఆనక, అందరూ స్నానాలు చేసి, దుస్తులు మార్చుకు ముస్తాబయ్యారు. అలసిపోయిన దోస్తులకందాకీ గేస్టు రాజకపూర్ విందుచేసి కుషుగా భోజనం పెట్టాడు. గంటక్రితం అలసిపోయి కూర్చున్నవాళ్ళు ఇప్పుడు భుక్తాయాసంలో కూర్చున్నారు.

ఇక్కడ ఇలా "ఫేకాట్" అయిన ఈ సన్నివేశం తరువాయి భాగం, సాయంత్రం భరత్ భూషణ్ ఇంట్లో తిరిగి "ఫేషిన్" అయిందవాలి. ఈ హోలీమహోత్సవాలకు ముక్తాయింపు వేడుక అక్కడ జరిగింది.

మూడేళ్లనాడు భరత్ భూషణ్ భార్య శరళాదేవి చనిపోయింది. అతర్వాత అతను ఎన్నడూ ఉత్సవాలలో పాల్గొనలేదు. తిరిగి ఈలోగాన 'కలీర్ కుటీర్' (భరత్ భూషణ్ ఇంటిపేరు) దీపతోరణాలతో శోభాయమానంగా అలంకరించుకుని వేడుకలకు తయారైంది.

భరత్ ఆరోజు విందుకు వెయ్యిమందిని పిలిచాడు. సినిమాలుతీసేవారూ చూసేవారూ కూడావచ్చారు. భరత్ భూషణ్ చాలా పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేశాడు. తన మటుకు తను మాంసాహారం ముట్టనివాడైనా, అది తప్ప మరోటి గిట్టని వాళ్లకోసం అని, విందులో నాన్ వెజిటేరియన్ భోజనాలు కూడా ఏర్పాటుచేయించాడు.

రాజ్‌కపూర్, దిలీప్‌కుమార్, సురయ్యా, జబీన్, నిగార్‌సుల్తానా, శుభాఖోటే, నాదిరా, నిరూపరాయ్, కుమారీనంద, ఉషాకిరణ్, కె. ఆసిఫ్, శంకర్, జైకిషన్, సజన్, మోతీలాల్, చంద్రకాంత మొదలైనవాళ్ళు, హుషారుగా కబుర్లుచెబుతూ, సారె సారెకూ నవ్వుతూ నవ్విస్తూ విందు పందిరిని కలకలలాడించారు.

భోజనాల తరువాత, పాకిస్తాన్‌నుండి వచ్చిన ఫతేఅలీ బృందం కవాలీ గానసభ జరిగింది.

ఈసారి పండుగను, ఇలా కాక, ప్రశాంతంగా జరుపుకోబోయిన జంట ఒక్కటే ఇక్కడ కనబడలేదు. వాళ్ళు దేవానంద్, కల్పనాకార్తిక్. ఆ యిద్దరూ ఖాండ్లా పరిసర వనాంతరాంతరాలలో ప్రశాంతతను అన్వేషిస్తూ విహరించబోయారు – గురుదత్ గీతారాయ్, కమల్ అమ్రోహీ, మీనాకుమారి ఇల్లుకదలి వెళ్ళలేదు.

* * *

జపాన్ చలనచిత్ర ప్రపంచంలో పెద్ద నిర్మాత, డిస్ట్రిబ్యూటర్, ఎగ్జిబిటర్ అయిన శ్రీ షిరోకిడో మార్చి 8న బొంబాయివచ్చారు. ఈయన తన స్టుడియోలోనే సాలుకు వంద చిత్రాలవరకూ నిర్మిస్తారు. ఇవేకాక, ఇతర చిత్రాలనుకూడా తీసుకొని, దూరప్రాచ్య దేశాలలో డిస్ట్రిబ్యూట్ చేస్తారు. ఈయన యాజమాన్యంలో మొత్తం 2680 థియేటర్లు ఉన్నాయి. ఈ విధంగా పరిశ్రమలోని మూడు ముఖ్యవిభాగాలను (ప్రొడక్షన్, డిస్ట్రిబ్యూషన్, ఎగ్జిబిషన్), సమన్వయించుకొంటూ వ్యాపారం కట్టుదిట్టంగా నడిపే షిరోకిడో, ఇప్పుడు, ఇతర దేశాలలో పరిశ్రమ స్వరూపస్వభావాలు ఎలాటివో, పరిస్థితులు ఎలా ఉంటాయో స్వయంగా

# పద్మశ్రీమతి నర్గీస్

సినీనటి నర్గీస్ శ్రీమతి అయింది. పతి సునీల్ దత్ అని ఈపాటికి, సినీ ప్రేక్షకులకు తెలిసే ఉంటుంది. సినీమతులైన తారాభిమానులు నర్గీస్ నిజనామం, ఫతిమారషీద్ అనీ, సునీల్ అసలు పేరు బల్ రాజ్ అనీ గుర్తుకు తెచ్చుకుని పరస్పరం తెలియచేసుకొంటూ ఉంటారు.

స్వతహాగా ఆడంబరం, ఆర్భాటం అంటే పడని ఫతిమాకు, "నర్గీస్‌కు పెళ్ళి జరుగబోతోంది" అన్న శుభవార్త, సినీ ప్రేక్షక వాతావరణంలో ఎంత పెద్దవార్తో, ఈ పరువు మించిన 'సినీ (వార్తా) పత్రిక'ల ద్వారా అది ఎంత త్వరగా ప్రసారితం కాగలదో తెలుసు కాబట్టి, అడ్వాన్స్ పబ్లిసిటీకి అవకాశం లేకుండా గట్టి కట్టుదిట్టాలు చేసుకుని, మొన్న మంగళవారంనాడు గుట్టుగా పెళ్లి చేసుకుంది.

వధూవరులను ఆప్తులు అయిన కొద్దిమంది ఢిల్లీకి వెళ్ళి, వాళ్లని దీవించారు. తనకన్నా ఏడాది చిన్నవాడైన సునీల్ దత్‌తో నర్గీస్ తొలిసారిగా మహబూబ్ 'మదరిండియా'లో నటించింది. పది పన్నెండేళ్లుగా చేసిన సాధనకు, సాధించిన ప్రజ్ఞకు ఈ చిత్రంలో నటనతోడై ఆమెకు చలనచిత్ర ప్రపంచంలో ఉత్తమ నటిగా గౌరవస్థానాన్ని, 'పద్మశ్రీ' బిరుదాన్ని గడించిపెట్టింది. సునీల్ దత్‌కు కూడా పేరు తెచ్చిపెట్టిన చిత్రం ఇదే. ★

---

తెలుసుకొనడానికి పర్యటనచేస్తున్నారు.

ఇపుడు మనదేశంలో నిర్మాతలూ జాపనీస్ నిర్మాతలూ కలసి చిత్రాలు తీస్తే అవి ఉభయతారకంగా ఉంటాయేమో చూడాలని ఆయన సంకల్పం.

షిరోకిడో చాలా సరదా అయిన మనిషి. మంచి మాటకారి. చమత్కారి. పొద్దుట విలేఖరుల గోష్ఠిలో మాట్లాడుతూ "మీ దేశంలో పెద్ద బాక్సాఫీస్ హిట్ అయే చిత్రం జపాన్‌లో అర్ధణా కూడా సంపాదించలేక పోవచ్చును. మాట వరసకి స్విమింగ్‌పూల్‌లో ఆడవాళ్ళు మగవాళ్ళు అర్ధనగ్నంగా స్నానం చేస్తున్నట్టు తీసే సన్నివేశాలు జపాన్ ప్రేక్షకులు చూసే అసహ్యించుకుంటారు. జపాన్‌లో జనం బాగుందనుకునే చిత్రం భారతదేశంలో ప్రేక్షకులకు చాలా ఎబ్బెట్టుగా కనబడవచ్చు" అని ఆయన అన్నారు.

మొత్తం మీద, మన దేశపు చిత్రాలను జపాన్‌లో వేస్తే డబ్బుచేసుకోలేమోనన్న అనుమానాన్ని ఆయన ధ్వనించారు. సంయుక్త నిర్మాణం విషయం కూడా అక్కడివారితో ఆలోచించి తేల్చ

కలసి ఉంటుందన్నారు. షిరోకిడో ఇక్కడికి రావడానికిముందు ఢిల్లీ వెళ్ళి ప్రధాని నెహ్రూ ప్రభృతులను చూచివచ్చారు. బాల చలనచిత్ర సంఘ అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరాగాంధీ 'రైట్ హాన్' చిత్రం ప్రతినొకదానిని, జాపనీస్ బాలలకు కానుకగా ఆయనకు ఇచ్చింది.

మార్చి 8 సాయంకాలం భారత ఫిలిం ఫెడరేషన్ సభ్యులు షిరోకిడో గౌరవార్థం విందుచేశారు. ఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీ బిల్లిమోరియా స్వాగతం చెప్పినతరువాత ఫిలిం పరిశ్రమ స్థితిగతులనుగురించి మాత్రం యధోచితంగా మాట్లాడి కూర్చున్నారు కాని, ఎగ్జిబిటర్ల సంఘం అధ్యక్షుడు శ్రీ బి.డి. బరూచా నిర్మాత జె. బి. హెచ్. వాడియాలు మటుకు, పోటాపోటీలుగా, "టోక్యో నగరంలో తా మెరిగిన రాత్రి జీవితాన్ని" వర్ణించి మురిసిపోయారు. జాపనీస్ అతిథి సంగతి అలా ఉండగా, సభకువచ్చిన భారతీయులు యావన్మందీ ఆ ప్రసంగాలు విని ఆనందజలధిలో ఓలలాడారనీ, గర్వంతో గుండెలు బాదుకున్నారనీ ఢంకామీద దెబ్బకొట్టి చెప్పుకోడానికి ఏమాత్రం వీలు లేదు...

అవి అలా ఉండగా వాడియా, విచిత్రమైన చలోక్తి ఒకటి విసిరారు. "షిరోకిడో బ్రహ్మాండమైన మనిషి; ఆయనకి తగ్గట్టే, ఆయన ఎక్కడికెళ్తే అక్కడ అద్భుతాలు సంభవిస్తాయి, నిన్న ఈయన బొంబాయిలో కాలు పెట్టారు. అంతే; ఇక్కడ టెంపరేచర్ ఎన్నడూ లేనంతగా పెరిగిపోయింది" అన్నారాయన.

ఇది అతిథి సత్కార వాక్యమే అనుకోవాలో తదన్యమే అనుకోవాలో బోధపడదు. మాకైతేఅయినా, దీన్ని ఎవరూ మార్చేస్తారని

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సువారి 'వీరప్రతాప్'లో పద్మిని.



# బొంబాయి సినిమా లేఖ

పించదు.

* * *

ఆరోజు సాయంకాలమే మరో రెండు పెద్ద విందులు జరిగాయి. ఒకటి, పద్మశ్రీ నర్గీస్, సంగీతనాటక అకాడమీ బహుమతి పొందుకొన్న సచిన్‌దేవ బర్మన్‌ల గౌరవార్థం ప్రముఖ దర్శక నిర్మాత మోహన్ సైగాల్ చేసిన విందు. ఈయన కొత్తచిత్రం 'లాజ్‌వంతి' (డీలక్సు ఫిలింస్)లో నర్గీస్ నాయికగా నటిస్తూంది. బర్మన్ సంగీతం సమకూర్చుతున్నారు.

విందుకు చాలామంది వచ్చి, సన్మానితులను అభినందించారు. దేవానంద్, కల్పనా కార్తీక్, రాజ్ ఖోస్లా, సుందర్, రమేష్ చంద్ర, శశికళ, ఆశాభోంస్లే ముఖ్యులు.

మోహన్ సైగాల్ మాట్లాడుతూ నర్గీస్, బర్మన్‌లకు జరిగిన గౌరవం ఫిలింపరిశ్రమలో యావన్మందికీ చెందుతుందనీ, మొన్న మొన్నటి వరకూ, సంఘం వెలివేసినట్లు చూసిన సినిమా కళాకారులకు ఈ గౌరవం జరుగడం గర్వించతగ్గ విషయమనీ అన్నారు.

ఫిలిం సంగీతాన్ని తేలికగా చూసి హేళన చేసేవాళ్లు ఇంకా చాలామంది ఉన్నారు. కాని, బర్మన్ వంటి ప్రజ్ఞాశాలులు శాస్త్రీయ, జనపద, సంగీతబాణీలను, ఆ మాటకొస్తే పాశ్చాత్య సంగీతాన్ని కూడా కలుపుకొని, కటి వినిపించిన సంగీతం, సంగీత నాటక అకాడమీ వంటి ఉన్నత సంస్థ యొక్క పరిషత్తునుకూడా మెప్పించి భారతీయ చలన చిత్ర సంగీతం గొప్పతనాన్ని నిరూపించిందని సైగాల్ అన్నారు. తర్వాత బర్మన్– ఆశాభోంస్లేల గానసభ జరిగింది.

ఆనాటి మూడో విందు వరసూ స్టుడియో ప్రొడక్షన్ కంట్రోలర్ వెంకటేష్ ఇచ్చినది. క్రితం రోజే వరసువారి కొత్త హిందీ చిత్రం 'సితారోంసే ఆగే' బొంబాయిలో విడుదల అయింది. ఆసందర్భంగా వారు ఫిలిం ప్రముఖులకు రేడియో క్లబ్‌లో విందుచేశారు.



బి. ఎ. ఎస్. వారి 'చెంచులక్ష్మి'లో హిరణ్యకశిపుడుగా రంగారావు

# 'సితారోం సే ఆగే'

వరసూవారి 'సితారోం సే ఆగే' చిత్ర నిర్మాణం రెండేళ్ళనాడు జ్ఞాన్ ముఖర్జీ దర్శకత్వాన ఆరంభమైంది. ముఖర్జీ హఠాన్మరణంవల్ల దరిమిలా, సత్యేన్‌బోస్ దర్శకత్వం స్వీకరించారు. అప్పుడు, కథ, స్క్రీన్‌ప్లే కూడా రూబీసెన్, తిరిగి వ్రాయడం జరిగింది. ఫలితం: 'పిగ్మేలియన్' 'ఎ స్టార్ ఈజ్ బార్న్', 'ట్రపీజ్' వంటి సీమసినిమాలను తిరగాబోగ్లావేసి కలగాపులగం చేసి తీసిన 'కాక్‌టెయిల్'. చిక్కుక్కడంటే ఇందులో మొదటి సగం వరకు పాత్రల రూపకల్పన, కథనడక, ఈ చిత్రాల అడుగుజాడల్లో సాగింది. ఆ తరువాతది అంతా బొంబాయి 'వైద్యం'

ఒకానొక అనామికలో అజ్ఞాతప్రజ్ఞను పసిగట్టిన ఒక డైరెక్టర్ ఆమెను పెద్ద నటిని చేసి పైకితీసుకురావటంవరకూ – మొదటి రెండు చిత్రాల ప్రభావం కనబడుతుంది. ఆనక, అప్పటివరకు మంచి దశలోఉన్న హీరోయిన్, ఈ కొత్తనటినిచూసి కినిసి, ఆ డైరెక్టరుమీద పగబట్టి, అతనికి అంగవైకల్యం సంప్రాప్తింపచేస్తుంది. ఈ ఊహ 'ట్రపీజ్' సినిమాదనిపిస్తుంది. పోతే, ఈ కొత్తనటి గొప్పదై తారగా మారడంతో, తనను పైకి తెచ్చిన డైరెక్టరును ప్రేమిరాజని, తన యిష్టంవచ్చినట్టు వ్యవహరిస్తుంది. ఇంతవరకు బాగానే ఉంది. తరవాత భాగంలో కథ పేకమేడలా అర్భకంగా, ఉఫ్ మంటే పడిపోయేలా తయారైంది. అన్నిటికన్నా చిత్రం ఏమిటంటే, ఇందులో హీరో స్టేజిమీద ఉన్నప్పుడు కుంటివాడు కాదు. దిగితేనే ఆ సంగతి గురుతు వస్తుంది కాబోలు. అతని జీవితం మారి దారిన బడటం కూడా 'షకే ఫక్కీ'లో జరిగింది. ఈ దృష్ట్యా, ఈ అవధుల మేరకు, ఉన్నంతలో అశోక్‌కుమార్ ముఖ్యపాత్రను అద్భుతంగా నటించాడు.

...లేదు పైకి తెచ్చిన కొత్త నటి గా జయంతిగాల మనోహరంగా ఉంది. ఆమె నృత్యాలు (దర్శకుడు హీరాలాల్) ...డా చాలా బాగున్నాయి. ఈ చిత్రం ...విజయానికి అదే ముఖ్యాకర్షణ కావాలి. ...తే, ఈ చిత్రంలో జానీవాకర్ పుష్క...గా హాస్యం సరఫరా చేశాడు. అతను ...టించిన పాత్ర కూడా అందరికీ అభిమాన పాత్రం కాగలదిగా ఉంది. జానీవాకర్, ఇంతవరకూ పాల్గొన్న అన్ని చిత్రాలకన్న మిన్నగా ఇందులో నటించాడు. మిగతా వాళ్ళ గురించి చెప్పుకోవలసిందేం లేదు.

బర్మన్ సంగీతం హాయిగా ఉంది. కొన్ని పాటలు పాత బాణీలను (ఆయనవే) గుర్తుకు తెస్తున్నా, చక్కని నగిషీలతో ఆహ్లాదకరంగా వినిపిస్తాయి. ఛాయాగ్రహణం చాలా బాగుంది.

## 'సాక్షిగోపాల్'

మొన్న విడుదల అయిన మరో చిత్రం రత్నదీప్ పిక్చర్స్‌వారి 'సాక్షి గోపాల్' భరత్ భూషణ్, కుమారి నందా ఇందులో పాల్గొన్నారు. 'పుణ్యం పురుషార్థం' అని చెప్పుకోతగ్గ కథచిత్రం ఇది. ఒరిస్సాలోని సాక్షి గోపాలస్వామి అవతరణ గురించిన కథ చిత్రించారు. భక్తిరస ప్రధానమైన కథ, సంగీత నృత్యప్రధానమైన చిత్రణ గల 'సాక్షి గోపాల్' చిత్రానికి మంచి నటన, మనోహరమైన సంగీతం (చిత్రగుప్త) తోడై ఇది చక్కగా రూపొందింది. దైవభక్తి పరాయణులకు అభిమానపాత్రం కావడం అలా ఉండగా, విగ్రహారాధన అంటే గిట్టనివాళ్లను కూడా సంతోషపరచ గల శక్తి ఇందులో ఉంది. హిందువులందరు వెళ్ళి చూడతగ్గ చిత్రం.

(ఆంధ్ర వార పత్రిక బొంబాయి విలేఖరి)





రత్నదీప్ పిక్చర్స్‌వారి 'సాక్షి గోపాల్'లో భరత్ భూషణ్, కుమారినందా.

## మద్రాసులో వినోదం పన్ను

బొంబాయిలో గతవారం పండుగ కూడా పుడి మెండుగా ఉండగా, మద్రాసులో, ఫిలింవరాలలో కొత్తపన్నులు గురించిన ఆందోళన ప్రవర్తిల్లింది.

మద్రాసు ప్రభుత్వం, రాష్ట్రంలో సినిమాలపై వినోదం పన్ను రేటును హెచ్చించింది.

ఇలా చేయదలచుకొన్నట్లు, ఈ నెల తొలి వారంలో రాష్ట్ర ఆర్థికమంత్రి బడ్జెట్ ప్రతిపాదించినపుడు ప్రకటించారు.

ఉన్న పన్నులతోనే వెన్ను విరిగేలా వున్న సినిమామీద కొత్తబరువు వెయ్యడం న్యాయంకాదని, పరిశ్రమ అభివృద్ధికి యిది గొడ్డలిపెట్టు అవుతుందనీ, ఫిలిం నిర్మాతలూ, డిస్ట్రిబ్యూటర్లూ, ఎగ్జిబిటరూ ఆందోళన వెలిబుచ్చారు. "పన్నులు పెరిగితే, టిక్కెట్ల రేటు పెరుగుతాయి. అవి పెరిగితే సినిమాకి వచ్చే జనసంఖ్య తరగడం ఖరారు. అందువల్ల పరిశ్రమ అభివృద్ధికి ఆటంకం తెచ్చిపెట్టే ఈ ఆలోచనను ప్రభుత్వం విరమించుకోవాలి" అని దక్షిణ భారత చలనచిత్ర వాణిజ్యమండలి ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది.

మార్చి 15-వ తేదీన రాష్ట్ర శాసనసభ వినోదం పన్ను (సవరణ) బిల్లును ఆమోదించింది. దీని ప్రకారం ఇంక, సినిమా, గుర్రప్పందాల మీదనే పన్నులు వేస్తారు. నాటకాలూ, గానసభలూ మొదలయినవాటికి ఇది వర్తించదు. హెచ్చింపు మూడు అంచెలలోనూ ఈవిధంగా ఉంటుంది :

మొదటి అంచెలో పన్ను 20% నుండి 25% కు, రెండవ అంచెలో 25% నుండి 33 1/3% కు, మూడవ అంచెలో 33 1/3% నుండి 40% కు పెంచుతారు. ఇటుపై టూరింగ్ సినిమాలమీద కూడా చలనచిత్ర ప్రదర్శన సుంకం విధిస్తారు.

ఈపన్ను గురించి రాష్ట్ర శాసనసభలో చాలా చర్చ జరిగింది. పేదలకు తక్కువ ఖర్చులో వినోదం అందించే యీ సినిమా మీద కూడా యీ పన్ను వేస్తే టిక్కెట్ల రేట్లు పెరిగి వాళ్ళకి సదుపాయం ఉండదేమో నని పలువురు అన్నారు. సినిమా పరిశ్రమ ప్రతినిధులు కూడా ఈ విషయం తమకు చెప్పారని మంత్రి సుబ్రహ్మణ్యం అన్నారు. పోతే రేట్లు పెరగటంవల్ల తగ్గేది ఒకచిత్రానికి రెండోసారి మూడోసారి వెళ్ళే జనాభా పేనని వాళ్ళే చెబుతున్నారని, దీనివల్ల ఆ అలవాటుపోతే మంచిదేననీ మంత్రి అన్నారు.

రేట్ల పెంపకం (ముఖ్యంగా చిన్న తరగతివి) వల్ల టిక్కెట్ల అమ్మకం పడిపోతుందన్న సంగతి పరిశ్రమలో వారికికూడా బాగా తెలుసు కాబట్టి, పేదవాళ్ళ టిక్కెట్లు

పెరుగుతాయని ఎవరూ భయపడ నక్కర లేదని మంత్రి భావగర్భితంగా జవాబు ఇచ్చారు.

## మద్రాసులో షిరోకిడో

జాపనీస్ ఫిలిం వణిక్ప్రముఖుడు షిరోకిడో ఈ నెల 10 న బొంబాయినుండి మద్రాసువచ్చి రెండురోజులున్నారు. ఈ రెండు రోజులలోను ఈయన ఇక్కడి ఫిలిం ప్రముఖులతో చిత్రనిర్మాణ వ్యవహారాలకు సంబంధించిన విషయాలనేకం చర్చించారు. వాహినీ ఎ. వి. యం., జెమినీ స్టుడియోలను సందర్శించి, రెండు తమిళ చిత్రాలు చూచారు.

దక్షిణభారత ఫిలిం వాణిజ్య మండలి సభ్యులు శ్రీ కిడో గౌరవార్థం మైలాపూర్ ఉడ్ లాండ్స్‌లో విందు చేశారు. ఈ సభలోను, ఇంతకుముందు జరిగిన విలేఖరులగోష్ఠిలోనుకూడా, భారత జపానుదేశాల చలనచిత్ర పరిశ్రమల సహకారం విషయంలో కిడో ఆశాభావం వెలిబుచ్చారు. ఇచ్చిపుచ్చుకోవడాలకు, సంయుక్త నిర్మాణాలకు అవకాశాలు ఏర్పడగలవని ఆశిస్తున్నామన్నారు.

శ్రీ కిడో జపాన్ ఫిలిం పరిశ్రమలో అగ్రశ్రేణి నిర్మాత. అక్కడ "షోచికూ ఫిలిం కంపెనీ" అధ్యక్షుడుగా గత పాతిక ముప్ఫై ఏళ్ళలోనూ డాక్యుమెంటరీలు, కథాప్రధాన చిత్రాలూ, హాస్యచిత్రాలూ మొదలైనవి వెయ్యికిపైగా నిర్మించారు.

జపాన్‌లో ఫిలిం పరిశ్రమ పరిమాణాన్ని వివరిస్తూ గత సంవత్సరం 468 కథాచిత్రాలు తయారైనవని చెప్పారు. ఇవికాక డాక్యుమెంటరీలు, వార్తాచిత్రాలు వేరే ఉన్నాయి. పిల్లలకై తీసే చిత్రాలే ఏడాదికి నూరువరకూ ఉంటున్నాయన్నారు. ఈ సందర్భంలో మన దేశపు చలనచిత్ర సంస్థ నిర్మాణ విధానాలను ప్రశంసించి, జపాన్‌లోకూడా ఇటువంటి సంస్థ నెలకొల్పితే ఇతరదేశాలతో ఇచ్చిపుచ్చుకునే సంబంధాలు వృద్ధిచేసుకోవడానికి బాగుంటుందనుకొంటున్నామన్నారు. భారతీయ సంస్థతో కలసి ఒక చిత్రం నిర్మించాలన్న ఆలోచన ఉన్నట్లు కూడా ఆయన చెప్పారు. శ్రీ కిడో క్రిందటినెల న్యూయార్కులో జరిగిన జాపనీస్ చలనచిత్రోత్సవంలో పాల్గొనడానికై అమెరికా వెళ్ళి అక్కడనుండి, పశ్చిమ ఆసియాదేశాల పర్యటనకు బయలుదేరి టోక్యో చేరడానికి ఆఖరు మజిలీగా మనదేశం వచ్చారు.

మద్రాసులో, శ్రీయుతులు ఎ. వి. మెయ్యప్పన్, టి. ఆర్. సుందరం ప్రభృతి నిర్మాతలు విమానాశ్రయంలో శ్రీ కిడోకు స్వాగతమిచ్చారు.

ఆ రోజురాత్రి శ్రీ మెయ్యప్పన్ కిడో గౌరవార్థం తమ స్టుడియోలో విందుచేశారు.

మొత్తంమీద శ్రీ కిడో ఆగమనంవల్ల, ఈ దేశంలో వారు ఆయనతో జరిపిన సంప్రదింపులవల్ల భారత జపాన్‌లమధ్య చలనచిత్ర వ్యాపారసంబంధాలు వృద్ధికావడానికి మంచి అవకాశాలు ఉన్నట్లు విశదం అయింది. ఈ విషయంలో బొంబాయి వర్గాలకన్న దక్షిణాదినే ఎక్కువ ఆశాభావం గోచరిస్తున్నది. ★

## నెల్లూరులో కొత్త సినిమా

నాలుగు లక్షల రూపాయల ఖర్చుతో, నెల్లూరులో కొత్తగా వెలసిన సినిమా 'రంగమహల్'ను ఆంధ్రప్రదేశ్ స్థానిక స్వపరిపాలన వ్యవహారాలమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి గతవారం ప్రారంభోత్సవం జరిపారు. దీనితో తెలుగునాటి సినిమావాడి అనదగ్గ నెల్లూరు కేంద్రంలో థియేటర్ల సంఖ్య ఆరుకు పెరిగింది. పెరుగుతున్న చిత్రనిర్మాణ పరిశ్రమకు ఉజ్జీగా ఎదగకుండా ఉన్న థియేటర్ల సంఖ్య ఒక్క అంకె పెరిగింది. ప్రేక్షకుల మాట ఎలావున్నా పరిశ్రమకు ఇది చాలా మంచివార్త అనడానికి పరిస్థితులు తెలిసినవారు ఎవరూ సందేహించరు.

ఈ రద్దీతోనే, నిర్మాతకి డబ్బు వసూలు చేసి పెట్టే ఈ చోటుమీద పలుకుబడి ఉన్నవారి బహాద్బీ ఎక్కువైపోతోందని, ఆ బాధ తెలిసిన ఒక నిర్మాత అమధ్య అన్నారు. చోటు గిరాకీవల్ల ఈ నాడు, బాగానే ఆడుతూ ఉన్న చిత్రాలు కూడా, సత్తా ఉన్నంతవరకూ కడిచేరా డబ్బు రాబట్టుకోకుండానే, కొత్తవాటికి చోటుఇచ్చి, లేచిపోవాల్సివస్తోంది. రోజుకి, నూటయాభై రూపాయలు కనీసపరిమితి అయి ఉండగా, ఆరువందల చిల్లర వసూలుచేసున్న వాటికీ కూడా ఈ గతి తప్పటం లేదని కొన్ని సందర్భాలవల్ల తెలుస్తోంది. తయారవుతున్న చిత్రాల సంఖ్య, పరిశ్రమలో తిరుగుతున్న డబ్బు గురించిన లెక్కలనుబట్టి చూస్తే తెలుగుదేశంలో థియేటర్ల సంఖ్య పెంచే విషయం శ్రద్ధగా ఆలోచించవలసినదని తేలుతుంది. హిందీ చిత్రాలకు కూడా విశేషాదరణ లభించే ప్రాంతం కాబట్టి, ముఖ్యంగా పెద్ద పట్టణాలలో ఇది సమస్యే.

* * *

'రంగమహల్' ప్రారంభోత్సవానికి ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి కూడా వచ్చారు. థియేటర్ యజమాని శ్రీ ఆనం రంగారెడ్డి, ప్రముఖ దర్శక నిర్మాత శ్రీ బి. ఎన్. రెడ్డి అతిథులకు స్వాగతం చెప్పారు. సంజీవరెడ్డిగారు, శుభాభినందనలు తెలుపుతూ, ఏడేళ్లినాడు తాము నెల్లూరులో 'శేష్‌మహల్'ను ప్రారంభోత్సవం జరిపినవిషయం ప్రస్తావించి, త్వరలోనే, ఇంతమంచి హాలును నిర్మించడం చూడగా, ఇది బాగా లాభసాటి వ్యాపార మనిపిస్తోందని ఛలోక్తి విసిరారు.

శ్రీ బ్రహ్మానందరెడ్డి చిత్రనిర్మాణం గురించి మాట్లాడుతూ, లాభం గడించడం అవసరమే అయినా అదే పరమావధి అని ఎంచక నిర్మాతలూ, దర్శకులూ బాధ్యత గుర్తెరిగి మంచిపద్ధతులలో చిత్రాలు తీయాలని అన్నారు.

ప్రారంభోత్సవ సభ ముగిశాక, వాహినీ వారి 'భక్తపోతన' చిత్రంతో ప్రదర్శనానికి నాంది ప్రస్తావించారు. ★



ప్రముఖ సినీనటి శ్రీమతి దుర్గాఖోటేకు సంగీత నాటక పరిషత్తు అవార్డును శ్రీ రాధాకృష్ణన్ ప్రసాదించారు.

## భర్తృవియోగంవల్ల స్త్రీకి ఏర్పడే శూన్యస్థితి!

(30-వ పేజీ తరువాయి)

ంచేందుకు మరెవరూ లేకపోవటంవల్ల సరిపోయింది కాని లేకపోతే నేనెంత బాధపడేదాన్నో.

వెస్ట్‌చెస్టర్‌లో నేను కొన్న ఇల్లుకేవలం అద్దెకిద్దామనుకొన్నానని చెప్పాను. కొంత డబ్బు ఖర్చుపెట్టి ఇల్లు బాగు చేయించాను గాని అందంగా ఉంచేందుకు ఏమీ చెయ్యలేదు. మరమ్మతుపనంతా పూర్తయిన తరవాత, మా పాతఇల్లు వదిలిపెట్టి ఈ కొత్త ఇంట్లోకి మారాలని బుద్ధిపుట్టింది. దాంతో అంతా మార్చాల్సి వచ్చింది. అప్పుడే పెయింట్ చేసిన నేలంతా మళ్ళీ యథాప్రకారం చెయ్యాల్సి వచ్చింది. వెల్ల వేసిన గోడలకు, రంగులు వేసిన కిటికీలకు, దర్వాజాలకు మళ్ళీ కొత్త రంగు సున్నం, కొత్త రంగులు వేయించాను. స్నానాలగదులు, మరుగుదొడ్లు మార్పించాను. వంటగది మార్పించాను. చేసినదంతా వృథా అయి, కొత్త మార్పులకు బోలెడు ఖర్చయింది.

అయినా నాకేమీ చింతకలగలేదు. నా పొరబాటుకు మరొకరు కష్టపడే పని లేదు గనక నేనేం చేసినా చెల్లుతుంది. నా ఇష్టం వచ్చినంత బాధ్యతారహితంగా ఉండవచ్చును ఒంటరి జీవితంలోని లాభాల్లో ఇదొకటి.

ఒంట్లో బావుండనప్పుడు ఎవర్నీ కలుసుకోకుండా ఒకతైనే తలుపులు గడియ పెట్టుకుని ఉండిపోవచ్చును. రాత్రినిద్రపట్టకపోతే నా ఇష్టం వచ్చినంత సేపు ఇంట్లో అటూ



ఉగ్రనారసింహుడి, ప్రచండ ప్రతాపాన్ని, యథాశక్తి వర్ణించి దేవతలకు సంగతి సందర్భాలు నివేదిస్తున్న నారదుడు. బి. ఎ. ఎస్. వారి 'చెంచులక్ష్మి'లో ఒక సన్నివేశం.

## ★ భర్తృవియోగంవల్ల స్త్రీకి ఏర్పడే శూన్యస్థితి ★

ఇటూ పచారుచెయ్యవచ్చును. ఎవరికీ నిద్రాభంగం కాదు. పోలీసుల్తో పేచీవచ్చే పనులు తప్పిస్తే ఇంకేమైనా నా ఇష్టారాజ్యంగా చెయ్యవచ్చు.

ఒకసారి జనవరిలో విదేశయాత్ర చెయ్యాలనిపించింది. మరోకవారానికల్లా ఇంగ్లండు వెళ్ళే నౌక ఎక్కాను. తీరా ఇంగ్లండు వెడితే లండనులో ఉండటానికి జనవరిలో అంత బాగుండదనిపించింది. అక్కడ రెండు వారాలే ఉన్నాను. అయినా నా తొందర పాటు ఫలితాలు నేనే అనుభవించాను గాని మరెవర్నీ అవస్థపెట్టలేదు.

ఒంటరిగా, బాధ్యతలు లేకుండా జీవించటమే మంచిదనికాదు నా అభిప్రాయం. కుటుంబంలో భాగస్వామినిగా, భార్యగా, తల్లిగా ఉండడంలో ఉన్న ఆనందం ఒంటరిగా ఉండటంలో లేనిమాట నిజమే. కాని వితంతువైన స్త్రీ ఏం చేస్తుంది? జీవితం అద్భుతవరంలాంటిది దాన్ని అశ్రుమయం చేసుకుని పాడు చేసుకోకూడదు. ఇది గ్రహించగానే నాలో ఒక కొత్త ఆశ చిగిర్చినట్లయింది. ఉదయం లేవగానే ఈ వేళ షాపుల్లోకి ఎవరు వస్తారో, ఈ దినం ఎలా అంతమవుతుందో అనే ఆలోచనతో ఎదురుతెన్నులు చూసేదాన్ని.

వితంతువుల సంఘం ఎడంగా ఉండటం ఒకందుకు మంచిదే అనిపిస్తుంది. ఏ చీకూ, చింతా, బాధ్యతా, ఉండవు. తనకు అత్యంత ప్రియమైనదాన్ని ఆమె కోల్పోవటంతో తన్నుతాను కోల్పోతుంది. తన్ను తాను కోల్పోవటంతో యావత్ప్రపంచాన్నీ తనదిగా చేసుకుంటుంది.

నెలరోజులకిందట మా పాతఇంటిని అమ్మివేశాను. జెసీ అట్కిన్సన్ అనే అతను మా ఇల్లు కొన్నాడు. అతను చిన్నవాడే. అతడూ, అతని భార్యా నన్ను తమ ఇంటికి వచ్చి ఆతిథ్యం స్వీకరించవలసిందంటూ ఆహ్వానించారు వస్తానన్నాను.

నేను వెళ్ళేటప్పటికి ఇల్లంతా దీపకాంతితో మెరిసిపోతోంది. దంపతులిద్దరూ వాకిట్లో నవ్వుతూ నుంచున్నారు. మిస్టర్ అట్కిన్సన్ సోదరి తన బిడ్డతో సహా అన్నగారింటికి చుట్టపుచూపుగా వచ్చి ఉన్నది. మధ్య గదిలోంచి మాటలు, నవ్వులు వినిపిస్తున్నాయి. "మీ పిల్లలేరీ" అని అడిగాను. ముగ్గురు ఆడపిల్లలూ పై అంతస్తులో నిద్రపోతున్నారట. చంటివాడు రెండో అంతస్తులో చిన్న పడకగదిలో ఉన్నాడట ఆ చిన్న పడకగదిలోనే రాల్ఫ్ పెరిగి పెద్దవాడయ్యాడు.

నేను మూడు సుదీర్ఘ సంవత్సరాలు ఏకాంతంగా గడిపిన ఆ యింట్లో ఇప్పుడు విశ్రాంతికి, విచారానికి తావులేదు. వచ్చేపోయే అతిథులతో ఇల్లంతా సందడిగా ఉంటోంది. ఇంటిచుటూ ఉన్న అందమైన తోటలో మళ్ళీ ఒక కొత్త కుటుంబంలోని వ్యక్తుల నవ్వులు ప్రతిధ్వనిస్తాయి. ఒకప్పుడు మేము గృహాన్ని ఎంతగాఢంగా ప్రేమించామో ఇప్పుడా కొత్త కుటుంబంలోనివాళ్లు కూడా అంతగాఢంగా ప్రేమిస్తున్నారు.

కొంతసేపైనతరవాత వెస్ట్‌చెస్టర్‌లోని నా చిన్న యింటికి వెళ్ళిపోయాను. రాత్రిబాగా పొద్దుపోయేదాకా అలా మేలుకుని ఆలోచిస్తూ కూర్చున్నాను. నాకు తగినఇల్లు ఇదే అని తోచింది. మా పాత ఇంట్లో ఇప్పుడు మరోకకుటుంబం ఉంటోంది. ఈ చిన్న ఇంట్లో నేనొక్కర్తెనే ఉంటున్నాను. నేనెక్కడ ఉన్నా ఇబ్బంది లేదు. గడచిన కాలంలాగానే రాబోయే కాలంకూడా శుభప్రదమే అవుతుందని నా విశ్వాసం.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd by S Radha krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



"ఇలసాటిలేని జంట"

ఫొటో: ఎ. వి. రామమూర్తి—ఉయ్యూరు